# బాబాఆయుర్వేదనిలయంవారి దివ్యౌషధములు

## సిద్ధయోగరసాయనం

నీవెప్పుడెక్కడనున్నా రోగమనే భయంలేకుండా అన్నినొప్పులు, విరేచనాలు, కలరా, వాంతి, రక్తకాసము, మూర్ఛ, చంటిబిడ్డగుణం, దగ్గు, జ్వరం, నల్లమందలవాటుమానుట, ముక్కు, అంగుడిలోకల్గుపుండ్లువగైరా 85 రోగములకుపనిచేయు గుణవిధానముగల స్వంతడాక్టరు. ఇందు చెరుపుచేయు వస్తువులులేవు పిన్నలు, పెద్దలు వృద్ధులు, బాలింతలుసహా లోపలికిసేవించుటకు, పైనిపూయుటకు ఉపయోగమై అనేకమంది యోగ్యతాపత్రములనందుచున్నది. పేదలలో నిరుపేదలుసహా సిద్ధయోగరసాయనం ఫలితము ననుభవించుట కేర్పరచిన వెల రు 1-0-0 మాత్రమే.

## అద్భుతదర్శిని

ఇది గొప్పశక్తియుక్తమై సకలదేవతాబంధుమిత్రులు, పోయినవస్తువులు, దొంగలు కన్పించుటయేగాక, పరీక్ష, లాటరీవ్యాజ్యములలో గెల్పురహస్యములజెప్పి చూచినవారమెప్పొందు ప్రభావముగల యోగశక్తి వెల రు 2-8-0 ఆర్డరుతోడబ్బుపంపిన పోస్టేజీఫ్రీ.

## నేతాజీమేజర్ బెల్డోనా

కత్తికన్నిసెగచూపి బెల్డోనాతీసి గుడ్డకుపూసి అన్నిగడ్డలకు నూతనబుడ్డలకు వాపులకు, చీములేనిపుండ్లు వ్రణములకు 3 రోజులకొకసారిన్ని, తతీమా వాటివీలును బట్టి రోజుకు 1, 2 దఫాలువాడేది వేపవపట్టీవేన్నిళ్లతో కాపి సులువుగా తీయవచ్చు వాపులుహరించుటకు గడ్డలైతే పగులగొట్టి మాన్పుట కమోఘమైనది.

## కుషీకుసుమ

శిరస్సుపోటు, కండ్లమంట, ఎరుపు, నీరుకారుట, ఉడుకునుతగ్గించి మెదడునకు చల్లదనము, జ్ఞాపకశక్తి, చురుకు, కేశములవృద్ధి, మృదువును కలుగజేయుటలో అమోఘమైనది. సువాసనకలిగి 60 తులములనూనెలో కలియుడబ్బీ 0-12-0

## మలేబామ్

మలేరియా, పురాణజ్వరములు, వరుసజ్వరములు, ఏమందులవలన నెరవేరక కొన్నిసంవత్సరములనుంచి కనిపెట్టుకొనియుండి అప్పుడప్పుడు బాధించుచూ వచ్చుచున్న జ్వరములను 1 మోతాదే యొసికించి 3 మోతాదులతో నిరంతరశమొనర్చు ఆటంబాంబ్ వెల రు 1-8-0

షరా:— ఐదురూపాయలకు తక్కువగాని ఆర్డరుకు పోస్టేజీఫ్రీ. ఆర్డరుతో మూడవవంతు సొమ్ము అడ్వాన్సుగా పంపవలెను.

---

బాబా ఆయుర్వేద నిలయం, హెడ్డాఫీసు — ఏలూరు.

# వసుచరిత్రము

భట్టుమూ_ర్తి నామాంతరముగల

## రామరాజ భూషణకవి ప్రణీతము.

*CHECKED - 1963*



ప్రకాశకులు :

యస్. అప్పలస్వామి అండ్ సన్సు,

పబ్లిషర్సు అండ్ బుక్సెల్లర్సు,

రాజమండ్రి.

1948.

 [వెల రు 1-4-0



రాజమండ్రి

గౌతమీ ముద్రణాలయమునందు

ముద్రింపబడియె.



శ్రీగురుభ్యోన్నమః.

# వసుచరిత్రము

## ప్రథమాశ్వాసము

శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమం, జీరాగ్రరత్నస్ఫుర
లాభివ్యక్తివరాంఘ్రిరేణుభవక, న్యాలీలయం జూచున్ మదిం
దా భావింప శుభక్రమాకలనచేఁ, దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేం, ద్ర శ్రీమహారాయనిన్.

సీ. సకలలోకాభినంద్య కలాకలాపంబు, దోఁచయు నెమ్మోము చందురునితోడ
బహుదివ్యఫలపరిపాక సౌభాగ్యంబు, నెరపు కెమ్మోవి మానికముతోడ
నవనయ శ్రీనిధానంబులై తగు నుర్రో, భవ సుధాపూర్ణ కుంభములతోడ
సమ్లాన సుమమాలికాభిరూప్యము దాల్చు, లలిత భుజాకల్ప లతలతోడ

తే. నడరి జనకాబ్ధిసీమ రామాభిధాన, హరి కహీనగుణప్రోత హర్షశరాప
గిరిమథన యత్నమునఁ దోఁచుసిరియ శేష, రాజ్యము లొసంగుఁ దిరుమల రాయమణికి

మ. సకలామోదక తాళవృత్తగతులన్, సంగీత సాహిత్యనా
మక విద్యాయుగళంబు పల్కఁ జెలికిం, బాలిండ్ల జోడై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘు, ప్రస్తారముల్ సేయు స
ర్వకలాకాంతుఁడు ప్రోచుఁ దిర్మలమహా రాయ క్షమావల్లభున్.

మ. రమణీయాక్షసరాకృతిం బోలుచు వర్ణశ్రేణి కీణానులా
పముచేతం గరఁగించి యందు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాళియం దెల్లఁ బూ
ర్ణము గావించినవాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుం గృపన్.

శా. భావం బెక్కడ లేక స్వస్తినియమా సాయంబుఁ జింతింపకెం
దేవర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవి ప్రణీతకృతిసామాన్యాకృతిం బూని పై
పైవన్నెల్ పచరింప దాని, దెలికిం పం బోరు ధీరోత్తముల్. 11

వ. అని యిష్టదేవతా వందనంబును సుకవికవితాభినందనంబును గుకవి నిందనంబునుం
గావించి సనాతనాధునాతనాఖిల మహాకవి జనానుగ్రహంబునఁ బురాతన పుణ్య
శ్లోక రాజర్షి వర్ణనాకర్ణనోత్కంఠిత సకల జనసేవ్యం బగునొక్క మహాకావ్యంబు
రసోచిత చమత్క్రియాకల్పనాకల్పితభవ్యంబు గా నొనరింపం బూని యున్న సమ
యంబున. 12

సీ. వసుమతీ భారధూర్వహత నెవ్వని యుర్వి, రావరాహాంక మర్థము వహించు
గరతరచక్రవిక్రమశక్తి నెవ్వాని, రామానుజత్వంబు రమణ కెక్కు
జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నెవ్వాని లోకేశ్వరత్వము హాసంగు
జటులశార్వరమగ్న సర్వవర్ణోద్ధార, పటిమ నెవ్వని రాజభావ మెసగు

తే. నతఁడు వీరప్రతాప రాజాధిరాజ. రాజపరమేశ్వరాష్టది గ్రాజకులమ
నోభయంకర బిరుద సన్నుతజయాభి రాముగుణహారి తిరుమల రాయశౌరి.

వ. అండియుం బ్రచండరుచిపిచండిల మార్తాండ మండల పాండిత్య భూషిత భుజార్గళ
నిరర్గళ ప్రతాపదీపిత ప్రకాశకాశికీ భూతికదవభూతల భీతాభీత విమతక్ష్మాధీశ్వ
రుండును, విశ్వవిశ్వంభరావినుత శాశ్వతైశ్వర్యధుర్యతామహేశ్వరుండును, సంభోది
వసన సంభాసమానకుంబినీ వలయ సంభరణవీక్షాశుభాగంభ సుభగంభావుక గంభీర
భేరభాంకరణదంభశుంభ దంభోధర గర్జా సముజ్జృంభణ సంభావితాత్మీయ పట్టాభి
షేక సమయ సముత్తంభితశాతకుంభ కుంభని గుంభితాంభోవర్ష విద్రావిత క్షుద్ర
నృపోపద్రవతాపభద్రవద్రసానిత్యరసార్ద్రితానుసంధాయక దైనందినదానధారాప్రవా
హుండును, వసమసధుగసముత్సాహసాహస సహాసితసిత వాహుండును, నభగంభు
వనమంగళపస్వస్వ మరకతదండ పుండరీకాగ్రవర్ణనీయ సువర్ణకలశ కర్ణికాధిష్టిత
రాజ్యలక్ష్మీగర్భోద్ఘ పథానాడంబరసంబోధ కాంబురుహ బంధుబింబానుబింబ వైభ
వుండును, త్రైలోక్యవినుతచాళుక్య నారాయణాంక సంకల్పితాశేషహోమణ ప్రౌఢ
వుండును, గృపాణకృష్ణనిర్మథ్యమానర జార్ణ వసముత్పన్న విజయలక్ష్మీనిక్షిప్తనిరు
పమరిక్షణ నగకృరవు కరపతాకానోకః మాత్రసంపాదితకంపస్వేద భీయూథవక్షా
నావజీర సేనామాన భేదనుండును, శ్రీరామచంద్ర చరణకమల యుగళాభివాద
నుండును నాత్రేయగోత్ర పావనుండును నఖిలకర్ణాటరాజ్య పునరుజ్జీవనుండును

శ్రీరంగరాజరత్నరత్నాకర పూర్ణచంద్రుండును, నగు తిరుమలరాయదేవేంద్రుండు నిస్తంద్రవిభవసాంద్రుండై యొక్కనాఁడు వజ్రకీలితద్వార బంధబంధుర లక్ష్మీవిలాసంబు జననసమయ జలాంతర్లక్ష్యమాణ జలజసదనా సమాగమన సంపదసాంప్ర సంపాదింపసాభోగ యవనికాభ్యంతరలసద్యస్నమాద్యత్ యంత్రపాంచాలికాసంచారంబులం జెలుఁగు తరంగ మరుఁగు దొరంగివచ్చు నచ్చరమెరుంగుఁ బోండ్లతెఱంగు సెరంగింప జంద్రకాంతభిత్తిబింబిత చంద్రాననా వదనంబులు తరంగభక్తి బహూకృతసవేందుబింబంబుల యందంబు పొందుపరుప నభినవస్ఫటికోపల సంస్థాపిత సోపానపార్శ్వ కరికరాకార రేఖావిశేషంబులు సప్రతిచ్ఛాయ సంజాయమాన సంక్రందనవేదండ శుండాదండ ప్రచారంబులం బచరింపఁ, గలశవారాశి చెలువునం బొలుపలరు విమల పట్టాంబర వితాన విద్యోతమాన మహాస్థాన భవనరాజంబునం దెలిదీవికైవిడలరు నమూల్యముక్తామయ సింహాసనంబున సుఖాసీనుండై సామంతమకుటఘట్టనజాతజాతరూప రేణుపరంపరఁ బీతాంబరత్వంబు వహించిన మిత్రవర్గంబుతో సారూప్యదేదీప్యమాన భక్తోపలాలన పరాయణుండగు నాదినారాయణుకరణి సిరుల నిరవొందుచు.

సీ. కటకేంద్రుఁ డంపిన గంధసింధురములు లా, త్మస్వామిమూరు హాస్తములు మొగువ
హయనాథుఁడంపిన హరులు కైజామోర, లాగ్చుచుఁ బతికి జోహారుసేయ
నాహాడపతి పంపిన యమూల్య కటకముల్, కర్త పేరుగఁ బదాగ్రములఁ బెనఁగఁ
బాండ్యేశుఁ డంపిన భర్మంబు లధిపతి, ప్రతిగా నిజాంక ముద్రలు వహింప

తే.గీ. శౌర్యకీర్తులతో నచ్చు సకలదిక్కు, లింద్రరాజ్యేందిరలమాడ్కి నిగురుబోండ్లు
చటులమాణిక్య మయదండ చామరచామ, రములు వీవంగఁ బేరోలగమున నుండె.

మ. వసుశ్రీరామ పదారవిందభజనా నందుల్ జగత్ప్రాణనం
దన కారుణ్య కటాక్షలబ్ధ కవితా ధారాసుధారాశి సం
జనితైకైక దినప్రబంధ ఘటికా సద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళా రహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెన్నృపుల్. 16

శా. శ్రీరామక్షితిపుత్ర మద్గ్రజ జయశ్రీలోలు నానాకళా
పారీణుల్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయ వేదండాగ్రహారాదిస
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండవీ వన్నిటన్. 17

గీ. తరుతటాకాదిసంతతుల్ ధరణి నెచట, నిలిపిరచటనే యుండు వానికిని గృతిము
ఖంబున నే విశ్వవిఖ్యాతి గాన కృతియె, సంతతివతంసమది మాకు సంఘటింపు. 18

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమ రత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారిత సత్కవి కల్పనాభిరూ
పావహ పూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథ గా నొనరింపుము నేర్పు పెంపునన్. 19

వ. అని సబహుమానంబుగాఁ దాంబూల జాంబూనదాంబరాగ్రహారాది ప్రదానంబుల నాదరించుటయు నేను నానందకందళితాంతరంగుడనై కృతిపతివంశావతారంబభి వర్ణించెద. 20

సీ. జనక క్షేత్రఫలం బయిన పాలపాపడు, సరవృద్ధిఁ గాంచునై వాత్సకుండు
శ్యామాభిరముఁడై యమరు రేఖాశాలి, రహి గళల్ పూను సర్వజ్ఞమౌళి
కువలయానందంబుఁ గూర్చు చల్లనిరాజు, తమమెల్ల నడచు సత్పథవిహారి
వసువులు గురియు దివ్యవదాన్యతిలకుండు, లచ్చితోఁ బుట్టిన లక్షణాఢ్యుఁ

తే. డంబుజాసనుఁ డన విధుఁ డనగ సోము, డన నెగడి హంససంగతి నదర సురలఁ
బ్రోవ దాక్షాయణీ ప్రేమఁ బూననేర్చు, జాణ చంద్రుండు కాంతి నిస్తంద్రుఁడలరు

చ. అతనికిఁ గల్గె సౌమ్యుఁడు గుణార్జవరమ్యుఁ డతం డవార్యదో
ర్యుతదివిజారిథై రవుఁ బురూరవుఁ గాంచెఁ జిరాయు వాయు వా
కృతికి జనించె నాసుకృతికిం గలిగెన్ నహుషుం డకల్మషుం
డతనికిఁ బుట్టె శావ్యదభియాతి యయాతి తదన్వయంబునన్. 22

శా. ద్వీపప్రోద్భవ సూక్తపంచమమహా వేదంబు దీపించె నే
భూపాలోత్తము పేర భారతియు నే పుణ్యాత్ము వంశస్తవం
బాపాదించి కృతార్థ యయ్యె నతఁ డా శాంతిక్షమాపాలన
వ్యాపారాభిరతుండు పొల్చుభరతుం డాత్రేయగోత్రేయుఁడై 23

ఉ. ఆభరతాన్వయంబున రణాధ్వరి యూపభుజుల్ మహాధరి
త్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు
ర్వీభరణప్రవీణులు వివేకధురీణులు దానదీక్షితా
గ్రాభిహితుల్ సుధీయుతులు దారదయాహృదయుల్ శుభోదయుల్. 24

క. ఆసంతతి వైభవజిత, వాసవుడగు తాతపిన్న వసుధాధిపుఁడు
ద్భాసిల్లెఁ గీర్తిమయము, క్తాసౌధ సువర్ణకలశ తవిభావసుఁడై

ఉ. అనుగుణాబ్ధికిం బ్రశమితాఖిలదోషుఁడు చక్రపాలనా
భ్యాసుఁడు సోమదేవుఁడను నద్భుతశీలుఁడు గల్గె నాకళా

ఖ్యాసికి నుద్భవించె దుర హుంకృతిమ త్పరవాహినీశ సం
త్రాసద బాణలాఘవుఁడు రాఘవుఁడాజికృతప్రమోదుఁడై. 26

క. ఆవిభునకు నర్జున పరి, భావకుఁ డయి పిన్నశౌరి పగిగిఁ బొడమె నం
శావహుఁడు పిన్నశౌరి ర, మావల్లభుఁ డతఁడు బుక్క మహీధవుఁ గాంచెన్.

సీ. తనభవ్యభాషణంబు తనభవ్యధామంబు, కరణి మిత్రోన్నతి కరముగాఁగ
దనధర్మగుణములు దనధర్మగుణముల, ట్టతులిత శ్రుతిమార్గ గతుల నెసఁగఁ
దనమహోహవదీక్ష తనమహోహవదీక్ష, పగిది నానావనీ పకులఁ బెంపఁ
దనయంబకంబులు దనయంబకము లట్ల పరభీరువిముఖతఁ బరిఢవిల్ల

తే. బరగుఁ గరినాద్రి జడ లుర జ్జరకనుర, కూట కిటి గూఢచరణ ది క్కోటికరటి
పటలితా సహ భూసౌఖ్య ఘటనభూరి, భుజబలవిహారి యార్వీటి బుక్కశౌరి.

క. ఆబుక్కనృపతి కతుల భు, జా బందీకృత మదాంధ శత్రునమావే
ణీబంధవిలస దసిధా, రాబంధురుఁ డయినరామ రాజాజనించెన్.

సీ. ఏరాజు భూతితే జోరుణాలోకంబు, లోకంబుతమము ని రాకరించు
నేధన్యుబాహోధ రాధరాభోగంబు భోగంబునవరించు భూమిసతికి
నేపుణ్యు నభిరూప రూపానుభావంబు, భావంబు గరగించు భామినులకు
నేధన్యు శుభకీర్తి శోభావిహారంబు, హారంబు దశదిశా యోవతమున

తే. కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ, డనుపమస్వాంతుఁ డాశ్రిత వనవసంతుఁ
డనఘ తర కందనోలిమ హోపురీని, శాంతుఁ డగురామ మేదినీ కాంతుఁ డలరు 30

శా. ఆరామ క్షితిభర్తకుం బ్రథిత స త్యాలాప ధర్మోద్భవ
శ్రీరమ్యుండగుతిమ్మరాజు, బలల క్ష్మీధామ భీమప్రభా
హారీణుం డగుకొండశౌరి. విజయ ప్రఖ్యాతచారిత్రుఁడౌ
శ్రీరంగేంద్రుడును, గల్గిరైందవకుల శ్రేయస్కరాకారులై

శా. ఆరాజత్రితయంబులో నసమబా ణారాతి విజ్ఞాతదో
స్సారుం డాత్త సుభద్రుఁ డర్జునగుణ శ్లాఘ్యుండునై పొల్చి నా
శ్రీరంగేంద్రుఁ డశేషరాజ్యపదవీ సింహాసనాక్షీణ ల
క్ష్మీరాజ న్నిజసంతతి ప్రథితుడై మించెన్ ధరామండలిన్.

శా. క్షోణీచక్రనుత నిత్యదాన నిధియై సొంపొందు శ్రీరంగ రా
ట్ప్రాణేశం బాయని సత్కృపాణి యదనం బ్రత్యర్థి జానైక పా

కీణం బౌటరుడే తదీయకరతా దృక్ఖడ్గ విద్ధాహిత
శ్రేణుల్ మున్నుగఁ గర్ణఖేచరవితీర్ణ ప్రౌఢి వాటింపఁగన్. 33

సీ. వెస విభీషణరాజ్య విముఖుఁడై, సహ్యాభావలయంబుఁ జేకొని నిలువఁడేని
సప్తసాలాంతర స్థాయియై నిదురించు, తఱిని జాగరణంబు దాల్పఁడేని
శ్రుతిదూరభోగసక్తత విజ్జీగి తా, జరణమ్ముగ జాదెసఁ జూపఁడేని
యలరారుసిరిఁ దన యడుగునఁ గూర్చి గ, ట్టిగ నీగిచేయి మాటికొనఁడేని

తే. రమణఁ బ్రతిసేయవచ్చు శ్రీరంగశౌరి, భయదరిపుపురహారి నిర్భయవిహారి
యార్యసత్కారకారి యౌదార్యవిభవ, ధారియై మించు శ్రీరంగశౌరికెపుడు.

క. ఆమనుజేంద్రునకుఁ బురం, ధ్రీమణి యయి తిమ్మమాంబ శ్రీరామునకున్
భూమిజ సుత్రామునకుఁ బు, లోమజయునుబలె జగంబు లోనుతి కెక్కన్

సీ. ధర యేయుపాంసుల తలసూపరాకుండ, దనకూర్మి జేని నప్పునసె ముంచెఁ
గమల యేనిచ్చల రమణు పేరెదను మో హైనిల్చి యతని పేరడుగు పఱిచె
సతియేయుచండిక పతిఁ జట్టుగూఁతురై, జగడాలు పచరించి సగము నర్చె
వాణి యేమితనూక్తి వదలదు తలవాకి, లి నిజేశు మాటమో చె నఁజేసె

తే. ననుచు భూకాంత శ్రీకాంత హరునికాంత, నజునికాంతను నిరసించి యాని రంగ
పార్థివునికాంత తిమ్మాంబ పతికిఁగుశల, కీర్తి బలవృద్ధి నిర్మల స్ఫూర్తు లొసఁగు.

శా. చేతోజాత సమానమూర్తి యగునా శ్రీరంగధాత్రీధవుం
డాతిమ్మాంబికయందుఁ గోనవిభుఁ దిమ్మాధీశు రామప్రభున్
భూతాశేషవిపక్షు శ్రీతిరుమలేంద్రున్ వేంకటాఖ్యాన
విఖ్యాతుం గాంచె సురద్రుపంచకమున య్యంభోధిరాజుం బలెన్.

క. అందగ్రజుండు రాజపు, రందరుఁ డనవెలసెఁ గోన రాజు నిజభుజా
సందీపితాసి భిదుర, స్పందని పాతితమహావిపక్షోత్కరుఁడై.

శా. శ్రీరంగాధిపు కోనభూవిభుని కీర్తి స్వచ్ఛతుండాంక తే
జోరాజద్ద్విజరాజు తీవ్రగతిచే నూర్వ్యాతిగుండై నభం
బాగాహించి పవిత్ర హాసించుచు నహీనారాతులం జించి త
త్సారాహార్ద్రిశసుప్త వాసవసుధన్ సాధించుఁ జిత్రంబుగన్. 39

క. ఆతని తమ్ముఁడు తిమ్మ, క్ష్మాతలపతి వొగడుగనియె ఘనుఁడనఁగీర్తి
వ్రాతవినూతన కైతక, జాతద్యోతనకృపాణ చపలాన్వితుఁడై.

సీ. ధాత్రీశ్వరులు గాని ధాత్రీశ్వరులు గారు, పురుడు వాగనుభూతి భూతిగతుల
మానవేంద్రులు గాని మానవేంద్రులు గారు, పోల్కి నయాభోగకళల
రాజహంసలు గాని రాజహంసలు గారు, పరిసత్కళాసార సారరుచుల
నరపుంగవులు గాని నరపుంగవులు గారు, తరమెన్న వరధర్మ ధర్మభృతుల

తే. జగతి నీమేటి కని నృపుల్ పొగడ నెగడె, సేబిరుద రాయరాహుతా హితవధూభు
జంగ బిరుదాంకపుంఖిత సమర విజయ, కాహళుఁడు తిమ్మవిభుఁడాజి దోహలుండు

తే. రవికులం బలరింప శ్రీ రాముఁ డయిన, శౌరి దన కెందుకన్నులు సరియ కాఁగఁ
దలఁచి సోమాన్వయము పవిత్రంబు సేయ, నవని శ్రీరంగ విభు రాముఁ డై జనించె.

సీ. పట్టాభిషేక వి పర్యయంబునఁ బ్రోలు, వెడలి ప్రియానుజుల్ వెంట గొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెనుగొండ సాం, ద్రహరిద్విపేంద్రనా దవనిఁ జేరి
ఖలజనస్థానవా సులఁ బల్వుర వధించి, మహిమసలక ఖర స్మయ మడంచి
హరివీరభట మహోద్ధతి సద్ధి గంపింప, దురమునఁ గదిసి తద్ద్రోహిఁ దునిమి

తే. యవఘుతరపార్థివేందిర నధిగమించి, సాధు కర్ణాటవిభవసంస్థాపనంబు
పూనిశరణాగతుల నెల్ల బ్రోచె రాముఁ డతఁడు నిజచరితంబు రామాయణముగ

మ. హరిశౌర్యం డగు రామభూవిభుని తీవ్రాటోపవద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలముల్ జాఱన్ దళాడంబరం
బరుగం గొమ్ములు వోవ లావఱి నిజామాదుల్ పజీరుల్ భజిం
తురు నమ్రత్వముఁ గానలో మసలిమానుల్ గా వితర్కింపగన్.

సీ. ఎడలపైఁ బొదలుప ఱ్యేదలు జాఱఁగ బాఱు, బిబ్బీలకు మునుంగు లబ్బఁ జేసె
ఘనభేరి కాధ్వనుల్ వినిగుండియలు వ్రీల, వ్రాలుమల్కలకు గోలీలు సేసె
నడుగనివిభ్రాంతిఁ దడగాళ్ళ వడనిల్చు ఖానులు డాఁగ జీఁకటులు సేసెఁ
గడలేని కాందిశీకత నేఁగుతమ కుర్వి, జడధులెల్లను గాలి నడలు సేసె

తే. ననుచు శిరములఁ దాల్తురె వ్వనిసమగ్ర, సైన్యధూతధూళిఁ జకితులై చనుసపాద
కుతుపశాహినిజామాది కుతలపతుల, తండు నృపమాత్రుఁడే రామ ధరణివిభుఁడు.

శా. విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁడు ర్వింజెందెఁ గల్యాణముల్
విశ్వామిత్రులఁ గొల్చి రాముఁ డితడు ర్వింజెందెఁ గల్యాణముల్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్ సాధించు కల్యాణ లా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబనవ్యక్తముల్. 46

సీ. ప్రబలావలేప విగ్రహజాయమానాగ్ర, హము డించి బహుభావనాప్తిఁ గాంచు
బురమెల్లఁ బ్రత్యగ్రభూతిపాలుగఁ జేసి, యచలాసనాభ్యాసి యైక్యశించు
రతనిభరామానుగతమైత్రి పైకొని, కలనైనఁ గల్యాణ కాంక్ష యిడఁడు
పరవిఁ బ్రాణాయామ సంసిద్ధికై నారె, సారసుఁ గుండలి స్థాన మంటు

తే. మానకనిజాముఁ డపవర్గ మార్గవృత్తి, బెరయఁ బరబుద్ధి నెవ్వాని పేరుదలఁచి
యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికిఁ దగఁడె, సేతుకాశీతలాంతర ఖ్యాతయశుఁడు.

చ. అరి జయకీర్తిసాంద్రుఁడగు నయ్యభిరామ నరేంద్ర సోదరుం
దిరుమల దేవరాయల నుతింపఁ దరంబె తదీయ హేతి కాం
కరి యతిలోహికావయవఁ గా దను నాత్మ హృదంతరంబులర
దరలక తాల్చు వారలకుఁ దార్చు సురీవరణీయ వైఖరుల్. 48

క. ఆరాయమణికి జగతీ, హారాయితకీర్తిఘృణికి ననుసంభవుఁడై
నారాయణాంశభవుఁ డితఁ, డౌరా యన వేంకటక్షమాధిపుఁ డలరున్. 49

సీ. నిరతంబు దుర్మార్గ నిరతులౌ తురకల, నతుల సన్మార్గ సంగతులఁ జేసె
ననియతమోహాంధులౌ పారసీకుల స్వస్త్రీసుఖైక నిశ్చలులఁ జేసె
నత్తనిర్దయులౌ యవనుల భూతసం, తాన తృప్తిప్రదాత్మలఁ జేసె
ద్విజపక్షపాతంబుఁ దెగడు పాశ్చాత్యుల, ద్విజపక్షపాత భావితులఁ జేసె

తే. ననుచుఁ గడు మెచ్చి జయలక్ష్మి యాజిరంగ, కాతరబరీదకేతన ఘటితభద్ర
కలశ మెదురుగఁ బూనియే ఘనుని జెందె, నతఁడు సామాన్యుఁడే వేంకటాద్రివిభుఁడు

మ. కపిమిన్ వేంకటరాయశౌరి యెదురంగా లేక యత్యాహితం
బడరన్ గౌతమి దాఁటువేళ నిజకాంతాశ్రు ప్రవాహాప్తిఁ గా
ల్నడదప్పన్ జడుఁడై నిజాముఁ డుడుపాలంబంబు నందాటిఁ యొ
క్కెడఁ గన్నన్ భజించు నయ్యుడుపలేఖన్ నామమోహంబునన్.

ఉ. ఏక సపాద లక్ష మిత మింద్రజా దోశ్చరిత ప్రబంధ మ
స్తోకమె యంచుఁ జాపజిత ధూర్జటి వేంకటశౌరి శౌర్య దీ
క్షాకృతి కర్ణ భీష్మ జయ శక్తి ననేక సంపాదలక్ష సం
ఖ్యాకమనీయ భూరివిభవాప్తి వహించు నుదంచితోన్నతిన్. 52

ఉ. ఆయనుజాల్ విశుద్ధ హరి దంత మహాకరిదంత కాంతి రే
ఖాయితకీర్తులై కొలువఁ గౌతమినీట నరాతిఘాతికా

క్షేయక రక్తముల్ గడిగి శ్రీరమణీ పరమార్తి రామ భూ
నాయకుఁ డుర్వి నేలె భువనస్తవనీయ జయాభిరాముఁడై. 53

క. ఆరామశౌరిపిమ్మట, ధీరామర శాఖి వీర తిరుమలరాయం
డారామ సేతుహిమవ, త్కారామా రమణుఁడై జగంబు భరించెన్. 54

సీ. కావుకా వనువారిఁ గదిసి తుంగపయోధ, రర దాంతరంబు చేరంగ నీదు
వివృతాగ్ర రదనులై వ్రేళ్ళు చీఁకెడువారి, మోము చేర్చి శిరంబు మూరుకొనదు
పదములు దొట్రిలఁ బరువులెత్తెడివారి, ననురక్తవృత్తి వెన్నాడి చనదు
పలుచాపముల బుట్టలు మెట్టజనువారిఁ, దత్తఱంబునఁ గ్రుచ్చి యెత్తికొనదు

తే. కాంచవో విజయ శ్రీలఁ బెంచవో ప్ర, తాప బాలార్కులను శుభోదయము మీఱ
నార తిరుమలరాయ బాహాసిపుత్రి, యఖిలలోకామ్యతక్రీడ నతిశయిల్లు

చ. కిరికపటాయ జీవనము కేవలగండము లగ్రికోట్రికిం
గరులకు దుస్సహాప్రకట ఖర్జువు శ్వేతవుమేను చక్రికిం
బిరుసుల బొంద నొల్ల నని పేర్కుభజించె ధరాపురంధ్రి శ్రీ
తిరుమలదేవరాయ జగతీరమణుం రమణీమనోభవున్. 56

సీ. బహుమహీధరకూట పటలిపాలుగఁ జేసె గంధాంధ సింధుర ఘటల నెల్ల
శాఖిశాఖాశిఖా చయములఁ దగిలించె, నమిత కోదండ దండముల నెల్ల
శరధికుటుంబి నీర్ఝరుల వెంబడిఁ బంచె, రామాకుచాగ్రహారముల నెల్ల
దుర్గమకర్దమ స్తోమంబులోఁ ద్రొచ్చె, విజయమంగళ శంఖ వితతి నెల్లఁ

తే. దగవరి గదా నిజాముఁడు దండజయప, టిష్ఠ తిరుమలరాయ ధాటికిఁ జలించి
పఱచు నెడ శక్తిమఱచియు మఱవఁడయ్యె, దత్తదుచితప్రవేశసంధానయుక్తి

చ. తిరుమలరాయ శేఖరుని ధీరచమూభటరాజి యాజి భీ
కరయవనేశ్వర ప్రహిత ఖాన బలంబులఁ జక్కుసేయ ని
దరఁ బెనుగొండ కొండలు మదద్విపచర్మ కపాలమాలికా
పరికర భూషితంబులయి బల్విడిఁ గాంచె గిరీశభావమున్.

సీ. కప్పువాటింపదు గగనమధ్యంబుపై, నుప్పొంగు పృథులపయోధరముల
నలత నొందదు వినిగ్మలసుధాధామకో, శరి సమారోహమై భవమునందు
దడబాటుఁ బూనదుఁ దమరసజ్ఞాస్థాన, వాటిబాటిలు నాట్యపాటవమున
శ్రమమునొందద శేష కమలాకరాభోగ, తరణకేళీ మహోద్యమమునందు

తే. ననుపమాకల్పపరిపూర్తి నతిశయిల్లు, ననిశ నిస్తంద్రగతిఁబొల్చు నఖిలభువన
గర్భగౌరవమేరీతిఁ గారిచేనొక్కొ, వీర తిరుమలరాయ భూవిభునికీర్తి. 59

మ. ధర నెవ్వానికి వ్రాయఁ బద్మజుఁడు వ్రాఁతల్ నాఁటినో సేసు న
స్థిరముల్ శాశ్వతకీర్తియా తిరుమల శ్రీరాయనారాయణుం
డు రహిఁ వ్రాసిన శాసనాక్షరము లుండుం బుత్రపౌత్రాన్వయ
స్థిరవృత్తిం బృథుకాక్షరంబులు గురు శ్రీవర్ణతుల్యంబుతే. 60

సీ. ఘనసింధు రక్తాంగ్రిఁ జనయుక్తిఁ గడ నుండు. మాతంగతతి నంటు మలినమెల్ల
గరుడుఁడై వెన నధో గతిఁబడ్డ యమ్మహా, హీనుని వెనసిన యేవమెల్ల
నరక హేతుహిరణ్య హరణవృత్తిఁ జరించు, కొమ్మకానిభజించు కొదువలెల్ల
ఘోరవాధారఘోర ప్రపాతకులైన, విమమగోత్రుల నంటు వృజినమెల్ల

తే. గడిగికొనియె వసుంధరా కమలనయిన, యారవీరప్రతాపరాజాధిరాజ
రాజదేవేంద్రతిరుమల రాయ చంద్ర, సాంద్రపట్టాభిషేకాంబు సముదయమున. 61

తే. అవిభునిదేవి శ్రీవేంగళాంబ పుట్టి, నిల్లు మెట్టిన యిల్లు వర్ధిల్లఁ జేసెఁ
బుట్టినింటికి మధనంబు మెట్టినింటి, కమిత దోహాహుతియుఁ గూర్చు కమలఁ దగడి. 62

ఉ. ఉంచిన యగ్రహారముల నున్నతవైఖరి విద్యలెల్ల ర
ప్పించిన విప్రవర్త్రియుల బెంచిన నవ్య వసోత్కరంబులన్
నించిన బల్లటాకముల నెమ్మిఁ గనందగు వేంగళాంబ యా
భ్యంచితకీర్తిసౌధవిశదాక్షర నూన మరాళరాజమై. 63

సీ. ననుమతి దానయ్యు వరుని వారింపదు, కందమూలంబులఁ గడుపు పెంప
శ్రీకాంత దానయ్యు ప్రియు నిరోధింపదు, క్రిందై విరోధికిఁ గేలు సాఁప
దాను రుక్మిణియయ్యుఁ దగదన దాత్మ న్యాయమునఁ డొక నరుక్రింద హరుఁబట్టఁ
దా నన్నపూర్ణాభి దానయయ్యును మాన్ప దొకనాఁడుఁ దన పేదు బికిరమెత్త

తే. ననుచు ధర నిందిరను భోజతనయు నార్య, నార్యనుతనార్యమేయచర్యలహసించి
పతికి నభిమతభోగ సౌభాగ్యమొసఁగు, విమలసద్గుణనికురుంబ వేంగళాంబ. 64

శా. రారాజద్గుణశాలి తిర్మలమహారాయందు శ్రీవేంగళాం
బా రామామణియందుఁ గాంచె సుతులం బ్రఖ్యాతసత్కీర్తుల
శ్రీరాముకా రఘునాథ భూమిరమణున్ శ్రీరంగరాయాగ్రణిన్
శ్రీరామావనినాథుఁ బ్రాభవనిధిన్ శ్రీవేంకటక్ష్మావరున్. 65

క. అజగదభినుత సుగుణ స, మాజులలో నగ్రజుండు మహనీయ యశో
రాజీవాననుఁడు సుధీ, రాజీవాసనుఁడు వెలసె రఘునాథుఁ డిలన్. ౬౬

సీ. బలువాహినుల మించు మలకల ఘననామకంబులు దూలమూలంబు లెత్తఁ
బ్రతిరోధ వరణ వర్గము ద్రోచి తన్మహాభోగశాలి క్షేత్రములు హరించు
వలగొన్న బహురాజ వంశగుల్మంబులఁ, బలుతెగంగులఁ గ్రుచ్చి పాఱవైచు
వడిఁజొచ్చి కలఁచి యావనరాసుల సమగ్ర, జీవనంబెల్ల దుష్కీర్తిఁ గలుపు.

తే. నవని నసహాయ శూరత నధిగమించు, ననఘ తిరుమలరాయనందనసమిద్ధ
ధీరరఘునాథభుజపీఠిఁ బీఁటవెట్టు సాహసోదగ్ర బిరుద వరాహమూర్తి.

శా. యాదోరాశి గంభీరమూర్తి రఘునాథాధీశుఁ డుద్దండ బా
హాదర్పాంధసపాద మల్కిక నిజా మానీకముల్ ద్రుంప జ
న్యాదూరక్షితిఁ బారుకృష్ణకుమ గృష్ణాంకంబు నాఁ దబ్బె బి
బ్బీబీవ్యన్నయనాబ్జకజ్జల జలాభీల ప్రవాహంబునన్. ౬౭

మ. హరిమై సాదిశిరంబు సాది మెయి జాత్యశ్వోత్తమాంగంబుఁ గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందార వృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవాటిం బర్వి గంధర్వకి
న్నరరూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దద్భాగ్యమున్.

చ. హరిపదభక్తిశీలుఁ డగు నారఘునాథ నృపాలు కూర్మిసో
దరుఁడు సిరంగరాయ వసుధావరుఁ డాత్మగుణ ప్రమోదవ
త్తిరుమలరాయ శేఖర వితీర్ణ మహాయువరాజ పట్టబం
ధురుఁ డయి సర్వభూభువన ధూర్వహశక్తి వహించు నెంతయున్.

చ. ఉరమున నేఁగుఁ గుండలి పయోధరధారల నాను నెప్పుడుం
గిరులు గరుల్ రజోవిహృతి కిం జను వెళ్ళఁడు నేల కూర్మశే
ఖరు డిది యేల బాలజన కల్పితసౌఖ్య మటంచు ధారుణీ
తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁ గుమారమన్మథున్.

సీ. కుంతలస్థలికి నే గుణగరిష్ఠుని చీఁటి, కమనీయ కేతకీ గర్భదళము
మంజులలాట సీమకు నేమహాభాగు తేజంబు కాశ్మీర తిలకరేఖ
వక్షోభాగమునకే వైభవాధికుని యపారకీర్తి మతల్లి హారవల్లి
కాంచిదేశమున కే ఘనుని సంతతదాన వారి నిర్ఝరధార హీరరశన

తే. యంగమున కెవ్వని చమూతురంగకోటి, ఘటికాధుతధూళి మాందాళిపట్టు
సమధికాకల్పరుచిఁ బూను జగతి కతఁడు, రాజమాత్రుండె శ్రీరంగరాయశౌరి. 74

మ. జలధిన్ దాన పయోధునీ ఝరులచేఁ జంద్రున్ యశోలక్ష్మిచే
జలదవ్రాతము నాత్మకారితి మహాసత్త్రాగ్ని ధూమంబుచేఁ
జెలువొప్పన్ వెలయింపఁజాలు ఘళిరే శ్రీరంగ రాయక్షమా
లలనావల్లభుఁ డల్లదాతలకు నెల్లన్ దాతయూహింపఁగన్. 73

శా. తుంగక్ష్మాధరకోటులెక్కి తనలార్చుక్ గ్రమ్మి నింగి వీరారిరాశ్యౌ
ర్వ్యాంగారంబుల నొక్కుగుక్కఁగొని సద్యశ్శాంతిమానంగనా
నుం గల్లోలవతీభుజంగ జలసందోహంబు లెల్లన్ సమి
ద్రంగప్రౌఢ సిరంగరాయ పృతనాసంగద్రజో జాలముల్. 74

సీ. భూరి భుజంగికా భుక్తనిర్ముక్తుఁడై, వాగకబుసకొట్టు వానిఁ దెగడి
పంకనిశ్శంకుఁడై పారదారికవృత్తి, వదలక పల్లాత్తు వాని నెడసి
మధుపాంగనాసంగ మప్రౌఢి నెపుడుఁ బో, వని చెక్కు చెమరుల వాని రోసి
బింకంపుసానుల వంకరాకడి నెల, వంక పైఁబూనిన వానిమాని
తే. పుడమి చెలిఁజెందె నకలంక భోగభాగ్య, మాను వత్సయసౌకర్య మానితాను
భావు నమలినదానవై భవునకూట, రాగనిస్తంద్రు శ్రీరంగ రాయచంద్రు. 75

మ. ఘనశౌర్యుండు సింగరాయనరలో, కస్వామితోఁబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధి పయోమధ్యోర్వి శ్రీరంగ ప
ట్టణలంకానగరంబు పుణ్యజన కీ, డావార్త లేకుండఁ గై
కొనియెన్ మిత్రభవోపకార నిరపేక్షుండై విచిత్రంబుగన్. 76

శా. రామక్ష్మావరు దానతోయ తటినీ వ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధి కరణ్యలబ్ధి కచటుం జక్రాయుధుం డొందు ని
ద్రా ముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. 77

క. ఆరఘునాథ ప్రభృతి ధ, రారమణేంద్రులకు మువ్వురకు సోదరుఁడై
సారమతి వేంకటపతి, క్ష్మారమణీ ప్రియుఁడు వెలయు శత్రుఘ్నుఁడనన్. 78

సీ. చెక్కు నొక్కదెయందు దిక్కరిగ్రామణి, యక్కుఁజేరదెయంచుఁ దిక్కరాయఁ
డణుతనొందదెయంచు హాలహాలాహరి, కంటి కబ్బదెయంచు దంటచిలువ
యంక మొందదెయంచు యదుకులశ్రేష్ఠుండు, మోముజూడదెయంచు మొదటిగిబ్బ
యడుగుత్రొక్కదెయంచు నమృతంపుమున్నీరు, చాయనుండదెయంచు శౌరశాఖి
తే. తనచెలిమి కాసపడ నొచ్చె మునికివారిఁ, దెగడి యాత్మసవర్ణ లబ్ధికిఁ జరాచ
రంబునఁ జరించు దిరుమల రాయ తనయ, ధీర వేంకటరాయ సత్కీర్తికన్య. 79

మ. హరుఁ డాతారకశైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహింపఁ జంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖర సదా సంసేవ్యుఁడై యారయి
ద్ధగ బంటేలికవాసి తద్గిరులకుం దద్వల్లభ శ్రీలకున్. 80

సీ. చుట్టుజుట్టుకొని శేషుఁడు సద్గురశుశోవ్రు, ముదిపన్నగములలో మొదటివాఁడు
మొనయ కాదిమకూర్మము ముడుంగుమేను మో, పినఁ బెద్దవారిలోఁ బెద్దవాఁడు
సమధికాశాప్తి హ స్తము చాఁచుఁ బద్మినీ, వైరి దిక్కరి తల వడకువాఁడు
తనయొంటి పంటిచే తినె యంటు నాదికా. లముఖగోణి పాండురోమములవాఁడు

తే. కదలలేఁడద్రి బహువయఃక్రమము వాడ, టంచు వారల నిరశించి యవనికాంత
తనభుజాదండమునఁ నుండఁ దనరుచుండు, భావజనిభుండు వేంకట క్ష్మావిభుండు. 81

మ. అతిధీరుం గలిదానశూరుఁ దతిర మ్యాకారుఁ డత్యంత సు
వ్రతుఁ డంచుం దనుసన్నుతించు కవివా గ్వ్యాపారమొల్లన్ యథా
ర్థతమంబై విలసిల్లఁ దిర్మలమహారాయేంద్రు శ్రీవేంకట
క్షితినాథోత్తముఁ డందు నిందు గతిఁ గల్పించుం గవిశ్రేణికిన్.

క. అశనయము జగతి వి, ఖ్యాతనయము గొలువ శాశ్వతైశ్వర్యకలా
న్వీతుఁడు తిర్మలరాయో, ర్వీతలనాయకుఁడు వెలయు విభవోన్నతుఁడై. 83

సీ. ఎంతకాలము మహాశాంతసంగతి దివ్య, దంతావళంబులు దనరుచుండు
నెంతకాలము వరాహేంద్రుఁ డద్వంద్వుఁడై, కల్పముల్ వనరాశిఁ గడుపుచుండు
నెంతకాలము భుజంగేశుఁ డాదిమభిక్షు, పదనిషేవణనిష్ఠ బాయకుండు
నెంతకాలము గిరుల్ సంతతాభ్యున్నతి, నలహంసపద్ధతి నంటియుండు

తే. నంతకాలముఁ దనయందు నచలలై య, నంతలై రత్నగర్భలై యవని యలర
నలరుఁ గర్ణాటరాజ్యసింహాసనాధి, రాజ్యశుభశాలి దిరుమలరాయమౌళి. 84

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధ వివిధగుణ, శ్రీవార్నిధి కఖిలసుజన శేవధికి ధనుః
ప్రావీణ్య శరధిశరధికి, ధావద్రిపుసంఘ లంఘితదిశావధికిన్. 85

క. ఉన్నతజయ జవ్యబిరుద, మన్నెవిభాళాదిబిరుద మాన్యునకు మహో
ద్యన్నిబిడ జవ్యపటహజ, ఘన్నినదత్రుటదరిచ్ఛటాసైన్యునకున్. 86

క. శ్వేతాచలతటశిలాహిత, ఘాతాహృతలిపినిభాసి భాసిచ్ఛాయా
పాళికిఁ బరిపాలితవర పాళీదత్తద్విపాద్య పాయనతతికిన్. 87

క. ఉద్ధతరిపు విద్ధతపన, పద్ధతి కరిభవన దవని పట దంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స, మిద్ధరణ రజోవ్రజోద్య దిభమద సృతికిన్.

క. ధీకవివిధాటిగిరిపవి, ధాటికిఁ గర్ణాటకాంధ్ర ధరణీపురవరు
ద్ధాటికిఁ దిరుమలదేవమ, హారాయాగ్రణికి వితర ణామరమణికిన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన వసుచరిత్రంబను మహా
ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 90

## కథాప్రారంభము.

శా. శ్రీరమ్యం బగునైమిశంబునఁ దప శ్శ్రీరాజితావ్యాజతే
జోరాజుల్ శుకశౌనకాది మునిరాజుల్ సూతజుం జూచి యు
న్నారాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుఁడై యేలెన్ మహీమండలం
బారాజేంద్రునిఁ దెల్పు మా కన నతం డత్యంతహర్షంబునన్. 91

శా. శక్రాపాదిత దివ్యచిహ్నధరుఁడై చంచద్విమానాధిరా
జక్రీడాపరుఁడై యమానుషమహాసత్త్వాఢ్యుఁడై చేదిభూ
చక్రేశుండు ధరిత్రియేలె వసుసంజ్ఞుఁ దచ్చరిత్రంబు ని
ర్వక్రప్రౌఢిని విన్నవింతు నని వాగ్వైచిత్రితో నిట్లనున్. 92

సీ. వరసుమనోభవ్య తరుల కావాల మ, త్యలఘుకలాపాలి కలరుభరణి
పరిలేని తెలిముత్తె సరులకోటారు క, ళ్యాణపరంపర లతోలుదీవి
సురుచిరమణుల కాకరసీమ శ్రుతిహిత, భాషితద్విజకోటి పట్టుఁగొమ్మ
సరసులకారామ సరణి శ్రీరంగ గే, హక్రోడవాసిని కాటపట్టు

తే. వెలయు నావరణాంబుసంవీతహాట, కాండమోహాదపరిఖావృతాంఘ్రివజ్ర
దంతురప్రాంతగంగాని రంతరాగ్ర, భూరివరణం బధిష్ఠాన పురవరంబు. 93

చ. అలఘుతరగ్రహాంశుగుణితాగణితాభినుతాగ్రరత్నకం
దళరుచిఁ బోల్చు వీటిపరణంబు గతావరణం బొనర్పు ని
చ్చలు నలకోటకొమ్మ బలు సందుల పొందుల నేఁగ గా జమీ
యలవఱిచెం బతెంపుఁదను సహాయ రథాంగముగా శతాంగమున్

ఉ. పురిపరిఖా మహాంబునిధి భూరిగభీర తరాంబుపూరమున్
సరభసవృత్తిఁ జొచ్చి బలి సద్మతలం బతలం బొనర్వఁగాఁ
జరణకృత ప్రచారములు సాఁగవు వీరికి నంచు నబ్జజుం
డురగులఁ జేసెఁ బన్నగపులోద్భవులన్ వడిఁ దేలియాడఁగన్.

మ. చతురాస్యుల్ పురుషోత్తముల్ బుధగురుల్ సర్వజ్ఞమూర్తుల్ మహా
శతమన్యుల్ శుచిధర్మపుణ్యజనతా శ్లాఘ్యుల్ ప్రచేతుల్ సదా
గతు లక్షీణనవార్ధకర్తలు కళా కాంతుల్ జగద్బంధు లా
క్షితిదేవుల్ పురిదేవతా మహిమలం జెన్నొందుటల్ చిత్రమే.

సీ. పగ లైనఁ దెల్వి గోల్పడని రాజులు శరం, బులు చన్న వెలువెలఁ బోనిఘనులు
ధనదాశఁ గేలు మోడ్పని సార్వభౌమాంకు, లని వెన్క ముందుఁ జూడనికుమారు
లరి మెచ్చఁ గరములు నెరపనియినులాల, మున వాలు మఱవని పురుషసింహు
లనయంబు నడకఁ దప్పనిగోత్రపతు లెప్పు, డును సీదిరము లేని యనఘభోగు
తే. లౌర వీరన వీరన యైకపరులు, వఱలుదురు వీటఁ బుష్పవద్వంశ్యులగుటఁ
గువలయాధార కమలాను గుణవిహార, సారసౌజన్యధరులు రాజన్యవరులు. 97

ఉ. చెలిపులిగూడు మాను పని శ్రీదుని గా దన మిత్రు నక్షయో
జ్జ్వలవసుఁ జేయ మిత్రవసుసంపద కైన ఘనావరోధమున్
వెలువడఁ జేయ నేర్తురు మణీ విపణీతపనీయరాశి పే
శలరుచిఁ గోటికోటి విల సద్ధ్వజకోటిఁ బురీకిరాటకుల్. 98

మ. బలిచూడామణులందు విష్ణుపదజాల్ పాటించు ధాన్యంపు ది
ప్పలు చంద్రామృత సాంద్రసేకమునఁ బై పైమోసు లెత్తంగఁ ద
త్కలమాంకూరము మేయుచున్న నెలజింకన్ సారె వారించు వా
రలతోఁ బుట్టువు గంగ పద్మముఖి నిర్యద్భృంగ నాదార్భటిన్.

ఉ. పరబలభంగచంగము లభంగుర తుంగమతంగజంబు ల
ప్పురిఁ గరికర్ణకర్ణపుట పూరితభూరితరానిలాహతి
న్విరియఁగ దోలు మేఘములు నింగి దొఱంగిత దంఘ్రిమూలముల్
శరణము నందఁ జోలఁ దని శంబుఁ బదంబు మదంబు పేరిటన్. 100

## మహాస్రగ్ధర.

వరభూభృత్ప్రాప్తినద్ధిం బదురవిహారులం బ్రౌఢిఁ బాటింపవెందున్
పరిగాఁ దద్దిక్కృతుల్ సైఁచక రవి హరియై చాయకున్ రానడంచుం

జరణోద్వ్యధూళిఁ దద్వ్యాసత దగుహారియుక్ సప్తిగాఁబాదధారా
స్ఫురణం బేఁపింతయంచుం బురహరులునగుం బూర్ణధారాసమృద్ధిన్. 101

మ. అలఘుస్యందనకోటి వీటిమణిర థ్యావాటికా హాటకా
కలితక్షోణుల నేఁగుచోఁ జటుల చక్రక్షుణ్ణతత్క్షోదముల్
గలయం బర్వ సుపర్వలోకనదిలో గాంగేయపంకంబు జో
బ్బిలఁజేయం దలుచై జనించి యచటం బెంపొందుఁ బొందామరల్. 102

క. అన్నగరి నాట్యశాలలఁ, జెన్నగుమురజనులరవళి చేనటియించుం
గన్నియల కన్నమన్నగఁ, బన్నగభుక్తతులు దృష్టి పాత్రములగుచున్. 103

ఉ. చందనగంధులిందుమణి సౌధతలంబుల గొండ్లి సల్పఁగా
నందలి దివ్యచిత్రములయం దొకరై యనిమేషభామినుల్
కందళితాద్భుతస్ఫురణఁ గన్గొని తన్నటనాంతగీత నీ
ష్యందసజీవచిత్రముల సందడి నేఁగుదు రప్పురంబునన్. 104

చ. ఒనరుఁ బురాధిరాజమున నుజ్జ్వలవజ్రకలాపగోపురా
గ్రనిహిత హేమకుంభములు గాంగహిరణ్మయకంజమంజిమం
దనరఁగ నిక్కిదిక్కరుల తొండము తుండము సాఁచునంచు నం
చిన వెలిబొమ్మలో యనఁగఁ జిత్రితసాంద్రమృగేంద్రరూపముల్. 105

గీ. ఘనులఁ గొండలపాలు గాఁజేసిన కొఱంత, ద్విజరాజు నెపుడుఁ గుందించుకొదువ
కువలయంబుఁ దినంబు గూల్చునాడిక బంధు, జీవము మోదిగాఁ జేయనిపడి
కల్యాణగోత్రంబు గరిమ వంచినదూఱ, సరసుల నింకించు పరుసఁదనము
దానికేల వసులక్ష్మిఁ బూన జేయని అట్టు, తమ్ములఁబుంకాప్తి, దార్చునగడు

తే. నలువ వారించుకొనియెఁద న్నగరపతుల, నెఱిగురులు ముద్దుమోములు నిడుదకన్ను
లలఁతిమోవులు బిగిగుబ్బ లరిదినాభుఁ లలరుతొడలును మృదుపదంబులునొనర్చి.

మ. పురిపూఁదోఁటలతావి మిన్నులమ వేల్పుల్ మెచ్చి తద్భూజభా
స్వరసంతానములన్ దివిం బెనుప నా సంతానముల్ దివ్యని
ర్ఝరిణీ నిర్మలవారిపూరపరిపోషం బందియుం దన్మహో
తరులక్ష్మిం బరిపూర్తిఁ గాన కెసఁగెం దత్కల్పశాఖిప్రథన్. 107

సీ. పొన్నపూ వొడినేలఁ బొదివితే చెలి యది, పొడమె బల్దివిపైఁ బొదువవలదె
చెలువ మాటితివేల కలువచా లదియుఁ గ, ప్పఁగరాదె మిన్నుల బావికదది

మొగడతమ్ముల నేల మూసితే సతి మూయఁ, దగదె మానసభూని దానములవి
తరుణిపూరెమ్మ రొత్తవదేల యది హేమ, శిఖరిదాపున బయల్ సేయఁదగునె

తే. యనుచు రసమర్మ సరసోక్తు లాడునట్టి, జట్టికాంద్ర యథోచిత సరసవచన
రచనఁ దేల్చుచు వివిధవిభ్రమము పఱల, విరుల విలుతురు పువ్వులావికలువీట. 108

మ. అమరుం దత్పురిచెంతఁ గాంతకనకాబ్జాలంబరోలంబకు
క్షిమతీవాహిని సారసారణులు తక్కేదార కోదారస
స్యము ముక్కారును బండఁజేయ దివివారల్ వీటిసత్రాన్నభా
గము లాసింపఁగఁ దత్సురాలయనదీ ఖ్యాతిన్ విడంబించుచున్. 109

శా. వీటన్ మీటగుజోటు లేటివలదన్ వేమాఱుఁ గ్రీడింపఁ ద
త్పాటీరాంకసపంకసంఖగత ముక్తాశ్రేణి యావ్యాపనం
జాట్రించున్ మృగనాభిపంకయుతభామాకంబుకంఠాప్తి నే
నాటన్ మిన్కులు గల్గునారికగుజన్మస్థానసౌఖ్యోన్నతుల్. 110

ఉ. చెన్నగునన్నదీపులిన సీమల దాఁగిలిమూతలాడుచున్
వెన్నెలరేలఁ గప్పురపు విప్పుటనంటులనీడ నీఁగు రా
కన్నెల రోయునన్నులకుఁ గన్నులు మూయఁ దదీయవాసనల్
మన్ననఁ గాంచి కప్రపుదుమారము రేఁచు సమీరడింభముల్. 111

చ. వల నగు నమ్మహాతటిని వారి నవారితకేళిఁ జల్లు కాం
తల చనుమిట్టలం దొఱఁగు దట్టపుదట్టుపునుంగు వాసనల్
చిలుకుచు వీటిరాజనపుఁ జేలను దిద్దిన కాల్వవెంట రా
దళముగ వానియప్పునఁగు తావులెవల్చుఁ దదీయధాన్యముల్. 112

చ. పగడపుఁజిట్టలన్ మనికి పట్టుగఁ గట్టిన పట్టుజీనువుల్
జిగిబిగి మించుచంచువులఁ జించినచో రసపూర మూఱఁ జె
న్నగు రసదాడిగుంపులు పురాంతికసీమలశాలిపాలికా
జగదభినంద్యగానరస సంగతిఁ గన్నుల నీరు గన్గతిన్. 113

క. ఆరాజధాని కధిపతి, యై రాజిలు వసునృపాలుఁ డత డసిధారా
ధారాధరధారాజల, ధారాహత రాజహంస పద్మోదయుఁడై. 114

సీ. తనయశోవిశదముక్తాసౌధపాళికి, నంబుదాయనము వాతాయనముగఁ
దనశౌర్యశిఖిశిఖాతతికి జాంబూనద, భూధరం బపరంజి పూదెగాఁగఁ

దనజలోద్ధతరణో దంభకుంభినికిఁ దా, రాగ్రహంబులు గర్భరత్నములుగఁ
దనదానధారాఖ్య పనధికి మిన్నేరు, కల్లోలధుతవారి కణము గాఁగఁ

తే. దనవినూతననుగుణ సంతానవల్లి, సముదయంబున కంభోజ సంభవాండ
భాండము లఖండఫలపరంపరలు గాఁగ, వఱలు భవ్యవిభావిభావసుఁడు వసుఁడు.

చ. మసలక యెల్లకాలమును మాయతపారణ ధార్యమాణయై
యసమశిలోచ్ఛయంబుల ననంత యసంతతపం బొనర్చి తా
పసుమతియై తదీయగుణ వాసన గంధవతీప్రతీతియుం
బొసఁగఁగఁ దెల్పెరత్నపరిపూర్ణమహాకటకాభిరూప్యముఁ. 116

సీ. మీటిన రాజు బల్మినదంత లోనైన, నభినవస్థితిఁ బెంప నతఁడె నేర్చుఁ
దేతీచూచినఁ ద్రిపదీప్తిఁ జూప జనాళి, కక్షిసాఫల్యమీ నతఁడె నేర్చు
సింధువింకఁ బ్రతాపశిఖిఁ బూనవిశ్రాణి, తాంబువ నవి నింప నతఁడె నేర్చు
సమిదున్ముఖుని తేజము మలంపఁ బాదంబు, లంటిన వెలయింప నతఁడె నేర్చు

తే. మండలము చాల్ప హరిదెస మైత్రినిలుప, సలఘు సన్మార్గగతిఁ దెల్ప నతఁడె నేర్చు
నాజగద్బంధునకు వసురాజనామ, మిడిన చతురాస్యకౌశలం బెన్నఁదరిది. 117

మ. జననాథాగ్రణి యొక్కనాఁడు హిమవజ్జాతుండు కోలాహలా
ఖ్యనగాధీశుఁడు ప్రాలి శుక్తిమతి నాఁగఁ బేగ తేగవ్వ మీ
టినసూటిన్ బొటవ్రేలిగోట నెగమీటెం గుంతితాహార్య శా
సనగర్వాగ్రహుఁడై బలారి తనతో సఖ్యంబు వాటింపఁగాన్. 118

తే. పటిబలకోలాహలాహార్య పతనరుద్ధ, విపులశుక్తిమతీమగ్న విపులకతని
చరణనఖరేఖ సంవర్త సమయజలధి, నుద్ధరించిన కిటిదంష్ట్రియొఱపుఁ దలిపె. 119

చ. బలరిపుమిత్రుఁడైనయచలపార్థివతల్లజు పాదపల్లవో
జ్జ్వలనఖరేఖదండ నగపంశవిఖండన చండిమంబు తా
వలముగ నభ్యసించెనొకొ వజ్రము రాజశిరోవిభాగ భా
గలఘు కిరీటవజ్రకళి కాకృతి నిచ్చలు నాశ్రయించుచున్. 120

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి సరిగద్దియనుండ నగారి శైలఖం
డనకథ చారణాళి పొగడన్ నిజసన్నుతి కోసరించు నే
ర్పునఁ దలవంచి పీఠతటరూఢమణిచ్ఛా బొటవ్రేల మీటు న
య్యనఘుఁడు కొండమీటినమహాద్భుతకృత్యము దెల్పెనై వడిన్. 121

మ. అనఘాత్మీయపదోపకంఠమునఁ బ్రాణాచారముం బూనురీ
తి నితాంతానత శృంగమై నిభృతమై దిక్కేఁది యక్కొండయుం
డినఁ గొన్నాళ్ళునఁ గేళిశైలముగఁ బాటించెన్ మహీజాని మ
న్ననఁ దచ్ఛైలశిరంబుపై మృదుపదన్యాసంబు గావించుచున్. 122

ఉ. ఆనరలోక పాలకమహామహనీయ భుజోపగూహన
శ్రీనిగవొందుచుం బుడమి చేడియ గోత్రము లూఁదడిల్ల సం
తానసమృద్ధిచే శుభవితానము తానక మయ్యె నేకసం
తానము గన్నదైవతవతంసపురిం బురణించి నవ్వుచున్. 123

క. ఆగతి నభిమతభోగ, శ్రీగలభువికొసఁగె నుల్లసిత పత్రలతా
సాగంధ్యము నవకళికా, సౌగంధ్యముఁ జైత్రలక్ష్మి సైరంధ్రిక్రియన్. 124

సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ, తులనాభికాభంగదోఃప్రసంగ
మలసానిలవిలోల దళసాసవరసాల, ఫలసాదరశుకాల పవనిశాల
మలినీగరుదనీక మలినీకృతధునీక, మలినీసుఖితకోకకులవధూక
మతికాంత సలతాంత లతికాంత, రనితాంతరతికాంతరతాంత నుతనుకాంతి

తే. మకృతకామోదకురవకావికలవకుల, ముకుళసకలవనాంత ప్రమోదచలిత
కలితకలకంఠ కులకంఠ కాకలీవి, భానుగము వొల్చు మధుమాసవాసరంబు. 125

ఉ. ఒనర హిమావకుంఠనము బూడ్చి తెమల్చిన పత్త్రిభంగముల్
సనపసేయాడుచున్ మొగడ చన్నులు పల్లవపాణిఁ గప్పనూ
తన లతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనకువ సేర్చె దక్షిణసమీరణుఁ డొయ్యనఁ దావులంటుచున్. 126

మ. అలరుం గైదువుజోదు కూర్మిసయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడుమరుత్కుమారుఁ బ్రియమొప్పం దేనె నీరార్చి లేఁ
జెలిపూజొంపపుఁ బొత్తులం బొదిఁగి ధాత్రీజాతముల్ జోలవా
డె లసత్పల్లవడోలనుంచి కలకంఠీనాదగీతంబులన్. 127

సీ. మును సుమనోరాగమున వసంతము నూనెఁ, గాన సేందిర యశోకంపుఁ గొమ్మ
కాకొమ్మనగుచు నెయ్యమునఁ గ్రొన్ననతేనె, మెలఁగెడు సరసాళి మీఁదఁజల్లె
నాసరసాళి సోయగపుఁబాటలతోడఁ, జని మాధవిప్రవాళశాటిఁ దుడిచె
నామాధవి పరాగముష్టిరాగముమించఁ, బరలెంచు కలకంఠి పైపిదిర్చె

తే. నిట్లు లతికలు హితకోటి సెనసి యపుడు, మదనదేవోత్సవ క్రీడఁ బొదలుననిన
పయలుఁదరుణులు విరులయో దరుల వఱలు, సిరుల వలరాచ జాతరల్ సేయుటరుచె

మ. అరిగాఁ బంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళవై
ఖరి మాపం బికజాత మాత్సరవభంగవ్యాకులం బై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ శాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్. 129

మ. శరఘాతంబుల శోర్వశీక హిమసంఘాతంబు శీతక్షమా
ధరదుర్గంబు భజింపఁగా నలజగత్కాంపప్రదాస్తోకభీ
కరదోషాయతిశాలిఁ జుట్టుకొని లగ్గల్ పట్టి ధట్టించు నం
చరవిందాప్తుఁ డుదీచి కేఁగెఁ బ్రబలుం డైమాని దాక్షిణ్యమున్ 130

మ. చివురంగై దువువేల్పు చైత్రమున నక్షీణధ్వజోత్క్షేపవై
భవుఁడై తెమ్మెర తేరిపైఁ గదలి రాఁ బ్రత్యగ్రసాలాగ్రహ
ర్మ్యవిటంకంబులు పొంకిపల్లివనజాస్యల్ సల్లిరుత్ఫుల్ల ప
ల్లవసాస్తంబుల భావిభావుకఫలోల్లాసంబుతోఁ బ్రోవ్విమల్. 131

మ. నుహిశామండల మంజులభ్రమరికా మర్దంబు శ్యామాముహా
స్మృహాయస్మిలిత పత్రభేదనిపుణం బుం బద్మినీ కంకణ
గ్రహణాపాదియు నై సగంధవిటపి ప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్తగంధవహ మవ్వేళన్ వనాంతంబునన్. 132

సీ. ఏపారుపాదరిండ్ల నాఘాటలాశోక, దిపార్చిఁ గనకక లాప మరసె
సాలావళులు దాటి యేలాలతావార, బాలాతతిపరాగ పటము లూడ్చె
నానామధుపనవ్య గానామృతము మెచ్చి, నూనాసవము లెల్లఁ జూఱ లిచ్చె
ఝంకారహితధీర హుంకారశుకఘటా, హుంకారముల ఘలా హాతి యొనర్చె

తే. వనుచు నాగంధవహునిధార్త్యములు తెలంపు, లీల విరిసినవిరులు రాలివరజంబు
లొలికినరసంబు లురిలిన ఫలము లధిపు, ద్రోల నిడి పల్కెనుద్యాన పాలురపుడు.

క. స్వామీ యేమని పొగడెద, మామనికిన్ మనికియైన యారామమునం
గామనిశితాస్త్రములు త, త్కోమలతరలతలుఁ జిగురు గొమ్మలుఁ జేవల్. 134

తే. గాధచివురులురంజిల్లె వనలు పొలిచె, నలరివిరులెల్లబూపలు దలలునూపెఁ
బసిమినిరవొందెఁ బిందియల్ బలసె నవళ, లాటువులు సాంద్రయచుల ఫలంబులెసగె

ఉ. కేళివనాళి నీయెడ సుకీర్తి వదాన్యత చెప్పనేల భూ
పాలక కేలకంఠములు పాయక ప్రోయు లతాంతవాసనా
జాలము సోఁడుముట్టు నుర సాలము వీడ్కొనివచ్చు పట్టపుదీ
వాలికఁదోఁచు నబ్బురపు మబ్బుల యుబ్బులు గుబ్బతిల్లఁగన్. 135

క. మహనీయ మధురుఁడు సం, గ్రహమునఁ గాలంపలం పటాపి కనిమలగ రజం
బహరహము నెఱపి మాకున్, సహకారను లయ్యె నచటి సహకారంబుల్. 136

మ. బలుకప్రంపుటనంటికప్పగపుఁగొ ప్పల్ గప్పి యుష్ణాంగుజా
ల్గలగాఁజంగల సీరు సజకపుఁ గే శాకూళికిన్ డిగ్గి త
జ్జలసూత్రంబులు ప్రాఁకి తుంపురులుగా జారున్ నిదాఘాంశునా
వళి వీడ్కొన్నతమంబుఁ గాంచి వనిలో వర్తించుమంచో యనన్. 137

శా. ఆ యారమ్మ్యలఁ బోల్చకొమ్మలబెడం గాపల్లవశ్రేణి రం
గాయాతావుల మించుపూఁబలపు లా పో యొన్నఁగా శక్యమే
యాయుద్యానము సాటి చైత్రరథ మె ల్లౌనా యుతశ్రీయుతం
బై యొక్కొక్కనగంబె చైత్రరథమై యందున్ విజృంభింపగన్.

సీ. ఇమ్మ్రైలై మరుహజా రమ్మ్రైలై పొదలుండఁ, భూఁజవికలు వేఱ పూనవలదు
తెప్పలై నెత్తావి కుప్పలై పుష్పాళ్ళ .రుల గందవడి త్రోవఁ జిలుకవలదు
సారమై హిమజలాసారమై పూఁదేనె, నెఱయఁ గేళాకూళి నింపవలదు
పెంత్రమై మారుతాయత్తమై గంబూర, మెగయవితానముల్ బిగియవలదు

తే. స్వామి యారామశుభవైభవములఁ గూడ
నెపుడు విచ్చేయుదురొయంచు నెదురుసూచు
సహజ సౌభాగ్యములఁ గూర్చి చైత్రుఁడతఁడు
కూర్మిభవదీయ వనపాలకుండు గాఁడె. 139

క. అని వనపాలురు దెలిపిన, జనపాలున కనఘపూద పాలాళీ నూ
తనపాళీ ఘనకేళీ, వనపాళీదర్శనోత్స వంబిగిరంచెన్. 140

తే. నృపుఁడలవనీపకుల నవ నీపకుల నొ, నర్చి యుచ్చోనిజారామ నవవసంత
సమయసౌభాగ్యములు చూడఁ జను మనోర, థంబు నరథంబుఁ దెమ్మనఁ దడయక పుడు

సీ. జతగూర్చి తారవ ప్రజాలఁ బమ్మినకమ్మి, గ్రమ్మినమణి రథాంగములగములఁ
నీలాలదృష్టి పూ నివక్రముఖములఁ, దగు పచ్చపనినిగ విగని నొగలు
ముత్యాలబవిర కెం పులచట్టము తదంశు, దట్టంబుమాడ్కిఁ గెం బట్టుపఱపు
పగడాలకంబాల జిగి మించుపువ్వ రా, గపులోవ వైడూర్య ఘంటికలను

తే. దళితదళిత మాణిక్యంబుల కలశమును జ, యాంక కేతనమును గల్గు వరద మొకటి
మనసుతోడన మెఱుఁగు సాంద్రాణి కాశ్వ, రత్నములఁ బన్ని తెచ్చె సారథియొకండు

తే. తెచ్చిన ననేకచక్రచంక్రమణదీప్తమును న, శీతహారదశ్వములను జగ న్నేత్రశుతోడ
సారథియునైన యమ్మహీశ సారథినెదుట, నరిగె మనుదయ్యె జలజాతనాబ్ధములకు.

మ. ద్రవిణాధీశ్వరుఁ డాత్మరూపమున నా థఖ్యాతిభీతిం గరం
బు నమానోత్తమ మంపెనో యన రుచిం బొల్పారునా స్యందనం
భవనీనాయకుఁ డెక్కె నొక్క మొగి ఢంఢారావముల్ పందిపృం
గవవాచాపిథనంబు నేత్రథరహుం కారంబు దోరంబుగన్. 144

చ. పొడగన వేళ యచ్చె వని పొంగి కళింగ శకాంగముఖ్యు ల
ర్ద్యెడ నెడ యీక క్రందుకొని యెల్లెడలన్ వెడలంగ వారిజల్
తొడవుల రాలి ముత్యములు తోరములై తొరగెం బురంబున
ల్గడల బ్రసూనకోరకని కాయము నింపినసొంపు పెంపునన్. 145

వ. అప్పుడప్పుడు గంధర్వ వైభవుండు మణిచాపశరకలాప రాజితంబును, మదాంధ రాజహంస
ధ్వజశోభితంబును మంజులతర కంజరాగ పుంజ పింజరిత మరీచి మంజరీ సంజనిత
సమంజస సౌదామని ధామంబును మాత్రికనతావిదంతురితాంతరాభిరామంబును మనో
రసార కిరణ ధోరణీ సంస్ఫూరిత విశాలశరదంబును నగు వరదంబు నధివసించి సము
జ్జ్వలిత హేతిధరవిభ్రమంబులు నుద్దండదండధర సంభ్రమంబులును, నున్నిద్రపుణ్య
జనవాగ్విశేషంబులు నుజ్జృంభిత వాహినీశ్వర రసోన్మేషంబులు, నుద్ధూత కేతనా
నిల కోలాహలంబులు నున్నత రాజరాజభుజా కౌతుహలంబులు నుగ్రసేనాగణ
కలకలంబులు నవధరించుచు నానందనోద్యానరాజంబుఁ జేరం జనుసమయంబున

సీ. నృపమౌళిభవ సువర్ణ సరాగములు నవ, ర్ణ సరాగములు నభిన్నత సహించెఁ
గమనీయ తపసీయ కదళికావనంబు, గదళికావనంబుఁ గలసి మెలఁగె
లలితమాగధలోక కలకంఠ గానంబు, కలకంఠగానంబు నలమికొని యెంచెఁ
దతవాదన సమీర హత కిన్నరరుతుల్, కిన్నరీరుతులు నేకీభవించె

తే. నపుడు సేరంగ వచ్చిన యువనిజాని, కవనిజానీక మచట సాష్టాంగ మెఱఁగెఁ
గేళివనబహిరంగణా క్షీణమహిమ, మసురనర్షు రానుబింబసంభావనమున. 147

క. కులపతియు క్షేత్రధరులొం, త్తిలి పొంగు భళాయనంగఁ దేరు డిగి మహీ
శుల ననిపి బలము నచటనె, నిలిపి యుపవనంబు సొచ్చి నిజహితయుతుఁడై. 148

తే ఘనతరఫలాన తాఖండ కదళికలను, గీరరాజీకృతసజీవ తోరణములఁ
బొంగు నెలమావిపరుడా లభింగసవ ఫ, లావళులఁ గాంచె నృపుఁడు వనాగ్రసీమ.

మ. అలచైత్రాంచిత పత్త్రశాలికల నిష్టాహారతృప్తిం గుహూ
హాలముల్ గాంచు ద్విజావళుల్ శ్రుతిహితా వ్యాజానులాపంబుతో
నలఘుశ్రీకరశాఖి కాంచనకపినిర్వ్యక్త్యైకసారార్ద్రవృత్తం
బులు రాల్చెన్ నరదేవరత్నమకుటీభూషావిశేషంబుగన్. 150

ఉ. ఆదగణీయరాజకకథ నాంకశుకోక్తులతోడఁ దివము
తెరువచాలు శోభనపుటారతు లెత్తెపదాగతిన్ గిరి
త్రోదవినోదికిం జిగురు జొంపపుఁగెంపులపళ్ళెరంబులం
బ్రోడిఁ దనర్చిన గ్గలపు మొగ్గలు ముత్తెపుముగ్గులేనఁగన్. 151

మ. అలరారన్ నెలతాలఁ గట్టిన మహీజావాలముల్ గొన్ని స
త్ఫలసాంద్రంబులు గొన్ని పల్లవరుచి ప్రాగ్భారపట్టాంబరో
జ్జ్వలముల్ గొన్ని సమగ్రశారదరజోజాలంబులై మాధవుం
డులుహానించిన కౌప్యపాత్రికలు నా నొప్పెన్ వనాగ్రంబునన్. 152

మ. కలకంఠార్భటి నొండొరుం బిలుచునన్ గాఢచ్ఛదాచ్ఛాదికల్
వోలయంగా నవగంధబంధురరజంబుల్ సిందఁగా జాలకం
బులు గాసిం బడఁగా నికుంజనిలయంబుల్ మీఱి వాయుత్వరం
దలసూపెం బ్రతతీసతీవితతి గోత్రాకాంతుఁ డేతేరఁగన్. 153

చ. జనపతిదారసిల్లె నొక సంపెఁగశాఖల కొమ్మ రాగవ
ద్ఘన సుమనోభిరామ యయి కాఁక వహింపఁగఁ బోలుఁ గానిచో
ననుపమపంచసాయక కరాంచలచంచలచాపశింజినీ
జనితకఠోర ఝుంకృతులు సైఁపక యున్నె పరాగపాండువై. 154

చ. చలితలతాంతకాంతి యను చందురకావి చెరంగు దాఁటి స
మ్మిళితవయోవిలాసముల మీటిన విచ్చుఫలస్తనాగ్రముల్
వెలువడఁగప్పెఁ దత్క్షణము వేల్లితదోహదధూపధూమకం
తలములుంవిప్పి దాడిమల తాలితాంగి వృషాలు చెంగటన్. 155

సీ. చిగురుఁ గెంగేలుసాఁ చెరసాలవల్లరి, తేటిచూపులఁ జూచెఁ దిలకలతిక
పికగీతిఁ బాడి చూపెఁ బ్రియాళులత పల్కె, గీరభాషలఁ గర్ణికారశాఖ
ముక్తిరక్తి నింపె నింపుగల సంపెఁగకొమ్మ, పన్నగా నగియె తేఁబోన్నతీక
సురభిళశ్వాసనంబు నెరపెసింధుకవల్లి, క్రుచ్చెదావులుం సోఁకఁ గ్రోవికొమ్మ

తే. యాత్మరుచిరోపచారంబు లధిపకల్ప, కంబునకుఁ దత్తదామోద గరిమఁ బెనుప
నంగనానిత్య కలితదోహదవిశేష, సన్నతాచారముల నడి సన్నకతన. 156

మ చనువొప్పన్ నగిపల్కి పాడి కని యాళ్యాసంబునొందించి చే
కొని మోమిచ్చి కవుంగలించి తరులం గొన్నింటి మన్నించి యుం

గన లయోగ్యమము నెంతచేసి రసుచుం గంకేళియుం గేసరం
బును భూజానికి మ్రొక్కి గుచ్ఛవినతిం బూఁచే నెకన్నీటితోఁ.

మ. లలితైణాంకశిలాలవాలమునకే శాఖాళిలో నీరువైఁ
జెలువొప్పన్ ధరియించి తోడనె మిళచ్ఛిక్రోడదంష్ట్రాద్రిదళ
త్ఫలరంధ్రంబులచే వెలార్చి జలసూత్రస్తంభముం బోని య
గ్గలపుంజాయల కుజ్జసారికదముం గాంచెన్ విభుం డయ్యెడన్. 158

తే. నృపునెదుటఁ దేనెవాఁకలో నిబిడవిచల, దతనుపత్రాళిఫలసాంద్ర మగుచు నొక్క
నగము కైవ్రాలి యేటిలో నాటియున్న, నాఁటి యున్నతనగరాజు నలువుఁ దెలిపె. 159

ఉ. ఉన్నతి నన్నగాగ్రమున నున్న యొకానొక కిన్నరద్వయం
బన్నిఖిలోక్తివేది కపు డన్యదురాసద మైన యొక్కయా
సన్నశుభంబుఁ దిన్నని ప్రసన్ననిజోక్తులఁ దెల్పి తోనయే
గన్నరదేవపాదపవిఖిన్న బృహన్నగకూటవాటికిన్. 160

క. ఆలోకాద్భుత విహగయు, గాలోకప్రీతివలన నతి లోకనయః
కోలాహలకోలాహల, లీలాహాలహాలిక చెంగలించెం బతికిన్. 161

## ఆశ్వాసాంతము.

మ. అవితోర్వీ నవఖండ ఖండపరశు జ్యాక్ర భోగిసాభోగభో
గవిభాస్వద్భుజదండ దండధర వీక్షారూక్ష నానావిప
క్షవిభుక్షేపక కాండ కాండభయకృ ద్గంభీర భేరీమహో
గవదీర్ణాద్రిపిచండ చండబలధౌరంధర్యహార్యగ్రజా. 162

క. శ్రీకర్ణాటేశ్వర వి, శ్వాకర్ణిత బిరుదశాప నాంక వితీర్ణి
శ్రీకర్ణ దళదిశాలల నాకర్ణాభరణ సుగుణ నవరత్నఖనీ. 163

పృథ్వి. కబంధహర ధీరతా కరకరాసికృత్తత్రుట,
త్కబంధ పరిపంథిసంగ్రంథితనూర్గ్య నూర్వ్యర్పిత
ప్రబంధరసబంధురార్థపదబంధ బంధుస్వధీ
నిబంధన యశోంధనాగ్ని సభనిత్య తేజోనిధీ. 164

## గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందనపవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య పర్యంకపచతుర్విధకవితానిర్వా
హకసాహిత్య రసపోషణ రామరాజభూషణప్రణీతం బయిన
వసుచరిత్రమునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీగురుభ్యోన్నమః

# వసుచరిత్రము

## ద్వితీయాశ్వాసము

శ్రీతిరుమలరాయ జయా, శ్రీతరుణీరమణ సుగుణ శీతల యశా
శీతలసేతు ధరాధిప, రాతతభుజదండ మూరురాయరగండా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలసన్ము, నీంద్రులకు రోమహర్షణి యిట్లు పలుకు
నమ్మహీజాని నిజవిహారాచలేంద్ర, దివ్యసౌభాగ్యములు చూడఁ దివురుటయును. 2

ఉ. ఆయెడ నొక్కవర్మసచివాగ్రణి యిట్లను నోయఖండతే
జోయుత యాస్ఫురం బొకటి చూచితి నాపెద నీకు నాదుచే
ఛాయనె యీడు మద్భ్రమునఁ జక్కఁగ నల్లదె పల్లవమ్ములోఁ
పాయవు కొన్ని ప్రాకులు స్ఫ్రు పాయవుఁబొమ్మవిశాఖభూజముల్.

చ. అన విని నవ్వి సూక్ష్మగతి నావసి యాఁనికొవతింసుఁడి
ట్లను మనకేళిశైల మగి యల్లది తన్మఘవాశ్మకూట మ
మ్మనికిమహీజముల్ చదలు ప్రాఁకులటంచు భ్రమించిపల్కెదై
నను మృష గాదు నీపలుకు నాకనగంబులెతద్ధ్రుమావళుల్. 4

సీ. అచటిసానువులు రత్నరుచిరంబు లవనేల, వానివంశములెల్ల నీలమణులు
ద్రుమములెల్లను సురాగములౌటరుదె ని, త్యానురాగములం తదీయాంకురములు
లతలు సంజీవనులగావె యచట వాని, తావులు నతనుసంజీవనములు
రసములెల్లను సిద్ధరసములౌ టెంత త, త్ప్రసవంబులును సిద్ధరసములచట

తే. నచట మణిచిత్రభూములు నచట నమరు, నమరతరువులగుమురుఁ నచటితీవ
లచటిపొందమ్మికొలకులు నభవునింట, నైన నాదంటబలుమింట నైనఁగలవె.

మ. అదిగాదే మనకేళిభూధరము దవ్వాచూచె మాయద్రి సం
పదలంచుం గయిదండబూని ధరణీపాలుండు లీలాగిరిం

గడియన్ నర్మసఖుండు వల్కె నచటం గల్పద్రుమాళోరసో
ష్మద వైమానికమానినీమధుర గానస్వానసానందుఁడై. ౮

సీ. ఒకచాయ నవచాయ పికగేయసముదాయ, మొకచెంత నానావయోహారనినద
మొకచెంత నకలంక మకరాంకహాసహాసము, లొకచేవ వనదేవ యువతిగీతి
మొకచెంత సురకాంత లకరాంత తతనాద, మొకచారి నవకారి కోవిదతంబు
లొకయోరఁ బటుచార ణకుమారభణితంబు, లొకదండ నలిమండలికలగాన

తే. మొక్క మొగ్గిమోయఁ గదలిగ్గ హాసపన్న, కిన్నరీబృందబృందసంగీతరీతి
సమరుసతి వేల కోలాహలములకలిమి, నధిపయీయద్రి కోలాహలాఖ్య మిూకొ

మ. ఘనజాంబూనదరౌప్యరత్నరుచులన్ గన్పట్టు నీగట్టుఁ జూ
టినగండోపలమండలంబుఁ గనుఁగొంటే మేదినీశైలశా
సన యుష్మచ్చరణావధూతి మగునీ శైలంబు నూరార్పఁగా
ననుకంపామతిఁ జేరు మేరుముఖగోత్రాధీశులం గోలెడిన్.

ఉ. అక్కట నీయుదగ్రచరణాహతి కోరువ లేక యేగతిన్
స్రుక్కెనొ గట్టురాచకొమరుం డలనాఁడు కపోతిహుంకృతిన్
గ్రక్కన మూల్గుచుండిల ముఖంబున నేఁడునుగంటె నెత్తురుల్
గ్రక్కెడు ధాతువుల్ చెదరఁగా నరుణాంబురుహోర్మిమంబునన్. ౯

మ. వసు సుశ్వేత్తుగఁ బాణిమిాత్రితివి నానాధైర్యసామగ్రి మ
జనపున్ మున్నె తృణీకరించితి కృపాస్వాంతంబునం బ్రోవు మిం
క వరేంద్రాయని గట్టువేఁడెడి నినుం గంటే తుణగ్రాహినూ
తననీలాశ్మదరీముఖాగ్రవిచల ద్వాతూలమంద్రధ్వనిన్. 10

వ. మఱియు నిక్కులాచలసంతానంబు సంతానకుసుమవాసనావమానగతసారంగసంగీత
భంగీతరంగంబు లుపాంగంబులుగా పాడువేల్పు గాణేలపాణీరిత మాణిక్య వీణామధుర
రాణామృతంబులఁ గరగిజరగుఁకురువింద కందళంబుల జలంబులఁబదనైన గైరికతలం
బులం బోదమినకారణ గుణంబునఁ బగడంబుడంబువిడంబించు నిగనిగని తొగరు
నిగుడ సెగడుసగణితలతావితానంబుల నొయ్యనొయ్యన యొయ్యారంబుల నురమ్యాల
లూఁగున బరగజరాజయానలయుపరి విస్ఫురచరణ కంజమంజుతర మంజీరంబుల
చెచ్చుపెరుగునచ్చుపుఁ బచ్చలచాయలు మెచ్చుగా నేయఁబద్మికలమద్మికలవిచ్చలవిడిఁ
గ్రచ్చుకొని మెపవ నుంకించు నంకపురాజంక జంకించి మగుడరాఁ దివియు నెడ
బెగడి తోడఁబడ దడబడవడుగులిడఁగందు చందురుని మేనఁ జిందును ధాబిందుసందో
హాంబుల పొందునడించుపడి భవదయా చరణనిహతిఁ జెకలిన కఱకు బెట్టకలు మగుడ

నిగిడించిన తెఱంగునఁ బరఁగు కార్ముకులు తెగలను గని సమద సామజసామజంబులని యరసి మెఱసిన మెఱపునొఱపు లుపరిపరికీర్ణ గైరిక పరాగంబులనియు మరియు లురుముఖబృంహితంబులనియు రేసి యేసగాఁ దివిసి తడవిండ్లనేసి క్రొవ్వునంగూని డాసి తదుపరకరకనికరములు జలజల దొరఁగినం జూచి గుత్తింపుముత్తియంబులని యేఱి సారెసారెగేరనగింజ లాడం దలంచు చెంచుముద్దియల యశ్రాంత వ్యాగయా పరిశ్రాంతి నివారించు పటీరతరువాటి కలను, బటీరతరువాటి కావిటపములనికట మూట కోటీవిటంకంబులనొరయ నెరయు సురభిళగిజంబులతోఁ బరిఫుల్ల హల్లకప రాగపూరంబులు పరికీర్ణ కాశ్మీరకేసరాసారంబులు పరిమృదిత శైలేయసారంబులుఁ బనిమియొసగఁ సగఁ బాలు మేళవించి యభ్యంచిత కాంచన ప్రసవసౌరభసమాగమంబునం బువ్వుగిట్టి గంధవహుండు సవరించిన యందంపుగందవొడి నెఱపలపులు పలపుల తేని కలనఁ గల యలపుల పనయింప నింపుసొంపునఁ బెంపు మిగులుకింపురుష చంపకామోదలను దాఁపు లగు సేవంతిపూఁబొదలును, సేవంతి పూఁబొదలచినుకున ననఘహిమసలిలములు నెలచలపదొనలదొట్టి జలజలనజాలుగొని వెల్లువలై మల్లడిగొని యల్లనల్లన యతిశీతలశిలాతలంబుల మెలఁగు కస్తూరిమెకంబులమద భరంబులం దొరకు నాభీరక్తంబులిగిరి గనిగట్టిననిగరములు గఱచికొని పఱచియవల గమ్మన బరిమళించుకత్తు జవ్వాదికలయికలఁ గలసిగ్గుల నగ్గలంబులై కదలి కర్పూరకదళికల పుప్పొడి తిప్పలయొప్పు నప్పళించి గ్రమ్మన జిక్కనయినయాచొక్కపుఁ గదంబంబులు పూయు విద్యాధరీకదంబంబుల యాటపాటలకు మెచ్చి యచ్చట వనదేవత లెత్తునారతి పళ్లెరంబులకరణి దనరుతరణికాంతపట్టికలును, ధరణికాంతపట్టికల బుట్టుదట్టంపు సెకలపై నెట్టుకొనుననతిచిరప్రసూతచమరీస్తన్యంబులు పొంగిన గనుంగొని చెంగటిముని జనతపో వలవన భవనంబుల బ్రవర్గ్యారంభంబు లని విందులకు ముందుముందుగాఁ గ్రందుకొనివచ్చు బృందారకసందోహంబులును గలిగి నవరతామోద సిద్ధమహిళాకులంబయ్యు, ననవరతామోద సిద్ధమహిళాకులంబై, నిశాకర కాంతరాజీవరాగచ్ఛాయం బయ్యు నని శాకరకాంత రాజీవరాగచ్ఛాయంబై, మేరుభూరిప్రభాభాసమానం బయ్యు నమేరుభూరిప్రభాభాసమానంబై వెలయుచున్నయది విలోకింపుము.

౬౬. కొలకులపజ్జ పజ్జకపు గొజ్జఁగె పూఁబొదరిండ్ల జొరునం
జిలుకు హిమాంబుపూరములు శీతకరోపలపట్టికాతటం
బుల దుముకంబుటం బెగయు భూరితుషారకణంబు లెల్లెడన్
వలగొన నున్నగంబు హిమవన్నగమన్ దనరారుభూవరా.

మ. అని కేళీసచివుండు చెల్ప నిజలీలాహార్యమాసింహాసం
హాసనుం డెక్కి తదీయనిర్ఝరసమీరాంచోళితైలానుగం
ధినికుంజాంతర వేదుకాంతమణివేదిం బ్రోదిమై విశ్రమిం
చిన నట దొక్కకలస్వనంబు వినవచ్చెం గామాధురీధుర్యమై.

క. వీనులవిందై యమృతపు, సోనలఁ బొందై యమంద సుమచలదళిసీ
గానముక్రందై యారవ, మానంద బ్రహ్మమయిన సధిపతి వల్కెన్. 14

శా. నాదం బొక్కటి పిక్కటిల్లె దిశలన్ నవ్యామృతావ్యాహతా
స్వాదం బై వినన య్యెడిం బ్రియవయస్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠనాదమొ మధుస్నారీవణీపల్లకీ
నాదంబో వివరింపరాదు పరమానందానుసంధానమై. 15

శా. నానాగాయకగాయనీమణులనాదంబుర్వి నాలింపమే
నానాటం జనగభేదివీటఁ గలగంధర్వాప్సరోగీతవి
ద్యానై పుణ్యము లెన్నియేని వినమో యందైన నిందైన విం
తైన నాదంబొనఁగూర్చునే మదికి నిట్లానందసందోహమున్. 16

చ. అన విని కేళికాసచివుఁ డాస్వనమల్లన యాలకించి యో
జనవర వల్లకీరవము సంగతిఁ బాడెద రెవ్వరో వినూ
తనగతి నిమ్మహాద్రిపయి దన్మృదుపంచమషడ్జశయ్యకో
యను వెలుఁగించె వింటె భ్రమ దామలకోకిల కేకిలోకముల్. 17

క. అనవుడు శశికాంతదరీ, జనితప్రతినాదమయిన సంగీతకల
స్వనము మనమున నోకానొక, యనురాగభరంబు బెనుపఁ నవనిపుఁ డనియెన్.

ఉ. ఎచ్చటివారొ యీదరుల నీబలుగోనల నీనగాలిలో
నెచ్చట నున్నవారొ మది కింపులు నింపుకలస్వనంబుతో
నిచ్చటఁ బాడుచుండఁ గత మెయ్యదియో వివరించి క్రమ్మఱన్
వచ్చెదవే తదాయతన వాటికిఁ బోవుద మీక్షణంబునన్. 19

చ. అని యనుపన్ వినోదసఖుఁ డచ్చటి పూఁబొదరిండ్లుచూచి కాం
చనమణికందరాసదన సంతతు లారసి పక్వగోస్తనీ
ఘనతరకాయమానములు గన్గొని తిన్ననికన్నె మావిగుం
పునఁ బెనఁగొన్నమల్లియలు పూచినకోనలు గాంచియొక్కచోన్.

సీ. లేలెల్ల నమృతము రీచిసంటున నంటఁ, గరఁగి నిర్మలపయోఝురులఁ దొరఁగి
బలువిడి పెనులోయఁ బడినక్రొన్నెల తాల, చఱులలో నెరుగడఁ దఱచు మెఱచు

ఉటికింపుఁ బణుకుల పజ్జగొజ్జగినీటి, యేటిక్రేవలఁ జలి యిసుక వెట్టు
నేడాకుటనఁటుల నెలమావిగుమురుల, సురపొన్నకూటాలఁ జొట్టుకొనిన
తే. బండిగురువెంద తీఁగ చప్పరములెవసి, ముడిగొనిన ద్రాక్షపందిళ్ల వడువుఁ గిన్న
రీనినాదానుకారిశారికాది, ఘోషమఘుమఘుమి తంబైన కోనగనియె.

## లయగ్రాహి.

ఓగగయిప్రాలిన న పేరువుల పుప్పొడుల, సారువుల వెంట సహకార మిలదేలా
ధారములఁ జాదుహిమ వారి కృతసారణులఁ, బైరయిన చెంగలువ యారికలలోఁగా
శ్మీరకృత సేతువుల దారిజనుచో నచటఁ, గూరుకలహంస లగడై రొదలు సేయం
గీరములు సారెఁ బెఱ వార లిట చేరి రని, చారణులఁ జీర వసు వీరసఖుఁ డంతన్.

సీ. పగడాలకోణిగల నిగనిగల్ వజ్రంపు, జగతిక్రేవల నెఱ జాజు నింప
నిలజాలకజాల జాలోకము లఖండ, కాలాగరుజధూప కాంతిఁ బెనుప
ముత్యాలనవరంగ ములరంగు నవరంగ, వల్లి విభూతి ముంగిళ్ళ నునుప
గారుత్మతద్వార చారుప్రభాపూర, తోరణంబుల హరిత్తులు పొసంగ
తే. ధర్మపాంచాలికాపాణి పద్మరాగ, రాజినీరాజనోపచారముగ వఱలఁ
దరళవైడూర్యవలభికల్ తెరలు నెరప, నిరుపమంబైనదివ్యమందిరముగనిరి.

క. కనుఁగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తి ముకురతలబహి
ర్జనితానుబింబనమ్మ్రలు, వనితారత్నములు మెలఁగు వల నెఱింగింపన్. 24

చ. తరువులపొంతఁ బొంచి వసు ధావరమిత్రుఁడు గాంచెనచ్చటం
దరుణి దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతని తంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొక దన్విఁ దరంగవళిం దలోదరిన్. 25

మ. లలితామోదలతావితానవృత లీలాచంద్రకాలాతలో
జ్జ్వలనీలాతతవేదిపై మొగులుక్రేవన్ మించు క్రొమ్మించునా
నలువై యత్తరి నత్తలోదరియు వీణావాదనప్రౌఢిచే
జెలులన్ రంజిలఁ జేయుచున్కి నృపసం సేవాపరుండాత్మలోన్.

సీ. తనకప్పు నెరిగొప్పు ననెపూని గౌరీశ, మాళ్యమించ జనించి నట్టి యార్య
తనచాపలము చూపు లనె చూపి సిరులెల్ల, కడఁజల్లవచ్చిన కమలపాణి
తనపాండిమము నవ్వు లనె యుంచి గాంధర్వ, మవనికి దెచ్చిన హంసయాన
తనయదృశ్యతనదు మనె తాల్చి సాంగమై మించినయతను సమ్మోహవిద్య

తే. గావలయుఁ బ్రీవెలఁది దీని కాంతిఁ గనఁగ, నాభిరూప్యంబు లెరిగించి యామహేశ
వానగోద్ధారకుని నాప్రజాధినాథు, నాజగన్మోహను నిఁకెత్తు ననుచుఁ జనిరొ. 27

చ. చని విభుఁ గాంచి పల్కె బల శాసనసన్నిభ నీదుపంపునం
బనివిని తీవగుం పనక పాంసుర సైకత నిర్ఘరోత్కటం
బనక దరీపుటం బనక యున్నియు జారసి యొక్కచో వినూ
త్నలవలీలతావళుల తావులతావల మయిన తావునన్. 28

శా. నాళీకాకరతీరసారకదళీ నారంగపూగావళీ
పాళీవాసిత మయిన కోనఁ గని యా బల్కొన్నలో గానలో
లాళీ పేరకరత్న కోరక మయూ ఖాలవమాలీఢ మా
కేళీధామముఁ గంటి భూరమణ యా కేళీనివాసంబునన్. 29

సీ. పలుఁదగుబ్బలు ప్రసవ వకవృత్తిఁ దగుగుబ్బ, కాయల కపరంజి చాయ లొసఁగ
లలితాంగుళీదళం బులు సమేళములైన, సారెలపైరాగ సంపద లిడ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు, గల తాళగతికి ననుగ్రహములీన
నాలాపభంగి యత్యక్తసంవాదిస. మస్వరంబులకు గ్రామంబులనుపఁ

తే. బ్రచురగానామృతముల మూర్ఛనలచేన, చేతనంబులు చేతన రీతిఁ దనరఁ
జేతనంబు లచేతన భాతి నొనరి, వీణ వాయించు నొకయువతి వేణిఁ గంటి. 30

క. నరరాజకన్యలనుగి, న్నరరాజకుమారికలు ఫణాధర విద్యా
ధర వీణాధర శోణా, ధరలును నాతరుణిఁ బోల్పఁ దగరు నరేంద్రా. 31

తే. మేటిజమ్మటి యసటఁ గ్రొమ్మించుమించు, బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టఁ
దమ్మిగద్దియుదాకటఁ గ్రమ్మియట్టి, కొమ్మఁ గావింపబోలు నెత్తమ్మిచూలి.

సీ. వనితపాదములు ప్రవాళంబులై మించుఁ, గటి యచలాభోగ కలనఁ బొదలు
పడఁతిగుబ్బలు మీరు భద్రకుంభనిరూఢి, వదన మబ్జఖ్యాతి వదల కొనరుఁ
గలికిచెక్కులు చంద్ర ఖండంబులై పొల్చు, గన్నులు రాజీవ గణనగాంచు
వెలఁదివేనలి నీల విషధరంబై తోఁచుఁ, దనువెల్ల గాంచనం బనఁగ నెసఁగుఁ

తే. బగడమిరుగారు నిలుఁజట్టుఁ బనఁటుఁబఁగకరి, కుంభములుఁ దమ్మి వెలవెల కూనఁగపుర
మబ్జములమాల మెయిఁగాఁ గా లాహిఁ బసిఁడి, సంపెఁగల గూర్చి నలువ నిర్మింపఁబోలు.

తే. వవనవనజహృతాంశు సవ్యాస్యుఁ డగుచుఁ, గుందునిందుని దరహాస కందళమున
మఘవు నవి పావనులు ప్రాలి చని విసుని, కొమ్మలన నింతి మృదునఖాంకురములమర

ఉ. ఘోషపదద్వయం బడుగుఁ బాయక కొల్చు సరోజరేఖలన్
శ్రీ మెఱయన్ ధరించి మఘ జృంభణచే మొనమూపుపల్లవ
స్తోమము సౌకుమార్యమున శోభయుఁ గైకొనఁ బోలుఁ గానిచో
గోమలతారుణత్వములు గొల్పుడునే యవి నాఁడు నాఁటికిన్. 35

తే. కమలగర్భ హిరణ్యాక్ష హాళులు వొరయ
నీఁతలును బ్రోతఁలును జూపి యెలమి మకర
లీల లోఁగొని వానల శరాళి ముంచి
యబల మృదుజంఘికాప్రకాశౌఘ మడరు. 36

మ. సతియూరుద్యుతిఁ జెందఁబూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై రంభేభహస్తంబు లం
న్నతరిక్ష వీడె మరుద్విభూతిఁ గదళిన్ వ్యగ్రోష మాచంచలో
ద్ధతఖండాతతిఁ బాయదయ్యె నదెపో తద్వైర మూలంబిలన్.

చ. అతివనితంబబింబ మఖిలావనిభాగము నేలి దివ్యలం
చితరుచి నాక్రమించి యరిజృంభణవారణధుర్యమై సువృ
త్తత బరిపూర్ణ రాజరమఁ దాల్చి కదా గజమస్తకోపరి
స్థితమయి కాంచెఁ గాంచిగుణ దీపితకాంచనపట్టబంధమున్.

ఉ. కలికిముఖేందుకాంతికర కాంతపయోజలదాంత వేళ వ
ర్తులకుచగండశైలములు దోఁప వళిత్రయశోషరేఖ లిం
పలరఁగ మధ్యసీమ బయలై కటిసైకత మొప్ప బాల్యమ
న్పలునది యింకఁజో మెఱసె నాభి గభీరజలాశయం బనన్. 39

ఉ. అలికులవేణియారు నవయౌవన మన్ వలరాచతోఁటలోఁ
బొలుచు నితంబవేదికడ బొక్కిలిదిగ్గియ చెంత నీలసం
కలితనవాంబుయంత్ర మగుఁ గానియెడన్ రసగుంభనంబు సం
ధిలఁ బుట ముబ్బునే నడుమ నిల్చి ఘనస్తనసూచవగుచ్ఛముల్.

మ. ఘననాభీగుహ చెంత నారుపాగ లేఁ గానాని తా నాయనం
గని మెప్పించి తదాత్మతం బొరయఁగ న్గోఁజాల కుజ్జృంభిత
స్తనయుగ్మం బతనుత్వ మొందె నధరోష్ఠం బిక్షుధర్మస్థితిం
దనరెం గన్నులు శంబరాహితగతిం దాల్చెం బయోజాస్యకున్.

సీ. క్షణవిలాసమె కాని గజనిమ్మపండులం, బరియె దుర్గాధివాసమున మనినఁ
జెవ్రూఁతరుచి గాక ప్రతియె కిన్నరకాయ, లరిది మేదువు తల యంపి నిడిన

ప్రోద్భవన్నైతె కాక యద్దియే తమ్మి మొ, గ్గలు చక్రములఁ గూడి దళము గొనిన
గాఁక చాయలె కాక కనకకుంభము లీడె, శ్రీకరాల శిరోగ్ర సీమ నున్న

తే. విలితఘనసారమై నున్న మిగిలి కదిసి, యంతరము సూక్ష్మమున కీక యలరిజోడు
వదల కమితరసప్రౌఢిఁ బొదలి మెఱయు, నన్ను తలమిన్న వలిగుబ్బ చన్నుఁగవను.

చ. సతి హృదయాలవాలమున జవ్వనపుం బెనుఁగాఁకఁ జేసి య
య్యతనుఁడు గుబ్బపాంబనటు లారనులోహశలాక నైత్రియా
రితరుచి నింపగాఁ దుదల జిందివతాపొడి బాహుమూలజ
ద్యుతి యగుఁ గానిచో నచట దోర్మ్రయధర్మ్రలబెల్ జనించునే.

చ. విలసితమౌక్తికంబులు స విభ్రమ రేఖలు నున్కి సొక్కిరాఁ
దలఁచిన హార్ధతిన్ మెఱసి తన్మృదునాదవిలాసకౌశలం
బలవడమిన్ మడింగి దర మైతనలో విహరం బెఱింగి యా
వలమురి దాఁ బ్రదక్షిణము వచ్చెనొ యాతనికంఠలక్ష్మికిన్. 44

సీ. కొమ్మవాతెఱతోఁగు జమ్ముఁ గైకొనవచ్చి, కఠినవిద్రుమము చేఁ గట్టబడియెఁ
గోమలియధరంబుతో మొనల్ పచరించి, యరుచిబింబఫలంబు లవిసిపడియె
మృగనేత్ర పెదవితో సొగసుఁ బూనగడంగి, కెంపునీరసము పెక్కించుకొనియె
సతిమోవితో రస సిద్ధులు చూపిసుగంధ, వికల బంధూక మూరకయ విరిసె

తే. డాయు పగడంబునకు బగడంబు బింబ
మునకు బింబంబు మెఱయు కెంపునకుఁ గెంపు
బంధుజీవంబునకుఁ దాన బంధుజీవ
మౌర యాసుందరవదన రదాంశుకంబు. 45

ఉ. ఇంతిమృదూక్తి మాధురికి నిష్ఠురసం బెనవోలజాల కా
ద్యంతమునోడి మధ్యమగు నాశ్రయమై నెఱగాక పెన్నిజ
న్మాంతరముల్ వహించియుఁ దనంతనె ఖండములయ్యెఁ గానిచోఁ
వంతయుఁ బూన దెంతవోడి యయ్యు నఖండతవీయ సంపదన్.

శా. నానానూన వితానవాసనల నానందించు సారంగ మే
లౌ నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపం బందియో
నానాసాకృతిఁ దాల్చి సర్వసుమన స్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలి కామధుకరీ పుంజంబు లిర్వంకలన్.

మ, తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్త్వంబు లేఁగల్వతూ
పునకుం జాలదు వేగలీల యని యా పూముల్కి లెగ్గించి క్రొ

న్నవిలాసుఁడు నవాంబుజోత్పలవితానం బీనమీనాక్షికో
చనముల్ వింటఁ ఘటింప బొల్చెనవి నిస్తంద్రాంబకఖ్యాతులన్.

తే. త్రిజగతీసుదతీరూప విజయకీర్తి, గలుగునని యింతిఫాలభాగమున వ్రాసె
నలువ యాశుభవాచకం బులను శ్రీల. మొదల దుదినిల్పెనన గర్ణములు దనర్చు. 49

చ. అనయము నీలకంధరము నభ్రము నన్నసమాఖ్య వారితో
నొనరియు నింతివేనలికి నోడె యనిశ్చితరూపధేయ మై
చనియె మొగుల్ వగావళికి శబ్దగుణంబులు నూఫువాని నె
ట్టనఁ బురివిచ్చువానిదరి డాయుజడాత్ముల కెవ్వినిల్కడల్. 50

సీ. కన్నెపాదము లజుఁ గన్నమేటికినైన, బాలజంఘలు వరశాలికైనఁ
బూఁబోఁడిజఘనంబు భూరివేదికినైనఁ, బొలఁతిపొక్కిలి సరసులకునైన
సతికొను సర్వజ్ఞమతికైన నతివచ, న్నవప్రసన్నాది త్యకవులకైన
రమణినెమ్మోము పూర్ణకళానిధికినైన, వనితవేనలి ఫణిస్వామికైన

తే. గుణములన్నియును గ్రహింప గోచరింప, వనిన మముబోంట్లకు నుతింప నలవియగునె
కువలయాధీశ నీవుగ న్గొంటివేని, చెలువచెలువాత్మఁ బాయక నిలుచునేమొ.

మ. కమనీయాకృతి యోగ్యకీర్తనములన్ గన్పట్టునాశ్యామ యా
సుమనోవల్లరి యాసుధాసరసి యా సొంపారు డాల్దీవి యా
సుమబాణాంబక యాయమూల్యమణి యా చొక్కంపుఁబూబంతి యా
కొమరుంబ్రాయపురంభ యాచిగురుటాకుంబోఁడి నీకే తగున్. 52

తే. చిత్తజాకారయా చెల్వ చెలుల చెల్వ, మలవియె నుతింపవారు వా మాక్షివలనఁ
గలికిచూపులు నపవద్య గతులఁ బొరయ, గదిసిన సురాహిరాజన్య కన్యలొక్క—

శా. ఆలావణ్యవతీమణుల్ గొలువగా నాలేమ యాకోనలో
నాలీలాభవనంబులో ననఘ కంతాలప్తిసౌభాగ్యముల్
వ్యాలోలాంగుళిసంజ్ఞచేఁ గఱపుతే వన్ వీణఁ బల్కించు నా
యాలాపంబె గిరిన్ దరీముఖరమై యాలింపగా నయ్యెడిన్.

ఉ. స్వైరవిహారధీర లగు సారసలోచన లున్నచోటికిన్
బోరన లాతివారు చొరఁ బూనినచో రసభంగమంచు నే
జేరక పువ్వుఁదీవియల చెంతనె నిల్చి లతాంగిరూపు క
న్నారఁగఁ జూచివచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్. 53

చ. అని చెలి విన్నవించుటయు నాహితవాక్యము మున్ను విన్న య
న్నినదముకన్నఁ దిన్ననయి నీరజలోచన యున్న కోనకుం
జనఁ దివిరింపఁ దత్ప్రియ వచఃస్థితికన్న విరాళినించె న
జ్జనపతికిన్ మనోజభుజ చాపలతాగుణగుంజితార్భటుల్. 56

తే. కిన్నరవిహంగయుగళిచే మున్ను విన్న, సన్నుతాపన్న శుభద ప్రసన్న ఫణితి
మదికిసరిదాఁక ముదమునఁ బొదలి మేది, నీపతిహితాగ్రణిని ద్రోవ నూపు మనుడు.

సీ. ఈతాలఁబోరాదు హేరాళము జవాది, యీరాలనడుచక్కి నేఁగవలయు
నాకాన నేకాల మడరు దేనియవాన, లాకాన నేర్పున నరుగవలయు
నీవంక నేవంక నెనసినతుహినాంబు, లీవంకఁ బూఁదెప్ప నీదవలయు
నామాలనునుమాల జాబెత్తములచాలు, లామాలముగఁ దీవ లంటవలయు

తే. నధిప యిదిమానికపుఁగోన యదెలతాంత, రజముసోరువ యిది కప్పురంపుటనఁటి
చప్పరఁబల్లియది కాంత సదనమనుచు, నరపతికిఁ దెల్పె నరుగుచో నర్మసఖుఁడు.

సీ. ప్రకటితోన్మేష కీ పద్మిని కినకిర, ణాతుకావాప్తి వేగనె ఘటించు
దతవయోవిభవ కీ లతకూన కాసన్న, పున్నాగవిహృతి గొబ్బున నెయుబ్బు
విలసితామోద కీ కలికికొమ్మకు రాజ, సారంగయోగ మీ క్షణము కల్గు
భువనాభివంద్య కీ నవరసరసికి, మానసప్రియలీల తోనదొరకు

తే. ననుచుఁ దమలోన లేదోఁట లరయు మగువ, లాడునుడువులు వినవయ్యె నదియెరింగి
నృపయుపశ్రుతి వింటివే యిచటననుచు, నాప్తు డెరిగింపహర్షించె నధిపుఁడపుడు.

క. కుతుకమున నచలసుత యగు, సతిఁ గనఁ జనురాజమౌళి చాడ్పున నపు డా
క్షితిపతి సతిఁ జూచుతమిన్, హితనూచితసరణిఁ గాన కేతెంచె నెడన్. 60

తే. తోలుదోలంత భద్రకుంభముల్ దోఁపఁ బిడప, బచ్చరామానికపు నిచ్చ పచ్చతోర
ణంబు వొడసూప వరుసఁగ న్యాగృహంబు, నరపతి కమూల్య కల్యాణ గరిమ దెలిపె

శా. ఆలోఁ గాంచనమందిరంబు నవర త్నాలోక ముల్లోకమై
యాలోకోత్సవ మాచరింపఁ బతి డాయం బోయి ప్రాచీనపుం
జాలుందీపలచాటునన్ నిలిచి వాచాలాళిపక్ష్మానిలా
లోలత్పల్లవజాల మార్గముల నా లోలాక్షి నీక్షించినన్.

చ. కనుఁగవ పూర్ణకామ మగుఁ గన్గవకన్నను బూర్ణకామమై
మన మతిచిత్తవృత్తి యగు మానసవృత్తికి మున్న చిత్రమై
తనువు రసోత్తరంగ మగుఁ దత్తనువైఖరికన్న సంభ్రమం
బెనసి రసోత్తరంగ మగు నీప్సిత మా నగమాన భేదికిన్. 63

మ. జననాథోత్తముఁ డింతిఁ జూడ ననిమేషత్వంబుఁ గాంక్షించున
య్యనిమేషత్వము కాంతకాంతముఖచంద్రాసేవనానంద వా
సనఁ బ్రాపించినఁ గోర నవ్వడనిమేషస్వామిభావంబుఁ గ
న్గొన నెందుకా నృపులుత్తరోత్తరపదానూనస్పృహాచంచలుల్.

తే. కాంతపద మొంది యట యూరుఁ గ్రమ్మి కాంచి, సీమ నెనసి పయోధర శిఖరిదుర్గ
సంగతికిలోఁచు నృపదృష్టి చక్రశాస, నోన్నతస్థాన మపుడు గా యొదవుఁ దనరు. ౬౪

మ. నిరతిన్ నాభిసురంగ మీఁగియు వలీ నిశ్రేణికన్ హత్తియు
న్వరరోమావలి వల్లరీగణము నంటం బ్రాకియుం దత్పయో
ధర దుర్గంబుల నాక్రమించె నచటం ద్రద్వేషిచూపౌర సం
గర సామోదవినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే. ౬౫

ఉ. ఆమనుజేంద్రుచూపు తిలకాంచిత మై నెఱదావి చల్లునా
రామముఖంబునన్ నెఱయ వ్రాలుచు హాసమరంద చిక్కణం
బై మెఱుఁ గారుగండఫుల కామృత భానుశిలాతలంబుల
న్వేమరు జాఱి యూఁతగొను నిద్దపుఁ బెన్నెఱితీవ జొంపముల్.

సీ. పదములఁ బల్లవింపఁ గనోపుఁ దొడలమం, గళమహారంభాప్తిఁ గాంచనోపు
గటిఁ గరిస్కంధాధిగమలీలఁ గననోపు, నసదుగా నెనసి మిన్నందనోపు
గుబ్బలసిరికల్మిఁ గొండ దాఁకఁగనోపు, నరుత నొక్కనిధాన మరయనోపుఁ
జక్కెరమోవి నిష్టఫలం బెనయ నోపు, శ్రుతులు శ్రీల నెయెదుర్కొనఁగనోపు

తే. రమ్యవద నాబ్జమునఁ బూర్ణ రాజమండ, లాధిపత్యశుభావాప్తి వలరనోపుఁ
గురుల ఘనసంపదలు చూఱఁ గొనఁగనోపు, నింతి నెమ్మేనఁ బర్వు నుర్వీశదృష్టి. 67

తే. వాఙ్మనసగోచరేతరా ద్వైతరాగ, జలధివపు ఢోలిఁ దేలి రాజన్యమౌళి
ఘనతరాశ్చర్యశాలియై వనితరూప, మనితరాయత్త మగు నాత్మ నభినుతించె. ౬౮

సీ. ఘనలక్ష్మి నెసఁగు నంగనముంగురుల పేర, భ్రమరకంబులు ధాత్రి బ్రబలఁబోలుఁ
గమలావళి నదల్చు విమలాంగి మోముతో, నొనఁగూడి సన్మిత్రుఁ డొనరఁబోలు
నమృతసంగత మైన యతివచక్కెరమోవి, నీడయై బింబంబు నెగడఁబోలు
మేలిమిగట్టులో మెలఁతచన్నుల కనుం, గై గోత్రవర్గ మిం పలరఁబోలు

తే. సాటిరాఁబోలు సరులు భుజాలతలకుఁ, జక్రమేల్పడి గాఁబోలు జఘనరమకుఁ
దమ్ములుపదానుజన్ములై తనరఁబోలుఁ, బ్రసవములు గాళ్ళనిసువులై యొసఁగఁబోలు.

చ. బొమవిలు చూపుతూపులును బూనిమృగాంకుని గెల్చియింతిమో
మమృతము మందహాసమున నచ్చపుడాలు కపోలలీల ఘా

అమునఁ గలావిలాస మఖి లంబు గొనం గని వెన్నెఁ జొచ్చె న
య్యమృతగభస్తిభీతతిమి రావళి వేసలి పెంపుసొంపునన్. 70

ఉ. బలితపు గుబ్బగుబ్బలులపై నిరవొంది మెరుంగుడీఁగచే
నలరి హృతాబ్జపూగరుచియై నిరవద్యకలారవామృతం
బులకలిమిం బికాంగనల మాఁకక మాకత సంఘటించు నీ
విలుకలకొల్కికంధర భజింపఁగఁ జెల్లదెకంధరాంకమున్ 71

మ. సముధాభంగము సోజసామజ ముఖో జస్రావ లీలాధిక
క్లమమై నాభిసరోంతరంబున మునుం గం బొంగు నుద్వేలభం
గము లయ్యెన్ వల లంతరాలమునఁ ద ద్గంధానుబంధంబుచే
నమయందు మెచ్చదచాలు నా నొనరె నూఁగా రింతిలేఁ గౌనునన్.

చ. వనితకుచాంద్రులం బోడమి వాటపు బొక్కిలినిండి యుబ్బి జా
ల్గాని కటిచక్రమాని మిఱుఁ గుందొడలై విరవాసి వచ్చు నా
తనకిరణామృతౌఘముల దండహలాంకపదోత్థితంబులై
మను నుడివోనిగర్భకల మంబులు గావె లతాంగిజంఘికల్.

చ. అని వనితాలలామ వినుతాంగతరంగితసౌకుమార్యముల్
గని కొనియాడు సమ్మదము గ్రమ్మ కొనందల యాఁచునప్పు న
వ్వనరుహనూతిచేతియని వారిచాతురి మెచ్చుగాని య
య్యనఘుఁడెరుంగఁడయ్యె మన నాంతరమాంతరవిస్మయంబునన్.

మ. అపు డానర్మసఖుండు చేరఁ జని క న్యారత్నముం జూచి తే
తపనీయాచలధీర వాపలుమతి ధ్యంబోఁ గదా యింక నే
జపివేషంబునఁ జేరఁబోయి లలనా జన్మప్రకారంబు దే
టపడం గాంచెదఁ బంపు మన్న నుసఖుం డప్రేమసామగ్రితోన్. 75

తే. కుంభగతదీపశోభాని గుంభలీలఁ, గుంభకుచమేనఁ జూడ్కి లా గుబ్బికొనఁగ
గాంచుకుభుఁ దంగనాప్రసంగంబుకతన, మంత్రివరు నెట్టకేలకు మఱలి చూచి.

ఉ. ఏగతి యోగిరూపము వహించెదొ యేగతిఁ బ్రౌఢిమించెదో
యేగతి వేలగాంచెదవొ యేకత మున్న వధూజనంబు నీ
వేగతిఁ బల్కరించెదవొ యిష్టసఖా భవదీయనీతికా
ర్యాగతి నేఁడు చూతము గదా యని యంపిన నాక్షణంబునన్.

సీ. కనకవల్లిమతల్లి కల పెంపుజడగుంపు, పుష్పపరాగసం భూతి భూతి
కమనీయశాఖాగ్ర కాండంబు దండంబు, తరుణపల్లవకోటి ధాతుశాటి
వల్కలధట్టంబు వరయోగపట్టంబు, జాలకవిసరంబు జపసరంబు
ఫలరసాసారంబు పాత్రాంబుపూరంబు, కింజల్కములుచాలు మౌంజినూలు

తే. సేయఁజాలినయమ్మహా శిఖరిశిఖర, రుచిరసురభూజరాజి సుచితవేష
మెరసి నరపాల నిరపాయ హితవిహార, హరి గడిదేటి యొక జడదారియయ్యె.

క. ఆమాయతపసి నియమ, స్థేమాయత నక్షసరము, ద్రిప్పుచు నెలమిన్
వామాయతనయనాజన, హైమాయతనంబుఁ జేర నరుగుచు నచటన్. 79

తే. గంధగజయానగీతప్రబంధ కలన, నలరి యతి లియ్యమైవచ్చు నరిది మగువ
లార కనుఁగొంటిరేయను నాళివాక్య, మొకటివిననైననిదవేళ యొదవె ననుచు.

ఉ. మేలు లతాంగి నీపలుకు మెచ్చితి నే యతి వచ్చు జాడయే
లీల నెరింగితమ్మ బహులీకృతచాతురి మించునీవిపం
చీలలితారవామృతము చిత్తము సోఁకినవార లీకలా
శాలినిఁ జూచి దీవెనలొసంగక పోవరు సుమ్ము నావుడున్.

ఉ. అచ్చటనున్న యిందుముఖు లందరు నాపలు కాలకించి తా
నెచ్చటనుండియో యొక యతీంద్రుఁడు వచ్చెఁ గదమ్మ యంచు లో
నచ్చెరుపాటు సంభ్రమము నందుచు గద్దియ డిగ్గి రంతలో
వచ్చెఁ దపోధనుండు జనవల్లభుఁడున్ మది మెచ్చె నెచ్చెలిన్.

చ. ముని యట రాఁ దటాలున సమున్నతపీఠము డిగ్గి నిల్చెనం
గననిరుపేదకౌను కుచగౌరవమోర్వక కంప మొందఁగా
జనపతి మాడ్కి తోడనె ససంభ్రమసంభరితానుకంపమై
యొనసి వలగ్నముం బొదివె నీశులు దీనవగూలు దర్పనుల్. 83

తే. ఇంతియును నంత నంతంత నెదిగి పొదలం, నిబ్బరపు గబ్బిగుబ్బల యుబ్బుకతన
నోరగాఁ బాణికంజంబు లూఁది మ్రొక్కె, మక్కువ సఖీమణులుఁ దాను మానిమణికి.

వ. అప్పు డప్రతిమతపోనిధి యొప్పులకుప్ప యగు నప్పూఁబోఁడి యనల్పవినయకల్ప నంబులకు నుప్పొంగియో యనన్యకన్యా సామాన్య లావణ్య ప్రభావసువల్లభుం బెండ్లియాడుమని దీవించి తదీయ వివిధ పూజావిధానంబులం బ్రమోదమానమాన సుండై యాముద్దియలిడు పసిండిగద్దియ నధివసించె నయ్యెడం దొయ్యలులు నయ్యతి

వనపుష్పసంపదమతమయు విశ్రాసనంబుల నలంకరించి కంద శాకంజ సంయన యామునంగుం
జెలులలో సమంజస వచనచాతురీరంజిత యగు మంజూనాశి యంజలిపట్టి యతికుం
డునితో నిట్లనియె. ౮౫

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కద్భుతంబుగా
వచ్చితి రార్యసన్నుత భ వచ్చరణాబ్జనఖేందుయుక్తిచే
నచ్చుపుఁదెల్వి వచ్చెఁ దను వంతయు విచ్చెఁ గలాకలాపముల్
హెచ్చె మదాళిభాగ్యమిఁక నింద్రపురంధ్రులకైనఁ గల్గునే. ౮౬

మ. అంబురుహాప్తతేజ భవ దంఘ్రులఁ బ్రాలగి గల్గు నుత్తమాం
గంబది యుత్తమాంగము జగన్మహనీయ భవత్కథానిశే
షంబు నుతింపఁగాఁ గలర సిజ్జరసజ్జ భవద్విభావనా
ప్తిం బరిపూర్ణమై జరుగు దిష్టము దిష్టము శిష్టకోటికిన్. ౮౭

క. లలనాలలామ వీణా, కలనాదము మెచ్చి కరుణఁ గమనీయవరా
కలనాదరమున వచ్చిన, యలనాదప్రియుఁడవో మ నాత్మ తెలుపవే. ౮౮

ఉ. ఓయతులప్రభావయుత యోగ్యతిలోకమణీ యనంతర
త్నాయతతేజ తావక శుభాంకముఁ గన్న సువర్ణరేఖలం
బాయనికూర్మిఁ దెల్పి యన పాయము గాఁగ మదీయకర్ణపా
ళీయుగళీపరిష్కరణ లీలఘటింపగదే ముదంబునన్.

చ. అన మునిరాజవల్కమ్ వని తా జనతావినుతాభిధేయుఁడై
యొనరినగౌతమున్ మునికులోత్తముఁ జెప్పఁగ విందువేకదా
యనఘ తదన్వవాయకల శాంబుధిఁబుట్టినవాఁడ గౌతమా
ఖ్య నెసఁగువాఁడ నేఁ బరమ హంసరసప్రతిభాను భావుఁడన్. 90

ఉ. ఓచలమానమీనమిథు నోపమలోల విలోచనాంత కాం
తా వసువాధు నున్నతన గాహితపాదపశాధు వాత్మసం
సేవక శేవధిం దగ భజించి తదీయరహస్యమంత్ర సం
భావనచే ననాదిముని మార్గముఁ గాంచితి నద్భుతంబుగాన్. 91

తే. నాఁటి విను మేనుబిన్నట నాఁటనుండి, యుమ దదంఘ్రి సేవావృత్తి నున్నకతన
నిచ్చె నాకుఁ బ్రసన్నుఁడై యునుఁడతండు, సకలపదముల నాత్మను సరణమహిమ.

సీ. కావున నవ్యాస గతుఁడైనమశ్వ్యామి, తో నమేరుసమేధ మానమంజు
లచ్ఛాయలఁ గరంబ లరుచు నీలగ్రీవ, నిలయాభిరామకీ మలఁ దెలియుచు

మ. కలఁ గుల్లోకమహామహోగ్రమహితఖ్యా జ్ఞాతావళీ నిర్గళ
స్ఫాలబంధోనిధి లక్ష్యహైమనత పక్షక్షోదపక్షోదధి
స్ఖలభీమర్మరభేరికాభయదభాం కారైకసంప్రీణితా
చలవైరిస్తుతకీర్తి సాంద్రుఁడుసు వసుక్ష్మాపాలచంద్రుండేలెన్. 101

శా. స్వారాజ్యంబును బోలె నిద్ధమున కధిష్ఠానం బధిష్ఠాన మై
యా రాజన్యుని కింపుసొంపెసఁగు నిత్యశ్రీలతావాలమై
యారామస్త్ర యమానసూనమకరందాసారశైవాలినీ
ధారాచర్ధితమాధురీగుణలసత్కాంతారకాంతారమై. 102

తే. రత్నభూషితమైన యా రాజధాని, యుపరత నురుతరముక్తాఫలాభి రామ
ధామకం బనఁజాలి సిద్ధంపుఁజవులఁ, బరఁగు శుక్తిమతీనామ భవ్యతటిని.

ఉ. జీవన మెల్ల సత్కవిని షేవిత మాళయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల పట్టు ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫల దేశకముల్ నవకంబు లెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింప శక్యమే.

సీ. అనుకూలఖేలనా య త్తశీవనమైత్రి. నడరి నర్మద బోటి యై భజంప
నూర్మికాకంకణ ద్యుతికలాపము దోఁప, బాహువల్లీదండ బంధవింప
సముచితాకానసంభ్రమసాంద్రయై పాఱ, సారవేత్రవతి హెచ్చరికఁ దెల్ప
గంభీర రసబంధ సంభృతప్రౌఢిమ, తో సరస్వతి పల్కుఁ దోడుగాఁగ

తే. గులములోఁ బెద్దయు నమూల్య గుణమణీప్ర
కాండపరిపూర్ణయును గాన గారవమున
నఖిలనదులును దనుఁగొల్వ ననుదినంబు
నలువకొలువున కేఁగు న న్నది యతీంద్ర.

క. ఆలీల నమ్మహానది, నాళీకజు గొల్చి యొక్క నాఁడు ప్రియాళీ
కేళీసంభ్రమవినుతే మ రాళీగతు లడర మరలి రా నొకనాఁటన్. 106

సీ. సుమనోది వాస భా సురకేశబోన్నతివాఁడు, ఘనసారతిలకవా సనలవాఁడు
ఘనసంకుమదసాంద్రగంధభాగమువాఁడు, నవపద్మరాగదంతములవాఁడు
కలితోపకంఠ న క్షత్రమాలికవాఁడు, హరిచందనచ్ఛాయ నమరువాఁడు
తపనీయ వేఁశిలా ధాళధళ్యమువాఁడు, మణిపాదవలయ భామంబువాఁడు

తే. నర్ఘ్యరత్నావళీ విచిత్రాంబరాభి
రామశృంగారములవాఁడు హైమగర్భ

గేహమున కేగువాఁడు కోలాహలాఖ్యుఁ
డాకధరాధీశుఁ డెమ్మరయ్యె సువిదకపుఁడు. 107

ఉ. అనుపమభాగ్యశాలి యిత డంబుధపాళికిఁ బుత్త్రుఁడై జగ
జ్జనని కనుంగుఁదమ్ముఁడయి శంకరు ముద్దుమఱందికూఁతురై
మమతవభాగధేయమహిమంబున మిన్నులు ముట్టివచ్చుధ
న్యుని వతవిన్ భజించినది యుక్ వినయంబున నోరయైచనన్.

సీ. బాలకూర్మవిలాస పదములుఁ గాంతరం, భాప్రతిబింబోరు భవ్యరుచులుఁ
సరససైకతసార జఘనసౌభాగ్యంబు. నతనాభిరూప వనభ్రమంబు
శైవలాయుతరుపలయొప్పిదమును నాబోఁదఁ, జనుజక్కవలనిక్క చక్కఁదనము
కమలకోమలముఖ కామనీయకమును, త్పలమంజులాలోక విలసనంబు

తే. ఘనఘటాసీలవేణియు గలతరంగి, జీరమణి నిత్యనిర్మలాకారకాంతి
ధార ధారుణ నెసెరినంతనె నగేంద్రుఁ, గాఢతరధైర్యమువ్వెత్తుగా హరించె.

కం. ఆకరణిఁ దరంగిణి నగ, లోకేశ్వరు ధైర్యమెల్ల లోఁగొని రా నీ
రాకరగభీర యోను, శ్లోకుఁడు నాచెలువచెలువు లోఁగొని చనియెన్. 110

మ. అలఘుశ్రీనిధి యానగేంద్రతనయుం డా సైకతశ్రోణియొ
ప్పులు రెప్పార్పక చూచి చన్నుమొదలం బొంగారి పైపై రసం
బులు జృంభించు భ్రమించునాశయము కూర్మిల్ మించదీపించును
త్కలికాచాపలముల్ మనోనిబిడచింతాతన్మయత్వంబునన్ 111

సీ. తనమాటముల ప్రోదిఁ దాల్చు రంభాదులు, సరస భావము దప్పి శిరము వంప
దనలోల తలబెంపుఁ గనుకల కంఠులు, చేరిపై వ్రాలక చెదరి పలుకఁ
దనవంక నలరు పద్మినులెల్లఁ దమిగాన, కయవాడి మోము లగ్గలము ముడువఁ
దనమహాభోగంబు లనెసంగు భోగినుల్, దెరలి నిట్టూరుపుఁ దెరలు నెరప

తే. నకటకటపంచాములపట్టి యతను తాప, వహ్నిపాలయ్యె ఝురబాష్ప వారియగుచు
నిత్యశక్తి మతిధ్యాన నిశ్చలాత్ముఁ, డగుచు నంచితగహనరో మాంచుఁడగుచు.

ఉ. కులగిరిరాజనందనుఁడు కూరిమి నాభువనాభినందితం
దలఁపఁ దలంపు లోపలనె దర్పకకేతన వల్గనంబు లం
చల యొలగోలు నంబుజవి శాల శిలీముఖ తాండవంబులుం
త్పలవళమంద లాగ్రములు పైకొను నెట్టివొ తత్ప్రభావముల్.

తే. మరుని నాళీకసాయకో త్కరము కరము
ఖరముఁ దరమిడి మెఱయు టె యరిది సొరిది
సురిది నవి మెట్లు తెగఁగోయు సురువదీర్ఘ
రంబుల జనింపవో శతారములు గావొ. 114

చ. కపురపుఁగమ్మతావిఁ జలిగ్రమ్మెడు గొజ్జఁగ పువ్వునీట న
చ్చపు నెలజాల వెల్లువలఁ జందనవాసన నేమిటన్ నగా
ధిపు నతితీవ్రతాపశిఖి దీఱక పోయెగతాగతక్రియా
నిపుణ ఘనాళినీ తటటి నీలలితామృతధార దక్కఁగాన్. 115

ఉ. శైల కులేంద్రుడిట్లు మద శాలి శుకాలిపికాలి శారికా
జాలక నీలకంఠరవ సంగతిఁ దాలిమి నిల్పఁజాల కు
ద్వేల కరాలకంతుశర వేదన దీఱ నదీరసోర్మికం
దేలక యేలకల్గు మహా నీయ సుఖంబని నిశ్చితాత్ముఁడై.

క. రుచిరాజిత మణిభూషా, రుచిరాజి వెలుంగ దివ్య రూపోజ్జ్వలుఁడై
యచలాధీశ్వరుఁడొక నా, డచలామణిహారమగు మహానదిఁ జేరెన్. 117

శా. చేరన్ రానదియుం దటోద్గతఝరీ సీమాధికోదగ్ర సం
చార శ్రీ నెదురేఁగి యూర్మి మయహ స్తన్యస్త రాజీవరా
జీరాజన్మణి భాజనంబుల రజ శ్శ్రీగంధికిం జల్కరే
ఖారక్తాక్షతముల్ వహించి వరుసం గావించెఁ బూజావిధుల్.

తే. గిరియును దదంతికోత్తుంగ తరచిరత్న, రత్న తటపీఠిఁ జెందగా రవము వఱల
వరలలిత వాహినీ వైభవంబుఁ గాంచి, కాంచె బహు పద్మనిధిలాభ కౌతుకంబు.

వ. అప్పు డప్పుణ్యతరంగిణి యన్నగాగ్రణితో నిట్లనియె. 120

సీ. అతుల శైవలవతీ శతములేనదు మీకు. నాయిచ్చు విమలార్ఘ్య తోయ మెంత
ప్రాలేయనిలయ సంభవము గాంచిన మీకుఁ, బన్నీట నొసరించు పాద్య మెంత
సరసమందార మంజరుల రంజిలు మీకుఁ, బెనఁచి పూదండ లర్పించు టెంత
గోరత్న దోహన గురులక్ష్మి గలమీకు, నుపద గా మణివర్గ మొసఁగు టెంత

తే. యనఘ యెవ్వారలైనఁ గొంగంతవారి, కవనిఁ గొండంతపూజ నేయంగఁగలరె
భక్తి నేనిచ్చు నీపువ్వు పత్రతోయ, మాత్రములు గైకొనుటెకాక గోత్రతిలక. 121

చ. విలసితరత్నకూటములు వేలుపుఁగిన్నెలకూటముల్ సుధా
కలితసరః కృపీటములు కామిత నూతన లస్తుజాలదో

హాలసురభూజవాటము లోకప్పుడుఁ బాయక కల్గునీవు న
వ్వేల నొక యర్థనీయమను వస్తువుగల్గునె ముజ్జగంబులన్. 122

క. ఏతాదృశగుణగరిమ స, మేతాత్ములం మీర లిచటికి నేతెంచుట యో
శీతాద్రి తనయ మనుపరి, జాతాభినవానురాగ సంపత్తిగదా. 123

చ. అన విని గట్టురాకొమరుఁ డాననగహ్వరరోచమానమా
తనతరదంతహీరరుచి ధారలు వెల్వడ నొక్క లేఁత న
వ్వు నగి నిజంబ పల్కితి వవున్ భువనాశయసన్నివేశ వే
దిన పరసాగ్రగణ్యవు గదే యని యన్నదిఁ బల్కె వెండియున్. 124

మ. పరమామోదముతో నశేషతటి నీ పద్మాస్యలం గూడి నీ
వరవిందోద్భవుఁ గొల్చి యేఁగుతరి నీయచ్ఛాచ్ఛభావంబు నీ
పరసత్వంబును నీగభీరతయు నీసర్వంకషప్రౌఢి నీ
పరిపూర్ణత్వముఁగాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్. 125

శా. ఆ పద్మోద్భవు సోలగంబునకు దివ్యద్వీపినుల్ నిచ్చరా
కో షోరో మరి యెందఱేనియును వారున్ మేము సంధింపమో
యేపద్మానవఁ జూచినం దెలియ నిన్నీక్షించినట్లుండ దే
లా పల్మాటలు పూర్వజన్మకృతముల్ గాఁబోలు నీ నెయ్యముల్. 126

ఉ. నావలనం బ్రియంబు లెటిఁగి నన్నొకమాటును బల్కరింప కీ
వే వెసనోరసేసికొని యేఁగుదుగాని సరిల్లతామ ని
న్నేవగఁ జేరవత్తు మదికింపగు నీదు నవోదితామృతం
బేవగఁ గ్రోలఁగాంతు ననియే నెప్పుడుం దలపోయుచుండుదున్.

తే. విమల మధుర మనోహర వృత్తివెలయు, వారిఁగొనియాడ బుధులెంత దూరమైనఁ
బోవుదురుగాని యేను నీ పొందుఁగోరి, దవ్వనక వచ్చితి నశేష తాపశమని. 128

ఉ. చెప్పెడిదేమి నాకుఁగల జీవన మంతయు నీకకూర్చి యె
ల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియాచరణం బొనరింపనేర్తు నీ
చొప్పున కీవు నియ్యకొని చొక్కపు జక్కవ గుబ్బలాఁడి మేల్
దప్పక యంతరంగమునఁ దాఁచి నన్ను నదీనుఁ జేయవే. 129

క. అన విని నగరాజు ఘన, ధ్వని గరిమకుఁ గలఁగి ముకులితకరాంబుజయై
వినయము నయంబు భయమును, మనమునఁ బెనఁగొనఁగ శుక్తిమతి యిట్లనియెన్.

సీ. నిలువెల్ల నీచాతినీచోపసరణంబు, ప్రకృతియెల్లను జాడ్యపరిణతంబు
పెంపెల్ల నియత గాంభీర్యమాన విహీన, మంతరంబెల్లఁ బంకావిలంబు
జీవనంబెల్ల సంచిత బుద్బుదప్రాయ, ముదయమెల్లను దుర్దినోన్ముఖంబు
గతులెల్లఁ గుటిల ప్రకారకారణము లు,త్సేకంబులెల్ల భంగాకులములు

తే. నిలుకడ హుళిక్కి తావులు పొలసువల్చు, నిట్టిమాబోంట్లతోఁ జెల్మి యెట్లుపొసఁగు
నచలితోత్తుంగ ధైర్యున కలఘుమతికి, ననఘగతికి నభంగశీలునకు నీకు. 131

క. పుడమి నచలేంద్రు లెచ్చట, జడవాహిను లెచట నెచట సఖ్యము విన జో
ప్పడదు పొడవడరు మీయెడ, నెడిపక మారసము లెచట్టి కెక్కు మహాత్మా! 132

ఉ. నా విని గట్టు రేఁడు వదనంబున విన్నఁదనంబు దోఁప నో
శైవలినీశిఖామణి నిజంబు భవత్కమనీయ కాంతి ధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్ళఁ బెట్టెనో
నీవిఁకఁ బ్రుచ్చియెత్తి ఘననిర్వృతిఁ దెప్పలఁదేర్చవోయనన్. 133

చ. వెలువెలఁబాటి శుక్తిమతి వెండియుఁ గొండలరేనిఁ బల్కు న
గ్గల మగుపంచసాయక వికారమునన్ నిజగౌరవోన్నతు
ల్దలఁపవు గాని మాదృశ జడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరికోటిలోఁ గడు లఘుత్వము గాదె తలంచి చూడుమా. 134

మ. మతిఁ గ్రీడారతి గ్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చ తపస్స్ఫూర్తి మెయిం గృశించి నవరాశిం జెందు మాబోంట్ల ను
ద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల నీకు గలవే తారుణ్యలావణ్య జృం
భిత రంభాదినిలింపభామ లన భూభృన్మౌళి రాగాంధుఁడై. 135

సీ. అతనుభూతి ఘటింపఁ దయ్యోనే చదలేఱు, సికఁదాల్చు నింధాన చిత్రసనకుఁ
వరవంశవైఖరి వదలెనే రవిసుతా,పతియైన దైతేయ భంజనునకు
వసులాభ సంపత్తి మసలెనే జాహ్నవిఁ, జేకొన శంతను క్షితిపమౌళికిఁ
గమలోదయఖ్యాతి దనలెనే నానా న,దీకాంతుఁడయిన రత్నాకరునకుఁ

తే. వారికే లాఘవమునచ్చె వనితయెంత, మాఱుమసలెదు వట్టినే మములు చాలుఁ
నేలు నన్నని సతికమ లాలిపట్టు, ప్రబలతరవీర్య భుజశాఖఁ బట్టుటయును. 136

ఉ. వేణి చలింపఁ గంపి తన పీనమృణాలభుజాగ్రకంకణ
శ్రేణి నటింపఁ లోలశఫరీనిబిరీ సకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసక గణక్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్జితాబ్జముఖ శోభితయై కడు సంభ్రమించినన్. 137

మ. నిలువెల్లన్ నిరపాయశంబరసమోన్మేషంబునం బొంగు రా
గలఁగూలంకషగాఢగర్వగ్రంథిలం గాంతానుకూల్యంబుచే
దలమే నిల్పఁగఁ బ్రాతికూల్యపరుషోద్యత్ప్రౌఢిఁ గాకంచు న
య్యలఘుం డాప్యము జేవుఱింత నిజరూపాటోప సంరంభియై. 138

వ. నెట్టన నాగట్టువారపట్టి యెట్టకేలకు మట్టుమీఱిగట్టునం బట్టరాని తమకంబునం దట్టువడి కట్టలుకం గట్టలువడ వేయుకట్టడి మరుని యంపసెలకట్టియల బెట్టువం బుట్టుబెట్టిదపు బొప్పి దొట్టి దట్టంపుఁ నిట్టూర్పు బాగలం నిగుడు సొగసునం దగులం బొగులం దెగలరచ్చల నచ్చటం బెచ్చుపెరుఁగు జాంబూనదాంబుజ కదంబ కాలంబి కాదంబ కాదంబరంబులు వారింపుచు రాకరాకలం బైకొను కోకారిపిక సోకులం బ్రాఁకిన యాకారపాండిమంబు నలువునం జెలువలరు కలువచెలి చలువ వన్నెల నెలకొన్న వెన్నెల వెల్లువల నుల్లోలకల్లోలమాలికా దోలికాకేళికాచతుర చక్రబాలికాజాలంబుల మేలంబులఁ దూలించుచుందమిఁ గొలుపు నగ్గలపువలపునం గల యలపునం బొడముడగు తికఁదడఁబడనుడువు నుడువులవడువున మెఱయు నరయ చంక్రమణ చలదుపలఫలకమిల దలఘుతరఘుమఘుమార్భటి నికటతట విటపి విటపచ్ఛటారటదపార కీర కిన్నరమిథునాదులం జదల మెదలంజేయుచుఁ దన యాహార్యభావగౌరవంబు కల్లోలినీరయ నివారణంబునుం గామోపభోగప్రమయ సముచితవిజనతాకారనంబునుఁ గందర్పబలసంబాధబాధావధీర ణంబునుంగాఁగ మాటిమాటికిం గూటములం బాటింపుమనియబ్బోటి పదంబులం బడినపడుపున వడుసున వ్రాలి యడ్డగించి యలముకొని చెంగల్వతావులం జెదర వేణిఁ దెమలించుచు మకరికలు నులియ గడపాలినొక్కుచు మధురామృతంబులు వడయం బలుతెరసొబగు లానుచు మౌక్తికంబులు జడియం బయోధరస్థలంబులం బట్టుచు విశదాంశు కాంతస్థితి దొరలంగ నతివిపులపులినజఘనారోహంబుల నుత్పలపత్రంబులం నెఱపుచుం దనివిలేక దద్దయు నాగద్దతియమ్మద్దరాలిం బెద్దయుం బ్రొద్దు నిరోధించు సమయంబున.

ఉ. ఓవసుధామహేంద్ర కరుణోదధి యీతడ వేల ప్రోవ రా
వే వసుభూప యంచు నెలఁ గత్తివెసన్ మొఱపెట్టుచాడ్పునన్
శైవలినీరవం బెసఁగె శైవలినీనినదంబుకన్న ము
న్నావిలభూరివారి విహగాగవగౌరవ మెచ్చె నెల్లెడన్.

మ. కలగుండై నెలవేని యిట్లు వరటాకారండవాదిద్విజా
వళి ఘోషించుటకన్న మున్ను గిదిరాడ్వ్యావిద్ధకల్లోలినీ
సలిలోపప్లుతభూజనుల్ నిజనివాసస్థేమసంశూన్యులై
కలకన్ ఘూర్ణిలు ఘోషమెక్కె మొగిదిక్చక్రంబులం గ్రమ్మినన్.

మ. విని యాఱింతు దురంత శైలకుధనావిర్భూతసింధూద్ధత
ధ్వనియో కాక మహోదక ప్రళయ సంత్రాసంబు లోకాళిఁబై
కొని కారించెనొ యీ సుదుస్సహమహా కోలాహలోద్వృత్తి శే
మి నిమిత్తంబని భర్తలోకభరణోన్మేషంబు వాటింపఁగాన్. 142

క. నానాజన పదకటక స్థానాశ్రయు లాక్షణంబ చనుదెంచి వసు
క్ష్మానాథుఁ గాంచి పలికిరి, దీనానూనానులాప దీపితభయులై. 143

సీ. ఇష్టకృత్యము నిర్వహించుఁగాని దినంబు, శుచి మలీమసగతుల్ సూపవెరచు
దాక్షిణ్యము వహించి తనరుఁగాని సదాగతి రజోభరభ్రాంతిఁ దిరుగ వెఱచు
జగతికిఁ దేజంబు సమకూర్చుఁగాని మిత్రుడు చండకరశక్తిఁ బొదర వెరచుఁ
గొలుచు న్యాయమె మాపి నిలుచుఁగాని ధరిత్రి, జీవనదంబు గర్జింప వెఱచు

తే. దేవ తావకకరుణాసుధావిశేష, పోషితాశేష సద్వీప భూతలమున
నేఁటి తుదకీ క్షణంబున నాఁటుకొనిన, పాటు మదిఁ జిత్తగింపవే పార్థివేంద్ర. 144

ఉ. అక్కట మిక్కటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో
యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహముల్
పిక్కటిలంగఁ ద్రెళ్ళునఁ గుభిల్లున శుక్తిమతీస్రవంతి పై
రక్కున వ్రాలి యాఁగె భువనావళి సుద్భటవింధ్యవైఖరిన్. 145

క. గోత్రాజనవిత్రాసద, గోత్రార్భటి కోర్వలేక ఘూర్ణిలి నదియున్
మాత్రాతీత భయభ్రమ, పాత్రాశయ యగుచు ధాత్రిఁ బదపడి యలమెన్. 146

ఉ. ఏమని చెప్పవచ్చు ధరణీశ్వర యాబలు సేఁగి తన్మహా
భూమిధరోదరోద్భమునఁ బొంగున భంగసరిజ్ఝరంబు పై
పై మహి యెల్ల నల్లుకొన బల్విడి వందనుబింబితాభ్రశే
ఖామహిమంబు గాన నగు గ్రక్కున మిన్నులు వడ్డకైవడిన్. 147

సీ. సర్వసర్వంసహా చక్రంబు జడమయ్యె, గ్రామముల్ భంగసంగతము లయ్యె
నాలయవ్రాతంబు లవనశూన్యము లయ్యె, సాలముల్ కాండశేషంబు లయ్యె
వివిధ జంతువితాన విహృతి వారితమయ్యె, వస్తుజాతము లెల్ల వంకలయ్యె
నరలోకమెల్లఁ గంఠగతజీవనమయ్యెఁ, గలమంబు లప్రాప్తఫలము లయ్యె

తే. దోఁట చేను కొటారంబు దొడ్డియనెడుఁ, నాసలన్నియు వికుమంత లయ్యె స్వామి
పాదపద్మంబు లీక్షించు భాగ్యమునికిఁ, దప్పి వచ్చితి మేము గోత్రాతలేంద్ర. 148

మ. అనుచుం జారులు విన్నవించుటయు లోకానీక రక్షాకళా
కనదుత్సాహరసచ్ఛ విస్ఫురణమై కన్దోయిఁ గ్రొత్తెఱ్ఱ దా
ర్కొన నుర్వీజనదైన్య భంజన ఘనభ్రూభంగభంగి విస్ఫూ
ర్తనశక్రధ్వజ ముద్భవిల్ల ఖలగోత్రధ్వంసనోదగ్రుఁడై. 149

క. నరవరుఁ డభయం బొసఁగుచు, హరిరథ నిరసన మనోరథంబున నరిగెం
గరిభరణకరణపరిణత, కరుణాపరిణాహి యగు జగత్పతి లీలన్. 150

సీ. దశనశంబముల దుర్ధరమహీధరకూట, కోటి నుగ్గులు సేయు కుంజరములు
ఖురఘాతసురుధూళి శరధిలీన నగాళి, మట్టు దట్టించు నారట్టజములు
పటుచక్రచంక్రమార్భటిఁ గొండ లవియించు, సమిదభంగశతాంగ శత శతంబు
లెత్తుపడ్డ మహాకుభృత్తుల నతులిత, ధృతిఁ జీరికిఁ గొనని ధీరభటులు
తే. తడయకప్పుడు పతివెంటఁ దవిలినడువ, నమరు బృంహిత హేషిత ఘుమఘుమితభు
జాసమాస్ఫాలితంబుల జడికి నడికి, కుల కుధరమండలము గల గుండువడియె. 151

చ. అంత ననంతవేగభుజగాంతకుఁ డమ్మహి కాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల సురచారణసన్నుతి పర్వ నవ్వనా
భ్యంతరశోధకం బగుమహాద్రి సఖంబున మీఁటె నభ్ర వి
భ్రాంతము గాఁగ దుందుభికబంధము మీఁటినరాముకైవడిన్. 152

క. వసు రా జయ్యెడ బలవ, ద్విస్ఫురపాదప్రసార దీర్ణాచలుఁడై
యొసఁగఁగ వసుధాపరికీ, ర్ణసరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్. 153

శా. మొక్కల్ వోయిన రెక్క మొక్కగమితో మూర్ఛాలసత్వంబుతో
జిక్కుల్ వడ్డ లతాద్రుమావళులతో శీర్ణోపలశ్రేణితో
నక్కోలాహల ముర్వి వ్రాలియును నెయ్యం బొప్పనయ్యేటికే
గ్రుక్కిళ్ మ్రింగుచు నుండె నండనె వసుక్షోణీధవత్రస్తమై. 154

ఉ. పోటనబంతి మీఁటుగతి భూవరుఁ డంఘ్రినఖాంచలంబునన్
మీఁటిన గట్టుబిట్టెగసి మేదిని వ్రాలు ఘనస్వనంబునన్
హాటకశైలకూటకటకాళిఁ బ్రతిధ్వని పర్వినా నభో
వాటి నెసంగె నంత సురవారవధూమురవారవార్భటుల్. 155

క. నా విని పరమాద్భుతకల, నావిని వేశమున మించి నవముని యవధా
నావలిత శ్రోత్రుఁడై చెలి, నావలికథఁ దెలుపు మనియె నధికప్రీతిన్. 156

## అశ్వాసాంతము

శా. వర్ధిష్ణు ప్రతిభాపరాశర శరస్వర్ధేనువాణీసుధా
వార్ధిస్పర్ధి యశోధురంధర ధర ధ్వంసిస్వరుశ్రీమహో
దోర్ధామర్ధి విశేష భాసుర సుర స్తోమస్తుతాజిక్షమా
దుర్ధర్ష ధ్వజినీ సముత్కర కరాధూతేందుభారాధరా. 157

క. లజ్జావతీమనోజ ద, లజ్జాతి సుగంధిగుణ క లానలినీ శ్రే
లజ్జాలపాద సమరమి, లజ్జాంగలఖానహాలహాలత్రిపురహరా. 158

## పంచచామరము

వరాహవావగాతవాహ వాహరాజగర్వశా
ర్వరాహరీశవోర్వ్యటంక వజ్రపీఠలాలితో
ర్వరాహరీశ వైభవాభి రామభూమ భూమహో
వరాహ వారణాధిరాజ వారిరాశిమందరా. 159

## గద్యము

ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందన ప్రసాదసామాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబనుమహాప్రబంధమునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీగురుభ్యోనమః

# వసుచరిత్రము

## తృతీయాశ్వాసము

క. శ్రీక్షితి రక్షాదక్షిణ, శిక్షాదక్షిణ భుజాగ్ర విభవారిపురీ
శిక్షణఘాలేక్షణ శుభ, లక్షణ ధౌరేయ తిరుమల మహారాయా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిల సన్మునీంద్రులకు రౌమహర్షణి యిట్లుపలుకు
మఱియు నమ్మాయతపసితో మంజువాణి, మంజువాణీవిలాస సంపదల ననియె. 2

క. మందారవర్షవర్ధన, బృందారక బృంద దుందుభిధ్వనిగర్జా
సందోహ మపుడు నృపజయ,నందితశక్రోపసర్పణం బెఱిఁగించెన్. 3

సీ. గోత్రవర్గము పాఱఁగొల్చిన నయశాలి, కరమున శతకోటి గలుగు మేటి
కల్యాణమయధామ గరిమ గాంచిన ధన్యుఁ, డహితబలచ్ఛేది యైనజోదు
భూరిసంపద దలఁపువ్వుఁ జేసిన భోగి, వరసుధర్మావాప్తిఁ బరఁగుసుకృతి
సకల భారముఁ బూను సైదోడుగల పెద్ద, విద్యాధరుల నేలు వినుతకీర్తి

తే. వేయికన్నుల వేల్పు భూవిభుని మెచ్చి, యుచితమగు పారితోషికం బొసఁగ వచ్చె
ననలు దర్భాంకుఁ డసురేశుఁ డబ్ధిరాజు, ననిలుఁ డర్థేశుఁ డలిక లోచనుఁడుఁ గొలువ.

తే. వచ్చి యభివాదన మొనర్చు వసునృపాలుఁ, గరములాలించి కన్నులఁ గప్పికొని యు
మందమందార మకరంద మధురవచన, రచనలిరవొందఁ బలికెఁ బురందరుండు. 5

మ. వివిధోర్వీపతులన్ జగన్నుతుల మున్ వీక్షింపమే వారి పెం
పు పరీక్షింపమె నింపమే చెలిమి యే భూపాలునందైన నీ
భువనత్రాణ పరాయణోద్భటభుజా భూరిప్రభావంబు నీ
జవనాత్క్షణబలంబుఁ గంటిమె వసుక్ష్మామండలాఖండలా. 6

చ. పరయనఖాపసారితర సాధర యాదరణీంద్రకోటిలో
నరయుదుఁ బెద్దగాఁ బృథుప రాధిపుఁ గొంత తదీయశక్తి నీ
చరణ నఖాంచలంబునకు సాటియె వేయును నేల మద్భుజాం
తర పవి రేఖ నీయడుగునం బడదే శుభలక్షణాకృతిన్. 7

తే. ప్రభలఖిలగోత్రహృతికి నీ పదనఖంబె, చాలుశతకోటి సాధనం బేల మాకు
నేఁడు గా సౌమనస్యంబు నివ్వటిల్లె, నెల్లసురలకు నీయంత హితుఁడుగలుగ. 8

చ. హితఁనుమనోమనోరథము లెల్లఘటింపఁగఁ జాలు లోకస
న్నుతునకు నీకు నిత్తు నుమ నోరథ మొక్కటి గొమ్మటంచుదై
వతపతి రాజవర్యునకు వాద్యమహార్య మహార్హ్న భూషసం
యుతమణి భాసమానమగు నొక్క విమానము చూపి యిట్లనున్. 9

చ. జలనిధి సార్వభౌమతను జూదను జారల యేఁగుబెండ్లినా
దలఘుఁడు విశ్వకర్మ యుభ వాబ్జభవాదులు మెచ్చఁజేసెఁగౌ
శలమున దీని దీనిపయిఁ జారురమాపరమానుషంగుఁడై
యలరెఁగదా గదాధరుఁ డహస్కరుపై నొఱపైన కైవడిన్. 10

ఉ. శ్రీసతిఁ బ్రేమ మించఁగ వరించి విరించి గురుండు కౌతుకా
వాసములో సురాళి గొలువం గొలువై రవికోటిబింబసం
భాసితమైన యీ శుభ విమానముఁ దప్పక చూచునాదు పే
రాస యెఱింగి సైంధవ గజాదులతో నొసఁగెం బ్రియంబునన్.

క. భూనాయక యీదివ్య వి, మానం బసమానదివ్య మణికలశలా
కానీక నిర్మితం బిది నానాఁటి కనంతకాంచనంబులు గురియున్. 12

సీ. పటుగాత్ర యీ చిత్ర భానూజ్జ్వల మఖర్వ, సర్వలోకాలోక సౌఖ్య మొసఁగు
ధాత్రీశ యీదివ్య ధామోన్నత మనంత, వాహినీ విభవంబు వగలఁ జేయు
నరవరోత్తమ యీఘన ప్రకాశ మభంగ, మణిచాపశర పరంపరలు గురియు
సురమిత్ర యీశ్వర జ్యోతిర్వరాకృతి, శార్వరగర్వ భంజన మొనర్చు

తే. నిది యశేష దోషాంతకం బిది నితాంత, కాంతకల్యాణనిధి యిది కామరూప
రమ్యమిది యమృతాన్న సార ప్రదంబు, దీనిఁ గొనియాడఁ దరమె వాగ్జానికైన

తే. ప్రకటితామోదదివ్యపుష్పకసహస్ర, మాలికాధార మైనయీ మణివిమాన
రాజమున కెట్లు సరివచ్చు రాజసారె, పుణ్యజనభర్తఁ బాసిన పుష్పకంబు.

సీ. మానసీయానంత మణికాంతధామమై, యిది హిమానీవేళ నింపు నింపు
శోణప్రవాళమంజులతానికాంతమై, యలరించునిది వసంతాగమమునఁ
దరళముక్తాదీప్తి ధారాధివాసమై, వేసవి నిది మహోల్లాస మొసగుఁ
బ్రబలవజ్రోపల ప్రాసాదభాసమై, తొలుకరి నిది కుతూహలము నిలుపు
తే. జనవరోత్తమ యిది సర్వసమయసౌఖ్య, జనక మిందలి యాలేఖ్య సాధ్యసిద్ధ
కిన్నరాంగన లవిగీత గీతనృత్య, వాద్యములు చూపి నిలుతురు వలయునెడల. 15

చ. అని దనుజీవిమానము ప్రజాపతిపుడుం బురుషోత్తముండు శం
కరుఁడును దక్క నన్యులకు గా దధిరోహ మొనర్ప వారినుఁ
స్థిరకరుణావిశేషమున జిష్ణుడనై కయికొంటి దీని నే
నరవర సర్వసద్గుణగణంబులుప్రోవగునీ కొసంగితిన్.

మ. నలినీబాంధవతేజ యీశుభవిమానం బెక్కి వేడ్కన్ విని
ర్మలసన్మార్గవిహారహారి వసుచుక్ మావీటికిన్ రాకపో
కలు గావింపు మటంచు నిచ్చిన వసుక్ష్మాజాని యావ్యోమయా
నలలామంబుఁ బరిగ్రహించె భువనానందంబమందంబుగాన్.

వ. ఇట్లు జంభారి కుంభినీపతికి ప్రతిమానవిమానంబు సమర్పించి సుఖంబుండుమని చను
టయు నపరిమితకుతూహలంబున సచిత్రితపనులాన్పపతి కపు డుపరిచర నామ
ధేయం బంకించి సంకీర్తనంబు గావించి రనంతరంబ యనంతవిజయకీర్తి లాభ
సౌభాగ్యధన్యుండగు నారాజన్యుం డనన్యాదృశ ప్రమోదభరంబునఁ బురంబునకు
మరలివచ్చి యఖిల జగజ్జేగీయమాననిమాన మహిమంబునం బ్రతిదివసజాయమానంబు
లగు జాతరూపమణి కలాపంబుల భూదేవ దేవతావర్యులకు సపర్యలు గావించుచు
నిష్టాపూర్తంబులు నిర్వర్తించుచు నొక్కొక్క యెడ నవ్విమానంబు నెక్కి నాక
లోకాదిలోకంబులు నానానగవనానీకంబులు నవద్వయదీపసాగరంబులు నదీనద
ప్రచారంబులు నీక్షించుచు శుక్తిమతీమహానది విహారదీర్ఘికయును గోలాహలంబు
లీలాచలంబునుంగా మెలంగుచుండె నంత నిచ్చట. 18

తే. అఖిలభువననిరోధకాహార్యరాజ, గంధనిర్గంధనునిరాక కలిమి నలమి
కొన్నయలజడి యుడుగఁ బ్రసన్నయైన, యేటికొయ్యావ గర్భంబు దేటపడియె.

సీ. నాళీకముఖికి నెన్నడుము గానఁగ నయ్యెఁ, దనరు నెత్తావుల బిత్తరము దరలె
శఫరాక్షి యున్నత స్థలు లగమ్యము లయ్యె, బడిబడి నడలెల్ల జడను వడిగొనెఁ
జారువేణికి వింత చవుల నింపులు మీరెఁ, గనుపట్టె విశదమై గండరేఖ
కంబుకంఠికి సాంద్ర కంకణంబులు జారె, నాదంబు మందమం దత వహించె

తే. హంసయానకు నలిమేచకాంచలములు, గుబ్బపొందమ్మిమొగ్గలు కొమరుమిగిలె
బ్రకటితావర్తనాభి కేర్పడియె నంత, రుచిరతర శైవలశ్యామ రోమరాజి.

క. ఆపన్నసత్త్వయాపగ, యాపగిదిన్ నీరుమోసి యధిగతసేవా
వ్యాపారద్విజమహిళ, గ్గాపాడఁగ నొక్కపుణ్య లగ్నమునందున్.

చ. గురుతరవర్త్యవేళ నని కుంజము రంజిలుచోట హల్లకో
త్కరకనదుపక్షిధితులు గ్రమ్ముచుచోట నవారవింద బ
ంధురమకరందతైలములు నూల్కొనుచోటఁ బరాగరక్ష చేఁ
గర మరుదైనచోట నది గాంచెఁ గుమారుఁ గుమారికామణిన్.

తే. ఆనదీనందన జనించు ననఘవేళ, నిందుతారాప్రసాదంబు లెన్నఁదర మె
తారకాభర్తనుముఖతఁ దాల్చెఁదార, కలు శుభాంఘ్రులు నఖరవైఖరి వహించె. 23

ఉ. అయ్యెడ శీతశైలతన యాగ్రణియున్ ముద మంది నెయ్యపుం
దొయ్యలియందుఁ గల్గిన తనూభవసంపద పేర్మిఁ బావనం
బయ్యె మదన్వయంబు కృతినైతినటంచు వసుక్షితీంద్రుచే
వియ్యాలు వడ్డ నెవ్వగల వంబుఁ దలంపకయుండె నెమ్మదిన్. 24

మ. అమితానంద రసద్విజారవముచె న్నారం గుమారోదయ
ప్రమదారంభ విజృంభమాణ యగుచుం బద్మాస్యశైలావరో
ధము వారించితనుజ్ఞ ధరించె వను పాదంబంచు నూహించి నె
య్యము దైవారనొనర్చెఁ దద్వనుపదాఖ్యానంబుతో ల్బాలికిన్.

క. గిరిరాజతనయకై వడి, సిరి రాజాల వెలయు నీసు సీల యనుచు నా
గిరికన్య కచటీమానులు, గిరికాశుభనామమిడి ర కిల్బిష ఘణితిన్. 26

చ. జలకము లార్చి పొందుజల జచ్ఛదపాళికఁగప్పి తమ్మిసం
కులఁ దెలిదేనె లుగ్గులిడి క్రొందరగల్ గదలించుకల్వలో
త్పలలఁ గుమారుఁ గూతుఁను ఘటించి భజించు నదీలలామకో
మలనమదాగ తాళికల మంజారనంబున జోలవాడుచున్. 27

సీ. మందయానము నేర్పు నిందింది రాజీవ, రాజీవ రాజన్మ రాళరాజి
కలికిపల్కులు నేర్పు లలిత నానావాస, నావాసనికట కాననశుకాళి
గానబుపాటలు నేర్పుఁ గుముదరసామోద, సామోద మధుపపు ధ్వాంతసమితి
నటనలీలలు నేర్పుఁ దటరూఢకల్పాగ, కల్పాగచరనీల కంఠవితతి

తే. యన్నదీకన్య కఖిల భాగ్యములుం గలుగ
మునిపురంధ్రీ జనంబు దీవన లొసంగు
నతివ సైరంధ్రు లై దారు లై వయస్య
లై విపిన దేవతలు ప్రోతు రనుదినంబు. 28

మ. వెలదుల్ దానును గూడ రత్నపికతాన్వేషంబు గావించుచుం
జెలి బాల్యంబున నిక్కువల్ గనకయుం జేసాఁచి యాత్మప్రసూ
పులి నోర్విన్ మణు లెందు నేని గొని రా బోటుల్ భళీ తల్లినిన్
గెలిపించెన్ సిరికల్మి నంచు నగుచుం గ్రీడింతు రబ్బాలతోన్. 29

చ. గురుసవిధ ప్రదేశమునఁ గోమలకల్పక పుష్పధూళిచే
ధరసుత బొమ్మరిల్ నిలిపి తన్మృదుపల్లవ పాత్రపంక్తిఁ గే
సరములుం ఖాద్యముల్ మధుర సంబు ఘృతంబు ప్రసూనపుం జమో
గిర మని పెట్ట నన్నియు సఖీతతి కట్టివయాఁ బ్రియంబునన్. 30

ఉ. పంకజపాణి శంకపరిభావక కంధరఁ దల్లి యేలొకో
పంకము గట్టె నంచుఁ గుల శైల సుతాగ్రణి పాయ ద్రోచి ర
త్నాంకితహార ముంప బరువానునొ బిడ్డకి వేల కర్కశా
లంకృతు లంచు హల్లక కలాపము లుంచు నదీలలామయున్.

మ. అనుఁబంక్రీడల నెల్లవారలకు ని ట్లల్లారుముద్దైన కూ
తునకున్ వాహిని వాణిఁ దాల్చు సుకవిస్తోమంబు రప్పించి త
ద్ఘన విద్యామహిమల్ కరామలకముల్ గావించె నాత్మీయసూ
తన పద్మప్రచయుం బశేషమును దత్ప్రాప్తంబు గావించుచున్.

ఉ. అన్నగశేఖరుండును మహామణికూట సమర్పణంబుచేఁ
గిన్నరకోటులన్ నిలిపి గేయవిశారదఁ జేసెఁ గూతునుం
గిన్నరమీటు వీణఁ బలికింపఁగ గీతములుం బ్రబంధముల్
వన్నియఁ బాడఁ జెప్ప నని వారితచాతురి గల్గునట్లుగాన్.

శా. వీణావాదవవేళలన్ ఘుమఘుమా విర్భూతి నింపన్ జగ
త్ప్రాణా చంచల తైలశూన్యనవ దీప శ్రేణికా పాదియై
రాణింపన్ ముఖలక్ష్మికిన్ ముకురమై రంజిల్ల లేబట్టికిన్
మాణిక్యాయతనం బొనర్చె గిరి యాత్మశ్రీప్రభావంబునన్. 34

ఉ. ఆనగజాత యీతరుణి యౌవనదేవత లీవయస్యలా
మానవనాథపాదనఖ మర్దితభూధర మానగోత్తముం
బీనగమాళిపై నెసఁగు నీమణిధామము లీకొలంకు లీ
కోనలు నీ నికుంజములు కుంజరయాన విహారరంగముల్.

క. అని వనిత యుపరిచరవసు, జననాయకుకథయుఁ గన్య జననాగతియున్
వినయంబున వినిపింపగ, విని యమ్ముని సమ్మదాబ్ధి వీచికఁ దేలెన్ 36

మ. లతికాసంవృతగాత్రుఁడై నిజకథాలాపంబు లాలించు భూ
పతి యచ్చోహితు నేర్పు బోటివచన ప్రాగల్భ్యముం గన్యయు
న్నతగోత్రోద్భవ వైభవంబును మఱి న్వర్ణించి యూహించె ధ
న్యత నా శుక్తిమతీఝరీజనితర త్నం బాత్మవిత్తంబుగాన్. 37

శా. మాయామానినియు వంతఁ గొంతదడ వాత్మధ్యాన విజ్ఞానము
ద్రాయత్తంబున నున్న యట్లలరి కాంతారత్నముం బల్కె లే
మా యేమాంతరదృష్టిఁ జూచితిమి భామా భావిభాగ్యోదయం
బీయబ్జాననఁ బెండ్లియాడు వసురాజేంద్రుండు వాలాయమున్.

తే. రమణి యిట్టి కాంతాలోక రత్నమమరఁ, జేసినవిధాత వసువుతోఁ జేర్ప డేని
యాతని నిసర్గమధుర సర్గానుభావ, మఖిలభువనప్రసాధనం బగుట యెట్లు

చ. నెలఁతలలోఁ ద్రిలోకనుత నిర్మలరూపకలావధన్య యీ
కులగిరిరాజకన్య నృపకోటులలో వసురాజు మేటి య
య్యలఘుఁడు నీలతాంగియు లతాంతముఁ దావియుఁ బోలియేకమై
వెలయఁగఁ గన్నులారఁ గను వేడుక వేగమ మాకుఁ గల్గెడున్.

వ. అనిన నమ్మందయాన సందియంబున నిట్లనియె.

ఉ. ఇన్నగరాజుఁ జూడ వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవ జొంపముల కోనకు నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచు గాంచి తా
నెన్నఁడు గారవించు జెలు లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్.

చ. అని జవరాలు వెండియుఁ బ్రియమ్మున నమ్మునిఁ జూచి యోతపో
ధనమణి యీలతాంగి వసుధావరు నెన్నఁడు చెట్ట పట్టునో
యని యనురక్తి పెంపుమెయి నాడితిఁ గాక శుభప్రసంగమం
గనకొ నొకంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు నావుడున్.

మ. లలనా యీమెలనాఁగఁ బెండ్లియగువా లాయంబుఁ జేదిక్షమా
తలనాథుం డిది నమ్మవేని నిజముం దత్ప్రౌఢి రిప్పింతు నా
నలనా సత్యసమానుఁ జూడు మని పంతం బొప్పమాయాజపా
కలనాదంభము పూని మాని దిశ లాకర్ణించి మూర్ఛా యనన్.

మ. ఇది పంధింపఁగ వేళయంచు వసురా జేంద్రుండు నీరంధ్రధనీ
రదవారప్రతిసీర వెల్వడినతా రాభర్తలీలన్ లతా
చ్ఛదసంఘాడికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతి వందిమాగధకథా మాధుర్యముం దెల్పఁగన్. 45

సీ. తలిరు బ్రాయమువాని వలరాజు నలరాజు, నలరాజుఁ దెగడుసో యగమువానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు జగడంబుగలమోవి సొగసువానిఁ
దళుకుఁజెక్కులవానిఁ దులకింపుపలుకెంపు, పలుకెంపులొలయు నవ్వొలుకువాని
జికిలిచూపులవాని సిరిమించునొరయించు, దొరయించుకాంచనాంబరమువాని

తే. నొఱపుగలవాని మకుటకేయూరహార, కటకకుండల చాకచక్యములవాని
నమ్మహీజానిఁగని లేచి యమితవినయ, సంభ్రమముదోఁప నిలిచి రబ్జాతముఖులు.

మ. క్షితిపాలోత్తముఁ డంత సంతసమునం జేరంగ నేతెంచి చిం
తితకల్యాణసమృద్ధిగ స్తనుచు సన్మిత్రుండు దీవింపఁగాఁ
గుతుకస్మేరముఖారవిందుఁ డయి కోర్కుల్ మీఱ నాకేజనా
ర్పిత జాంబూనదపీఠిఁ బొల్చె జలజప్రేంఖన్మరాళంబునన్. 47

చ. అనుపమకాంతివైభవసమన్వితు నావసురాజుఁ గాంచుప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగ కందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్ విలసిల్లెనల్లన
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁ జూపుతమ్మెదల్. 48

చ. తొలుదొలుతన్ విలోలగతిఁ దొంగలిరెప్పల నాని కర్ణకుం
డలరుచిధాళధళ్యముల డాపున నల్లన పొంచి మించునై
వెలువడెపూర్ణచంద్రు పయి వెన్నెలపుల్గులచాలు వ్రాలులీ
లల విభుమీఁద వ్రాలె నవలా నవలాలిత దృష్టిజాలముల్.

క. వసుధాసుధాంశుఁ బొదువుచు, వెస మరలుచు మరలి మగుడ వెడలుచు లలనా
లపమాన దృష్టిజాతము, లసమాంబకచిత్రశరము లై విలసిల్లెన్. 50

చ. వనజదళాయతాక్షి నిడు వాలికచూపని మేమవృత్తి నా
ఘనునవకంబుపై బొలసి కాంతతపేక్షణజాలకంబు పై
కొనిన ద్రపాద్ధిఁ గ్రుంకియును గోరికఁ గ్రమ్మఱఁ గూడబాలు మో
హనగుణశక్తి నిష్పటిలు నవ్వలరాయని నేర్పుపెంపునన్. 51

తే. కౌతుకము పూని యొండొరుల గాంచఁదివురు, చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు
గూర్చె వలరాజయొజ్జ కోర్కులు దలిర్ప, నదిగదా భావిశోభన వ్యంజకంబు.

సీ. కనుగలవింటఁ జోకృపుఁజవుల్ పుట్టించి, నారిచే విభ్రమోన్నతులు పెనఁచి
తమ్మితూఁపున రసోదగ్రత నవరించి, కంకేళిఁ బ్రబలరాగంబు నించి
యొలమావిఁ గేలంటి యొలమిమీఱఁగఁ జేసి, విరవాది సూక్ష్మాభివృద్ధి నెఱపి
కలువచేఁ దమి పెంపు వెలయించి చిగురాకు, మొనల నాసలపాటు మొనయఁ జేసి

తే. యసము శరవీరపుంగవుఁ డాత్మసాధ, నముల నన్నింటి చేఁ జూపి కమిచిపోటు
గంటిమాటిన రీతి వాల్గంటి మనము, నవనిపతి చిత్తమును దూరె నాక్షణమున.

క. ఆరాజవదన హృదయము, లారాజవరేణ్యుతలఁపు నారసి మృదుగం
భీర తర వచనరచనా, పారీణత మంజువాణి పలికెం బ్రేమన్. 54

సీ. నేఁడుగా మా కనిందితపర్వసౌఖ్యగ్రి, మ నవరించె నీరాక కువలయేశ
నేడుగా మాతెమో నివహంబు నగఁజె నీ, యాలోకమహిమలో కైకమిత్ర
నేడుఁగా మాకు వన్నియఁ గూర్చె సభిమతా, ర్థములు నీ సన్నిధి రాజరాజ
నేఁడుగా మాకు మానిత సౌమనస్యంబు, లొసఁగె నీపాదాప్తి వసుధరేంద్ర

తే. సురభిచరితుని నిన్ను నిచ్చోభజింపఁ
గాఁ గలిగెఁగాన సఫలతా కలితరైవె
లసె మదీయ కాంతారాగ లక్ష్మియింకఁ
దరమె మానాతి చిరభాగ్యగరిమఁ బొగడ. 55

చ. అనయము నీమహోవనము నంటినవారము గాని సజ్జనా
వనగుణధుర్య యేము కద వారము గాము సుమయ్యా నీ విమా
తఃవిజయాంక గేయములఁ దావకచాటుకథాసుధారసం
బున నలరింతు మీభువన మోహినిఁ బిన్నటనాఁటనుండియున్.

మ. అనఘామూల్యమణి ప్రరోహముల నీకర్పించు నేది వ్యాహా
హిని గౌరీపతికిన్ హిమాచలమున న్బేగట్టునీకున్ విహా
రనగంబై తగు నట్టి ఘక్తిమతియుం బ్రాలేయశైలేంద్రనం
దనుఁడుం గాంచిన కన్యఁగా నధిప యీ తన్వంగి నెన్నందగున్.

సీ. అడుగుపెట్టదు నవ్యహరిచందనలతాంత, సరణిపైఁ గాని యీ యరుణచరణ
కేల నంటదు కోరకితపారిజాతప, ల్లరిఁ గాని యీ యతిలలితబాహ
తనువుఁ జేర్పదు నవోదారమందారము, జాలశయ్యఁ గాని యీ సురభిళాంగి
పెదవిఁ జేర్పదు కల్పపృథివీజఫల సంత, తియె కాని యీ మోవి తీపులాఁడి

తే. సురకులక్రమాయాత మీ గిరిజవల్లి, దనము జననైకరూప మీ తటిని పట్టి
సరసగంభీరభావంబు సహజసిద్ధ, మీ నలినసోదరీ మణి మేనిజాతి. 58

మ. పద మెత్తం గలహంసలీల యధర స్పందంబు సేయన్ శుభా
స్పద మా రాగకదంబకంబు శ్రుతి చూపన్ శ్రీవిలాసంబు కే
ల్గదలింపన్ సుకుమారపల్లవనవై లాలక్ష్మి వీక్షింప ష
ట్పదియుం బోల్చదరంబె కన్నె గొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్.

క. శ్రీనిధి భవదభినివస, న్మానస యీ సింధుతనయ మహనీయగుణ
శ్రీనుతికి నెక్కు నేఁడీ, మానిదయామంద రాగ మహిమము కలిమిన్.

చ. అన జనభర్త పల్కు మది తా విదితాతనుమంత్రజాలు ని
మ్మనిఁ గొనియాడ శక్యమె సముజ్జ్వలరూపకలాప యైన మీ
యనుగువయస్యఁ గాంచు సుకృతాతిశయం బవలీలఁ గూర్చె నీ
యనఘుఁడితండు మాకుఁ బర మాప్తుఁడు గాక మునీంద్రమాత్రుఁడే

వ. మఱియు నితని మంత్రప్రభావంబున భవదృశదివ్యభామినీమృదుమధురకోమలాలాపంబు లాలింపం గలిగెనని మనుజపతిబహూకరించుటయు నమ్మౌని సస్మితమ్మునఁ గొమ్మ నెమ్మొముఁ జూచి తమ్మికంటి యనంతత్రిభువననిర్మాణచాతురీధురీణుం డగు పితామహుండే తాదృశయోగ్యవస్తుయోజనంబునం బ్రోగడువడసి యపారపరీవాదపారావారభంగంబుల మునుంగడుసుమీ అదియునుం గాక తదీయఘటనావైభవాభంగరంగ ప్రసంగంబునకుం బూర్వరంగంబు రసోత్తరంగం బగుట యెఱింగితివిగదా! యింక సందియంబు వలదని నీడ్కొని, యవ్వసుంధరాధరునకు నవ్వరారోహకు నమూల్యకల్యాణ కౌతుకసమృద్ధియుం గావలయునని దీవించి వారలవినయ సంవిధానంబుల నానంద మొందుచు మణిమందిరంబు వెడలి చని యనతిదూరంబునం దోరంబు లగు మందారతరువారంబుల యీ అంబులలో సారం బగు తపోధనాకారంబు డించి యథాపూర్వ వేషంబుతో రాజు నన్వేషించు క్రమంబునం గ్రమ్మఱ నేతెంచి యమ్మహీమండలాఖండలుం గాంచి యద్భుతంబు నటించి పరిసరంబున నిల్చినవసరంబున. 62

తే. పడఁతు లారాజసచివుని పలుకుబడియు
మోముచాయయుఁ గని తొంటి మునియె కాఁడె
సరసి మందాక్ష మంద మందాక్ష లగుచు
నగుచు భావించి రతనివారై ప్రణయములు. 63

క. కోలాహల శైలాధిప, లీలాగతుఁడైన పతి యళీక యతీంద్రుఁడౌ
నీలాలకావలోకక, శాలోలత ననిపె నని తలంచిరి ముదితల్. 64

చ. అపు డొకబాల మేలమున నల్లనఁ బల్కుచు నింతులార యీ
నృపమణిరాకఁ చే నలరి యీగిరికానన మిప్పు డెంత చొ
క్కపుసిరిఁ దాల్చెఁ జూడుఁ డనఁ గన్నియ మోమెదఁ జేర్చి సిగ్గురా
గపుఁదమియొంబెనంగఁ బ్రియుఁ గాంచెఁగుచాంచలహారధారలోన్.

చ. అలికులవేణి కీలెఱిగి యాచెలి వెండియు నేకతంబునం
బొలఁతుకలార యీచిగురుఁ బోఁడికిఁ చార్పితహారనాయకో
జ్జ్వలరుచి గంటిరే యనిన జంద్రముఖుల్ చిఱునవ్వుఁబూని రా
లలనఁలఁ జూచి కిన్కయుఁ గలంకయుఁ గొంకును నంకురింపఁగన్.

చ. సొలసి తటిల్లతాంగి జిగి సూపు వెలుంగులచేఁ గలధ్వను
ల్గలుకలకంఠులన్ గదిమి గాటపు నెమ్మినటింప హంసకం
బులు జడియం బయోధరరస మున్నతి భంగురమధ్యపుష్కరాం
చల మరదోఁపగా నరిగెఁ జారుఘనప్రతిసీరచెంతకున్.

క. పరమాణుమధ్య యీగతిఁ, దెరమాటున కరుగఁ దనివి దీరని చూడ్కిం
బరమాను రాగసూచన, పరమానసుఁ డగుచు ధరణిపాలకుఁ డంతన్. 68

సీ. మెఱుఁగొప్పు నెఱిగొప్పు నెఱగప్పుతఱిఁగప్పు, జలదమాలిక చొప్పు దెలుపలేదొ
బలువాలుగల నేలు తెలువాలుఁగను డాలు, కలువపూఁ దెరమేలు దెలుపలేదొ
బలువైన కలలీనఁ గలలేనగవుసోన, కలశాబ్ధి తెరమేన నిలుపలేదొ
కనకంపు ననసొంపు కడనుంపు రుచిపెంపు పసిడితీగలగుంపు మెసగలేదొ

తే. ప్రాణసఖులార నెయ్యంపు టలుకఁబూని, యేల యీబాల యీవేళ నీవిశాల
యవనికాభ్యంతరంబున కరిగెననఁగ, ననుగు నెచ్చెలి మఱియు నెయ్యమునఁ జేరి.

తే. అభినవాలోకనోత్కంఠ నధిపుఁ డలర, నలరుఁబోఁడి సమగ్రలజ్జానుభావ
భావయై తెరమాటునఁ బగటు చూపఁ, జూపఱకుఁ దోఁచెఁ బరిణయసూత్రియనుఁడు.

చ. విని కల కాకుఘోష మొదవింపుమదాళిని బిత్త గౌరవం
బెనయ నదల్చి మంజుగతి నీవనజాతములో మదీయ ఖే
లనముల కెల్లఁదోడయి మెలంగఁగ నాకలహంసి రాదొకో
జననివయస్య యంచు నగజాత మదిం దలపోయుచున్నెడన్. 71

ఉ. ఆకలహంసివచ్చి యచలాత్మజఁ గాంచి కుమారి తాపసా
నీకము నీకిమూల్యశుభ నిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహానూనరాజము లనూనమనూక్తులతో నొసంగినం
గైకొని తల్లి నిన్ బిలువఁగాఁ బనిచెన్ విరులిచ్చు వేడుకన్. 72

క. రా రమ్మనఁ గోమలి కుచ, భారమ్మున నడుము వడఁకఁ బదకటకరుణ
త్కారమ్ము లెసఁగఁ గుసుమా, సారమ్ములు కబరిఁదొరఁగ జనఁదివురుటయున్. 73

చ. నెవరునఁ జేయిపట్టి తరుణీ ధరణీసరణీ పురందయం
దనుపక పోవుటెట్లు తగవా నగ వాఁడఁ బెట్టనంచు జ
వ్వనిఁ జెలులెల్ల నిల్పి మహీవల్లభ మాచెలిమీఁది ప్రేమ నీ
మనమునఁ బాయకుండు మని మానినిఁ దోడ్కొనిపోవునంతటన్. 74

మ. శతపత్త్రేక్షణ వెంటనంటిన వసుక్ష్మాపాలకాలోకముం
బ్రతిరోధింపఁగ జాలదయ్యె భవనప్రాంతోరు కాంతారవే
ల్లితవల్లీవలయంబు తచ్చిసురపాళీ నీరదాళీ మిళ
న్నృత్తకేళీ రసకేకిలోకగరుదున్మీలన్మరుల్లోలమై. 75

చ. వనతరువల్లికాకుసుమ వాసన లొల్లక శైలకన్యకా
ఘనఘనవేణికాభరము కమ్మనితావికిఁ జిక్కి మ్రోయుచున్
వెనుచనియెన్ ద్విరేఫములు వేమఱు భావి వియోగచింతచే
వనరుచు వెంటఁ బోవుమహీవల్లభు మావులప్రోవులో యనన్. 76

గీ. అళిహస్తావలంబనం బదర నడచు, కన్యఁ దదధీనవృత్తియై కాంచునట్టి
వసుపతి నిరంతరాలోక వైభవంబు, సాగనీదయ్యె గన్నీటి జడి గడంగి 77

చ. కలికియు నానృపాలకునిఁ గ్రమ్మఱఁ జూచుచు నేఁగు నేర్పుతో
నలఘుపదాంగద ధ్వనికి నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చుగతిఁ జిల్కుకుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము దెమల్చురీతి నళిపంక్తికి మోము మలంచు కైవడిన్. 78

ఉ. అనగరాజభేదియును నానఁగరాని మనోరథంబుతో
మానిని నాత్మనిల్పి ధృతి మాని నిరంతర బాష్పవారిఁ గ

నోసల నాని మానికపుఁ గోనలలో నెలమావికానలన్
వానవిల్తుఁ డేఁప నలినా వన యేఁగినజాడ నేఁగుచున్ 79

సీ. కాంబోలు నివి బాలకమనీయపదలీల, లిచటఁ బల్లవజాల మినుమడించెఁ
గాంబోలు నివి బోటి గనుగొన్న వనవాటి, నిచట భృంగీకోటి రుచులు నెఱసెఁ
గాంబోలు నీవంకఁ గలికి పల్కిన పొంక, మిచటఁ దేనియ వంక లింక కొదవెఁ
గాంబోలు నీచాయఁ గాంతనవ్వినచాయ, నిచట నూనవికాయ మింపు మెఱసెఁ
తే. జూచితె వయస్య యనుచు నశోకతిలక, కర్ణికార నమేరు సంఘాతలతల
నలరు నారామ సరణిలో నరసి యరసి, సరసిజాననఁ గానక సంభ్రమించి, 80

చ. కలికలం గేఁజిగుళ్ళ నవకంపుట నంటులం గవ్వరంపుఁది
ప్పలం ననగుత్తులన్ లతలఁ బద్మములన్ సముదాళిజాలముల్
వెలయు మనోజరాజభుజ వీర్య మవార్య మొనర్చు కానలోఁ
గలయఁ జరించు భూపతికిఁ గన్నియ రూపమె తోఁచు నెల్లెడన్.

సీ. కనుగొంటి లతకూన పనిడాయఁ గాకున్న, నభినవ తరలతా వాప్తి దెలుపుఁ
గంటిఁ బద్మినిని గమకించు గాకున్నఁ, బరితాపగరిమఁ దా మరలఁ జూచుఁ
జూచితిఁ గొమ్మ నంచు నటించుఁ గాకున్నఁ దలయు శాఖోపశాఖానురక్తిఁ
దమిఁ జూడ గంటినా తనరంభ ననియేచుఁ, గాకున్న గదలిచెం గటభ్రమించు
తే. నయ్యెడ ననంగ శరశరవ్యాంతరంగ, కలిత భావతరంగముల్ గప్పికొనఁగ
విభుడు చెలిమోల నాత్మీయ విభ్రమములు, దేటపడకుండ నేర్పున మాటుపఱుచు.

శా. ఆరామామణి మీఁది ప్రేమమునఁ నిట్లారామ సీమాసరో
వారంబుల్ దిలకించి యందు నతి దుర్వారంబులై మీఱుళ్ళం
గారావంబులచే ననంగరుజ పొంగారం గురంగాక్షిశృం
గారా గారముఁ జేరి తాల్మి నిలుపం గారాక గారామునన్. 83

మ. అవనీనాథుఁడు పల్కె జూచితె వయస్యా యీ మణీధామమా
ధవళాక్షీమణి యేఁగ శూన్యగతియై తద్రూపచిత్రాహితో
త్సవమే తన్మృదుగాన గుంభితరసార్ద్రింబై తదీయాంగరా
గవరామోదము పూని మామకమనః కంజాతముం బోలెడిన్. 84

సీ. శుచివృత్తి నెన్నాళ్ళు పచరించెనో తీర్థసంవాస మిచటి హంసవ్రజంబు
సురసాలములనెన్ని వరఫలంబులఁ జెంది, నిలిచెనో యిచటి రాచిలుకచాలు
సుమనోనురక్తి నెట్టిమహోత్సవంబుల, నందెనో యిచటి మత్తాళిసమితి
యడవ నెంత తపంబు తుదిమీఱ నోఁచెనో, యిచటి గంధాంధ బర్హిణగణంబు

తే. లతివ వెనువెంటఁ దిరుగ నబ్జాక్షి ముద్దు, మోవి చవిగొన సతిమోము తావిఁ గొనఁగ
గన్య ఘనకంకణ నినాద గర్జన లతఁ, గాంచెనని యుస్సురను మహీకాంతుఁ డపుడు

ఉ. మించిన వేడ్కతో నచట మీనవిలోచన మున్ను వీణ వా
యించినచోటు బోటు లలయింపఁగ మాటున నున్నచోటు న
య్యంచితగాత్రి యేఁగెఁ జెలులాగిన చోటును గాంచి రాగముల్
గాంచుఁ దమోమయావృతులు గాంచు భజించుఁ జలాచలత్వముల్.

చ. జనపతి యిట్లు పంచశరశాతశరాహతిఁ జంచలింపఁగాఁ
గని హితమంత్రివర్యుఁ డు మహీకాంత నిరంతర చింతనింత విం
తసెగులు పూననేల లలనా నలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ
న్గొనిన లతాంగి యీలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే. 87

చ. అతివ గురుండు తారక పదానతుఁ డంగనఁ గన్నతల్లి య
ద్భుత భవదీయశౌర్యరసపోషిత జీవన కొమ్మ నెచ్చెలుల్
సతతము నీకథల్ వొగడ జాణలు బాలభవద్విలాసమో
హితహిత కార్యసంగతికి ని య్యెడ సందియ మంద నేటికిన్.

క. బాలా పాణిగ్రహశుభ, వేలానిర్ణీతి కిపుడ విచ్చేయుము భూ
పాలావతంస యన విని, శైలారి యలీకధైర్య చాతుర్యమునన్. 89

మ. అగకూటాగ్రము డిగ్గి సంభ్రమ సముగ్రాధోరణానీత గం
ధగజోత్తంసము నెక్కి చూడ్కి కెలమిం దత్కుంభహస్తద్యుతు
ల్నగజాచారుకుచోరు వైఖరులు తెల్పం బుట్టు ఘర్మంబు నే
ర్పుగఁ దత్కర్ణవిశీర్ణచామరమరుత్పోతంబులం దీర్చుచున్.

మ. అవనీభర్త వినూతనాతను పతాకాలోకసంప్రేక్షణీ
యవిలాసంబు గజాధిరాజగమనోదారంబుఁ గాశ్మీర ప
త్రవిచిత్రంబు దటిద్విభాసిరుచి యా తద్వాహినీజాతవై
భవమున్ లోవెలిఁ గాంచుచుంజని యొ సంపత్పేటికా పీఠికిన్.

తే. నగరిపుసమానుఁ డీరీతి నగరి కరిగి, సింధురము డిగ్గి గాంధార సింధు కురుర
కాశముఖ్యుల ననిపి ప్రకాశవృత్తి, శాంత మగు నాత్మకేళీ నిశాంత మొందె.

చ. అతివలు ద్రిప్పి నారతుల యట్లు మనంబు భ్రమింపఁ గుంభినీ
పతి జలకంబువేళ యని భామలు దెల్పఁగఁ బల్లెరంబు వె
ట్టితి మని తొయ్యలుల్ బడిబడిన్ నడతేర ననాస్థతో యథో
చితవిధు లాచరించి పువుసెజ్జకు నొయ్యన మేను దార్చుచున్.

సీ. గిరికన్య మేన నేకీభవించినఁగాని, తియ్యవిల్తుని నిగ్రహింపరాదు
సింధుజ నెదనుంచి సిరులమించిన గాని, మహికాంతుఁగను సన్న మెలపరాదు
శుభవాణి యభిముఖ స్ఫురణఁ జూపినగాని, పలుమాటంచులఁ గ్రిందు పఱుపరాదు
పద్మినిఁ గరముఖ ప్రౌఢిఁ దేల్చినగాని, రేలచుమ్మరము వారింపరాదు

తే. నేర్పున నటించు నృపతి యా నెలతఁ దలఁచి, తలచి సగమగు సాత్త్వికోదయదశాను
భావములఁ జెందు నున్మద ప్రసవబాణ బాణమగ్నతఁ గాంచుఁ దాపము వహించు.

మ. అనిశధ్యాతనదీసుతావయవుఁడై యమ్మేటి యయ్యేటి శో
భనముక్తావళు లన్న నన్న దినవాజ్జం బన్న గోరంతనం
టును నొక్కింత ముఖానురాగమును బూనుం గానియే సొమ్ముఁగై
కొనఁడే కానుకలిచ్చినం గొనఁడు గోర్కుల్ నిండి దైవాఱఁగాన్.

తే. కన్యలావణ్యరససుధాగాహనమున, విభుని నయనము లస్వప్నవృత్తిఁ జెంద
మనసు తదురోజహేమాద్రిమునికి మరగి, మహితసురతానుభూతికై మలయుచుండు.

సీ. శ్రమము నొందింపఁడో జగదద్భుతాఖండ, కాండప్రయోగ లాఘవముఁ దెలిపి
సాత్త్వికగుణసార సామగ్రి సవరింపఁ, డో సుమనోధర్మ మొనరఁ దాల్చి
సంకల్పసిద్ధి యొసంగఁడో తగువేళ, నమితప్రతాపసాహాయ్యమొంది
నవ్యసాహిత్యచింత వహింపఁ జేయఁడో, నవరసభావ వైభవముఁ జూపి

తే. యతనుఁ డతనికి సహృదయుఁడై యమేయ, శక్తి నేమేమి గావింపఁ జాలఁడయ్యెఁ
బతియు నితరప్రసంగ సంభావనమున, దవులక దదేక పరవశుఁ డవుట యరుదె.

క. సుమనోమార్గణవశుఁడై, క్షమ యెల్లను దద్గతంబుఁ గావించిన భూ
రమణుని సాంగ యశోజాలము లీలం బాండిమం బలరె నెమ్మేనన్. 98

సీ. పెనుగట్టు కోటమీటిన మేటి కిపు డెంత, యరుదయ్యెఁ గన్యాకుచాద్రిగరిమ
గగన ఘంటాపథ భ్రమణశీలున కెంత, గగనమయ్యె లతాంగి కౌను చదలు
బలువెల్లి కెల యెల్ల నిలిపిన ఘను నెంత, నుడివెట్టె సతిదృంగ శుస్రవంతి
యనుదినవ్యయితనవ్యసువర్ణరాశి నెం, తాసఁ గొల్పె వధూవిభానువర్ణ

తే. మనుచు విస్మితహృదయుఁడై కనికరించి, యవనిపతి కాంతరంగికుఁడగు ననంగుఁ
డనుపమోజ్జ్వలగాత్రి నయ్యచలరాజ, పుత్త్రి తద్ధీనమానసాంబుజ నొనర్చె. 99

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనద్రేలన్ నేలవ్రాయించి ని
శ్చలవృత్తిన్ వరవర్ణపూర్ణఫలకాసంగంబు నొందించి మి

న్కాలు వేమఱుం దదర్థచింతనలతో నాల్కాల్పి నెయ్యంపుటో
జులు పైపై నెనయింపసాగెఁ బటుశాస్త్రశ్రేణికాభ్యాసమున్. 100

శా. అత్యంగి యనంగ ఝూంకరణ సజ్జ్యాముక్త చూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ములంచు దటినీ గర్భైక సంజాత కం
జాతవ్రాతము మాటు జెంద నవి యేచన్ సాగె మున్మున్నుగా
‘జ్ఞాతిచ్ఛేదనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యంబుగన్. 101

ఉ. ఎఱుపుగఁ జూడసాఁగె హరిణేక్షణ పిన్నటనాటనుండి యుం
బరిచితిఁ బూని మంజుగతి మాధురియున్ మృదువాగ్విభూతియున్
వరుసనె తెల్పి తక్కడ వారును దండ్రిభజింపువారు నై
గరిమముఁ గన్న సద్ద్విజ శిఖామణులన్ వసులుబ్ధ చిత్తయై. 102

తే. ఆ శిలావార్యనందన యలస పవనఁ, జాలములఁ దూలగతిఁ జాలఁ దూలఁదొడఁగె
గరిమ దానెంత యచలేంద్ర కన్యయైన, బలుచనగు గాదె ఘనవసు ప్రార్థనమున. 103

చ. చెలి తెలిరెప్ప ముత్తియపుఁ జిప్పల నొప్పగు బాష్పవారి చి
ప్పిలి చనుగట్టుపై దొరఁగు పెంపు నుతింపఁగ నయ్యె నయ్యెడన్
వెలఁది మనోగతం బరసి వెల్వడి శుక్తిమతీస్రవంతి యా
యలికులవేణిఁ గాంచిన మహాద్రికిఁ దెల్పఁగ నేగుకై వడిన్. 104

చ. కొమిరె మనోవ్యథం బొగుల గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి తల్లి శు
క్తిమతి తదీయ తాపశిఖి కీలల నింకఁగఁబోలుఁ గాని చో
రమణి మెయిం బిసాంకురపరంపరలున్ ఘనసారవాలుకా
సముదయమున్ సుజాత జలజాత దలంబులు మల్లనిల్లుచే. 105

చ ప్రసవశరాఖ్యయోగి బహుభంగుల భావన లిచ్చి మర్దనం
బెసఁగఁగ ధాతువేర్చి బలియించి రసంబు నితాంత మంతయు
న్వసువుగఁ జేయ నైమరచి నాతిగలన్మతి భూమ తెన్న దా
త్తసఖులు చేరి పల్కినను బల్కదు చూచియుఁ జూడ దెంతయున్. 106

ఉ. కొంచక యంబుధిం బడిన కొండలపత్త్రు లూడ్చదయ్యె నా
అంచల కత్తిదాని యెదుటంతయు నెంతని కంతుచేతి నా
అంచల కత్తి హత్తి జవరాలి కుచాద్రుల ముంచెఁ బత్త్రరే
ఖాంచిత వైభవం బెడల నాతత బాష్ప మహాపయోనిధిన్. 107

క. కంజనయనా విలోకన, ఖంజనయుగ మెదవు బ్రాఁ గని వను చాలా
రంజిలుటఁ జెలిసి శంబర, భంజనుఁ డతినిశితవిశిఖ పంక్తి నగల్చెన్. 108

తే. పూఁటపూఁట శరత్కోటి పాడము కలిన, విన్ననై యున్నదికన్య వేణిదూల
సన్నగిలియున్న గతినెన్నఁ జనునె యకట, యూర్మికలంకలంకణాకృతినోవ రెనపుడు.

సీ. మదినున్న మరుఁడు వంశమహోగ్రగతివచ్చు, కమ్మఁ దెమ్మరలనఁ గదినె నూర్పు
లూర్పుగాడ్పుల రాక కులికి పాండుమృణాల, కుండలిపై బూనె కుచసురాద్రి
కుచ సురాద్రి గరంగె ఘోరతాపార్చినా,బడసెఁ బుష్పాడితోడి వలపుఁ జెమట
చెమట వెల్లువను ఫేనములయ్యెఁ జెనుఁగాక, నవసి నీరుగఁ బొంగుహారమణులు

తే. హారమణి హారశారాపసారమునుఁ గ్రొరమూర్చాంధకారవిస్తారమును న
సారమై రేయుఁ బగలు నేర్పులుపకునికి, మగువ కనుఁ దమ్ములర మోడ్పులువ వయ్యె

సీ. వరగుణజాల సంవనన సామగ్రితోఁ బాశంబు లాశలఁ బాదుకొల్పి
చటుల తాపానలజ్వాలికల్ నెఱపి జీవనమంతయుఁ గలంచి వనచరాళి
నిస్వనంబులు రేఁచి నిగురుకాతర నేత్ర, శంబరంబులు వాడు శరభగండ
కములు దూలెడు చిత్రకాయలీలలు సోయ,గములు కీడ్కొను భద్రగతులుజడియు

తే. నాతల స్తబ్ధరోమంబు లలసి వ్రాలు, ఘనసితాపాంగములు గాఁగ గాండవృష్టి
పఱపి వేఁటాడఁదొడఁగె శంబరవిరోధి, కాంతయా వనరేఖలోఁ గలయ మెలఁగి

చ. అలికులవేణి యిట్లు వలయాంక బిసాంకుర పన్నగాళికిం
జలమరి చల్లగాలికిని జక్కరఖాణపుఁ దేజిఁ దోలుపూ
విలుతు వయాళికిం జిగుగ వెందుల నీలిగయాళికిన్ హాలా
హాల గుళికాభదుర్మదఘనాళికి నాళికి లోఁగి యాత్మలోన్. 112

ఉ. అమ్మక చెల్ల ధైర్యనిభవాతిశయంబునఁ దండి పెంపు లే
కమ్మను గానవైతి జడ జన్మమునన్ జనయిత్రిఁ బోలిపైఁ
గ్రమ్మసిదాఘతాపహతిఁ గ్రాఁగుచుఁ జిక్కితి లోతు దక్కె ని
క్కమ్ముగఁ దండ్రిచాయ గల కన్యలు ధన్యలుగా వసుంధరన్. 113

మ. నయిదో దయిన సువృత్తిపొందు రమణీజాలంబు ముమ్మున్నగా
భయకృత్పల్లవసూచికాస్థితిఁ దపఃప్రారూఢిఁ బేర్చై నృపా
న్వయచూడామణి పేరురంబెనసె నేనట్లయ్యెఁ బ్రాపింపలే
నయితిం చాదృశవైభవం బకట భాగ్యా యత్తముల్ గా సిరుల్.

ఉ. తల్లియుఁ దండ్రియున్ బహువిధంబులఁ గామితముల్ ఘటింపఁగా
నుల్లము చల్లనై శిశుల నొందు సుపర్వనరాహిరాట్పురీ
హల్లకపాణులం దొకతెనై జనియింపక యొద్ద నొంచునే
న్వల్లికి పాతికిం బోదని వేఁడెడి నైతిఁ దలంపులేటికిన్. 115

సీ. సోయగంబున వీణ వాయింప మాకుంపు, జటిలుఁ డచ్చటికి నే మిటికి వచ్చె
వచ్చెఁ గాకేమి యవ్వసుమహీపాలుఁ డా, కామసంభవుని నే లా తలంచె
దలఁచుఁ గాకేమి మిథ్యాజపప్రౌఢి నా, పృథివీశు నేల రప్పించి చూపెఁ
జూపుఁ గాకేమి మాయాపారికాంక్షి ద, ర్శితవసుభ్రాంతిఁ జెందితి నిదేల

తే. తల్లికొట్టిల్ల మెన్నఁడు దలఁగుఁ దండ్రి, హృదయమెన్నటికిఁ గరఁగు నీవియోగ
నీరనిధి నెట్లు గడతు శృంగారవనికి, సరుగ నన్నియుఁ జక్కనౌ నచట ననుచు.

క. సకియుఁ గనుమొఱఁగి మధుకర, చికురనిజారామవాటిఁ జేరి ప్రసూనాం
బకధాటీశుకఘోటీ, నికరాటీకనము మనము నివ్వెఱపఱుపన్.

సీ. పవమానమానవ ప్లవమానకైరవ, చ్యవమానరజము మై నంటదివురుఁ
గరసారగతామరసాతిసాంద్రదసీ. ధురసాప్తిఁ గన్నీరు దుడువఁ గోరు
మదనావళిప్రభా పదనామ్రకోమల, చ్ఛదనార్చిపై జూపు జరపఁ జూచు
పలయామాతలతాకి సఖయాగి మలయాగి, నిలయానిలువకూర్పు నిలుపఁ దలఁచుఁ

తే. గుంజపుటగుంజ దళిపుంజ శింజితంబు, వెగ్గలంబైన కెవియొగ్గి వినగడంగు
బంచశరభూత పరిభూత పంచభూత, ములఁ దవీయస్థలంబులఁ గలుపుకరణి.

క. ఈరీతి బొవల మెదలుచు, నారీతిలకంబు మేని నచ్చిక యిచ్చం
గోరక నవసహకారక, కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్. 119

ఉ. అత్తఱిఁ జిత్తరిణ్ మణిగృహంబునఁ గానక బోటికత్తియల్
తత్తఱమంది హా గిరిసుతామణి యెచ్చటికేఁగి తేకదం
ద్రొత్తియటంచుఁ గేళివనకుంజము లారయ వచ్చి యచ్చటం
జిత్తజభల్లభగ్న యగు చెల్వఁ గనుంగొని సంభ్రమంబునన్. 120

చ. కటకట మన్మథోక్కటత్రుటి కాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ చెలి యిచ్చటికిన్ శ్రీకపుఁదేనె వాఁకలీ
వెటువలె నీదితమ్మ తెరు వెల్లను బుష్పాడి నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ తను జీ తగునమ్మ కడింది చెయ్దముల్.

ఉ. ఇచ్చ హితాహితంబుగణి యింపనిగోలవు గానగానకుఁ
వచ్చితిగా కయో పక్షికవర్గము నొంటి చరింపనిచ్చునే
యిచ్చటియన్యపుష్పచయ మిచ్చటి మత్తమధువ్రతవ్రజం
బిచ్చటిపల్లవోత్కరము లిచ్చటి పాంసులపంకజావళుల్. 122

సీ. ఫలభంగములు సేయు చిలుకకు సాంగమై, క్రోధరసంబు ముక్కుననె యుండు
గాలభేదికి మహాకాలమూర్తికి దంట, కోయిల కెఱమంట గుఱియు గంట
మదమరాళికి సదంభస్థితి యుడివోదు ముఖరాగమును గళంబున విసంబు
నలరుఁ గొమ్మల తావు లార్చియాసవపూర్తి, నెసలించు నళికి మేనెల్ల మలిన

తే. మట్టియుట యేలవచ్చితి యధరబింబ
మితలిరుఁగేలు నీభుజా మృదుమృణాళి
కలును నీపుష్పకోమలాంగములుపూని
గట్టు దొరపట్టివగుటెల్లఁ గంటిమబల. 123

మ. సురవిద్వేషికి విప్రయోగి హరణ క్రూరుండు మారుండు దాఁ
బరమాప్తుండు తదీయభృత్యులు దలంపం గాంచనస్తేయ త
త్పరగంధానిలముల్ మహామధుపముల్ తన్మైత్రిఁ గాంచెంబిక
స్వరముం బంచమశబ్దమిందుకు సుదృగ్జాలంబు రాఁ జెల్లునే.

చ. అని చెలులెల్ల దూఱి ధవళాంబుజభాజినరాజి నావటిం
చినకుసుమాన్నరాశిపయిఁ జక్కని చెందొవజోతి నిల్పి యా
వ్వనితను జుట్టురా బడిసి వైచి సగంధపలాశవాటిఁ బా
యని యశరీరిబంటులకు నామితఁ జేసి రనేకభంగులన్.

క. ఆవేళ మంజువాణి య, న్నావిలగతిఁ జేరి దుష్పహామిళిందపుళిం
దావలి కావలి కరువలి, యావలి కావలితహృదయ యగుసతిబలికెన్.

తే. కలికి యలికీరమండలి కలికిచూడ, నేల యీవేళఁ బలుక నీ వేల గోల
నీ కటాక్షోర్మి వాక్సుధానీకమునకు, జాలిఁ బడిగాదె యివి యీవు జాలిఁబడియె.

సీ. సకలాగమాంతవాసనలు గాంచి, విముక్తకాంచనం బగు మానుకరకులంబు
పరిత్యమున దృఢావాప్తి సంయమములై, శౌరిఁ జేరక్కను శుకసంతతులును
గన్నపెంచినవారి గలయక మాధవాన్వితసూక్తి మనువన ప్రియచయంబు
పద్మాసనాభ్యాస పారవశ్యమున బ్ర, హ్మర్ధిఃగతులైన హంసతతులు

తే. పుష్పఫల పత్రజలమాత్ర ముల శరీర, యాత్ర గడపుచు సన్మార్గ మధిగమించి
యొసఁగునివియెల్ల నీకేల యెగ్గొసఁగ్గు, వనిత యావంత వలవదమ్మ. 128

ఉ. పారసకైరవంబులకుఁ జంద్రదినేంద్ర విరోధ మంచకుం
బారము చేనిమందగతి భారము దెమ్మెరకున్ ఫణిగ్రహా
క్రూరవిఘాత మంగజాస కుం గడతేరని భీమవీక్షణాం
గారకవైర మింత తలఁ కంబనిలేమ మనోజ్ఞఘాటికిన్. 129

ఉ. నమ్మిక మీఱ నెత్తు వద నమ్మిక నెమ్మదికోర్కి నెమ్మితో
నిమ్మని యేము నీదయకు నిమ్మని కమ్మని వింటిజోదుపా
దమ్ములు మెట్ట కెంపువిరి దమ్ములు చేర్చి భజింతు మమ్మరో
రమ్మని బోటి కోమలిక రమ్మనివార్యగతిం దెమల్పగన్. 130

క. సోలుచుఁ జెలికెదురాడక, తూలుచుఁ గైదండయొసఁగు దొయ్యలి మేనన్
వ్రాలుచుఁ జింతాజలనిధిఁ, దేలుచుఁ గైసేయుసఖులఁ దెగడుచు గంటన్.

సీ. నిబిడదుస్సహదీర్ఘ నిశ్వాసపవనంబు, పఱచు తేటుల బరాబరులు సేయ
నుజ్జ్వలావయవతాప జ్వాలికలవేడి, చివురు జొంపములపై నవఘళింప
లలితాననేందుమండలపాండురచ్ఛాయ, వనరుహావళి వళావళి యడంప
శ్రమజలాభివ్యక్త సహజసాంకవ ముదా, మోదంబు చిలుకల మూలకొత్త
తే. నెసఁగు భసలములను గిసలములను నీర, జాతములను గీర జాతములను
విగ్రహింపఁ నీని విరహంబె తోడుగా, వెలఁది వెడలె విపిన వీథులకును.

క. లలనామణు లపు డుపవన, తలనానానూనసంప దలు కలకంఠీ
కలనాదకుఁ దెలిపిరి త, త్కలనాదంభమునఁ బ్రొద్దుఁగడపుద మనుచున్.

సీ. కనకగంధము తెఱుం గనివాని కిష్టాప్తి, కాయహీనునకును గరణపటిమ
పెక్కుకాలపుమూఁగ కెక్కుడు వాక్ప్రౌఢి, యతిచంచలాత్ముని కలఘువృత్తి
యిలఁ బుట్టుగుడ్డకు హితదర్శన ప్రీతి, యగమకోటికిఁ బల్లవాభివృద్ధి
జడజాతమునకు శాశ్వతబోధసామగ్రి, కోపనావళికి భావోపశమము
తే. నెరపునిరుపమమాధవ నిత్యసన్ని, ధానమున బొల్చు భవదీయ తాతపాద
సన్నిహిత సద్గుణారామ సరణి యిదె ల, తాంగి గనుఁగొను మిచటి సోభాతిశయము.

చ. పరిమిళితప్రవాళనవ పట్టపటధ్వజచూతనూతన
స్మరరథరాజమున్ భ్రమర జాలగుణాంచిత శింసుచక్రము

గ్గెరల మహోబలంబు దర లింప లతావనిశాళి రువ్వఁ దే
మరువపుబంతులందు శుకమండలి యాడెడిఁ గంటె పైపయిన్.

చ. మరునకుఁ జైత్రమంత్రి వన మండలరాజ్యపదైకకాంచనో
త్కరము కరంబు బొసంగ టంకముఁ దాపులఁ బచ్చలుం జేసి తచ్ఛదా
వరణముఁ బాయవిప్పి సరసంబుగ నెన్నిక కెక్కఁ జేయుచున్
దొరయఁగ నీవు గంటె చెలి ధూర్తవతంసమలీమసాళులన్.

చ. రతిపతిధర్మకర్త ఋతురాజబలావళి నొంచి యోఁగుదు
ర్మతుల మథించి కైకొనిన మానధనంబుల ముద్రవెట్టుచోఁ
బ్రతినవదీపికాశిఖిఁ గరంగెడు లక్కయుఁబోలె వంజుల
స్థితమయి తేటి వెగ్గలపుఁ దేనియ గ్రాయుట గంటివే చెలీ.

ఉ. తుమ్మెద త్రిమ్మరీఁడు పయి దోఁచు పిశంగిమ పద్మినీనికాం
కమ్మది తాఁ బరాగపటిఁ గప్పి మధువ్రతిఁ జేరఁబోవుచున్
నమ్మిక కంగజప్రహరణమ్ముల ముట్టెడుఁ జూడవమ్మ ప
ల్గొమ్మల జెందువారలు తసుబ్బిరియాటలు నేరకుందురే. 138

చ. అనిలకుమారకుండు మరుదధ్వనిన్ ధిపలాశిమండలీ
ఘనవనరాశిలోఁ బుడమి కానుపు పద్మిని చిక్కఁ బ్రుక్కఁగా
నినకరముద్రఁ జూపి వెలయించి తదంబుజరాగపాళిఁ గై
కొనుచుఁ బ్రవాలతేజమునఁ గూరిచె గంటె పలాశవీథులన్.

శా. అంచల్లీల హరించెఁ గొంచక యయుక్తాఘుక్షమాభోగముల్
పంచాస్త్రుండని యాసలెత్తగని పై పైఁ గాంచనస్నానమా
డించెన్ మాధవుఁడీ సదాగతిని గంటే కన్నెపున్నాగ మె
క్కించెం గోకిలకాహళుల్ మొఱయ నేఁగించెన్ వనీవీథులన్.

తే. కానఁగడుమానియై పెద్దకాలముండి, వాక్యసంసిద్ధి మాధవు వలనఁ గన్న
మత్తకోకిలకవివాక్సమాజమెల్ల, బంచమశ్రుతి వింటివే చంచలాక్షి. 141

మ. నునుఁగ్రంపుటనంటిపిస్సపార యజ్ఞోకెక్కి మాధ్వీమహో
వనధిం బుప్పొడిదీవికిన్ మధుకరవ్యాహారులే తేరఁద
ద్ఘనకర్పూరపటంబు లందుకొని వేడ్కం గోరకవ్యూహమో
హనముక్తావళిఁ దార్చె నీతరగుగా ద్వబ్జాక్షి వీక్షించితే.

మ. అలినీలాలక కంటె చిల్కఁ ధవదీయాలాప లీలాప్తినిం
పలరం గోరి విపక్వదాడిమ తరువ్యాలంబి శాఖాఫల

జ్వలనాహాజ్యశిఖమై తపంబు సవరింపన్ సాఁగ నేలబ్బెడిం
దలక్రిందైన ననూనవాగ్గ్రహణ మేధాశక్తి బింబాళికిన్. 143

మ. అసితాబ్జేక్షణ చూడు కేతకి శివ త్యాగాపవాదంబు దీ
ర్పసముద్ధూళితధూళికాభసితయై బద్ధాళి రుద్రాక్షయై
యసిపత్రాసికఁ బూని నిల్చుటయు న య్యష్టాత్మ త్రైలోక్యజీ
వ సముజ్జీవికయైన మూర్తిదరియన్ వచ్చెన్ సదాక్షిణ్యతన్. 144

తే. కన్నె మరునకుఁ బూఁదూపు లెన్ని లేవు, కన్నె గేదంగివిరి కెన గావు గాక
సూనబాణాభియాతికి దీనిగాలి, సోకినను గాదు తలయేలు సోఁక నెపుడు.

చ. కన బదమూన బాడఁబలు కన్ మొగమెత్తుకొనన్ మదింపఁజే
య నలను జల్లనూర్చ నగ నంటను జాలవు గాక కాకచే
ఘనకుచ పుష్పలీవె తిలకంబు నశోకముఁ బ్రేంకణంబు గో
గును గనకంబుఁ గేసరముఁ గ్రోవియు వావిలి పొన్నమావియున్.

సీ. కలికి నీచేపట్టు కలది మాకందంబు, సతినీవు గనునది సరసతిలక
మబల నీయెదఁ జేరు నది తావిగ్రోవి తో, య్యాలి నీవు పదముంచునది యశోక
మతివ నీయిరవొందు నది దను జొగడ బి, త్తరి నీవు నగునది దా నమేరు
వమలాంగి నీదు రాగము గన్నది ప్రియాళు, వగజ నీవెదిరించు నది సువర్ణ

తే. మింతినీచేఁ గృతాశ్వాస మింద్ర సురస, మళికచభవన్మృదూక్తి క ర్ణాభరణముఁ
గాంచునది కర్ణికారంబు గాన గాన, నెరవుసేయక చెలి వీని విరులు గొనుము.

క. అని వనితలు జవ్వని క, వ్వని విభవము దెల్పి కమ్మ వలపులు గొనుగా
డ్పెనయమికి ఘణుబఁ బెనఁచిన, యనువున జడలదరఁ గుసుమ హారణోత్సుకలై

వృషభగతి రగడ

బాల బాలరసాల మిది పిక పాలిపాలిటియమరసాలము
గేలిఁ గేలిడి గ్రుచ్చఁగదు రా గిల్లు గిల్లుము త్రత్పవాలము
కొమ్మ కొమ్మగదల్చి నన గై కొనక కొనకది యేలనిక్కెదు
రమ్మురమ్మన మోపఁ గురువక రాజి రాజిలు నెంతపొక్కెదు
నాతి నాతిచిరప్రసూతన నంటి నంట కదల్ప నేటికి
నీతి నీతిలకంబు వలపులు నించు నించుక చూచుబోటికి
నోమి యోమితమధ్యనీపద ముంచు ముంచు నశోకవాసన

శేమ శేషశయనములు నీకవ లీల లీలల వీఁకలోఁ జన
రాము రామన కొనరఁగూల్చు స రాలు రాలుతు వనలు వైళమ
భామ భామహనీయ మగు నీ పాట పాటవమునఁ బ్రియాళమ
నింతునింతుల కంటఁ బుప్పొడి నెరసు నెరసులు పల్కు నింతయుఁ
గాంత కాంతము భానురాగము కనక కనకము పూయ దెంతయుఁ
గ్రొవ్వి క్రొవ్విరి పొంగ్గ మరుబరి గోలగోల యుదేల దాఁటితి
నవ్వ నవ్వనవాటిఁ బొన్నలు ననుచు ననుచు నెరుంగఁజాటితి
ముదిత ముదిత మనోబ్జయె తెలి మొల్ల మొల్లము మెచ్చెమాటికి
మదిరమది రహిఁబూని వకుళము మన్న మన్నన మధుపకోటికి
జెలువ చెలువపుఁదావియూరుపు సింధు సింధుర మింపుమీఱఁగ
వలదు వలదురు మధుమఘుమ్రతే వాసవాసంతికలు దూఱఁగ
వనిత వనితరులతలయలరుల వాడి వాడితి కొప్పుఁబ్రేఁగున
మనము మనమునఁగోరి చెలులకు మాటమాటలు వచ్చుఁగోఁగున
వెలయ వెలయని చూపెదవు కురు వేరువేఱుగఁబల్కుఁ దగుదువె
యలసి యలసిరిగంద మదరెదు నాడనాడ భుజంగివగుదువె
వాని వాసి తెమల్తురా విర వాది వాది వాదిడవత్తురింతులు
గాసిగా సిర మంటె నలపక కప్పుకప్పుర మేల యంతులు
లతిక లతికమనీయకరకిస లయము లయమున నాడె నిత్తతి
నతను నతనుయశోభరం బన నలరు నలరులుచూడ బిత్తరి
తావి తావిది గంధవహకం దళము దళముగ వీచు నెప్పుడు
కావ కావలిజాజులిపుడని ఘనము ఘనములు మించునప్పుడు
మూల మూలల మల్లెలెంతటి మోహమో హరిణాక్షి దాఁచితి
యేల యేలకిపొదలు వెదకెద వింత వింతలె యొందుఁజూచితి
గోర గోరఁట నించితివొ కలి గొట్టు గొట్టుగఁ గోయఁబోసగవు
నారి నారికడంపుఁబాలెలు నాకు నాకులవృత్తి నొసగవు
కలయ కలయకలంకకేతకి కళిక కళికచపలఁజె బిత్తమె
యళికి యళికివడంకె నీయిభ యాన యానన విల్తుగొల్తమె. 149

చ. అనివవకేళిసల్పి లలి తాంగులతాంత లతాంతకోటిలోఁ
వనపవనానుషంగమున వాసనవోవనివానిఁ దేనియల్
దొనకనివాని బుప్పొడులు దూలనివాని మదాళిమాలికల్.
చెనకనివాని భావభవు సేవకు సేర్పన సేర్పరించుచున్. 150

తోడవు జటువెట్టి వలిప పావడలుగట్టి
శృంగములు వట్టినీరాడఁ జేరునపుడు.

మ. కరిముల మూఁపు లూదుకొని కన్నెలు చన్నులబంటినొండొరుల్
బరిగొని నిల్వఁ దత్పరిధి ప్రాంశుపృదగంబు కలానపూరితాం
తరమయి పాల్చె భావభవ దైవతభావిత హేమకుంభసం
భరితమృణాళమంజలిత పద్మమయుష్టపమండలంబనన్.

చ. సెలతలు బంతిగట్టుకొని నీరెగఁజల్లఁ దదీయమంజులాం
జలికలతోదకం బెగయు జాడనుతింపగ నయ్యెఁ దత్కుచాం
చలజఘనాభిఘాతములు సైఁపక క్రోయుచుఁ బద్మయుక్తమై
కొలను సరోజబాంధవున కున్ మొఱవెట్టగ నేఁగుకైవడిన్.

చ. చిగురుంజిమ్మనఁ గ్రోవిలోఁ గొకతె రా జీవాసవం బుంచి పై
నిగిడింపన్ గమకింప నొక్కనవలా నెమ్మోము వే ద్రిప్పిన
న్జగజంపై వెదిగింపు గప్పుకొనియె న్దత్క్షిప్త మాధ్వీరసం
బు గొనం బంచినచంచరీకపృతనా పుంజంబు చందంబునన్. 159

ఉ. కొందఱు మందగామినుల కోమలపాణితలంబు లొక్క యిం
దిందిర నీలవేణి తెలి నెమ్మొగ మంబుల ముంచు నొప్పు నె
న్నందగుఁ దావుబల్మి వలి నమ్ములు దొమ్ములుగూడి కమ్మి పూ
ర్ణేందుని మున్ను గొన్నరుచు లిమ్మని నీటికిఁ దార్చుకైవడిన్.

ఉ. బంగరుకొమ్ము పూని యొక ప్రౌఢ రయంబున నీరుచల్ల ము
గ్ధాంగన యోర్తు వక్త్రకిర ణాప్తి గరంగెడుచంద్రకాంతపున్
శృంగము పూని దాని గెలిచెన్ వెస నక్షయకాండలబ్ధను
ప్పొంగరె రాజరత్నపరిపూర్ణ బలంబున నెట్టివారలున్. 160

ఉ. హాసవిలాసచంద్రికల కబ్జిని మోము ముడుంచు దీని కు
ల్యాభసిరిమావలేపముగ దా యని యోర్తు దళప్రకాండముల్
గాసిలఁజేసి కైకొనియె గర్ణికఁ దత్కమలాధివాస సిం
హాసనమున్ హరించి నిజహస్తగతంబుగ జేయుచాడ్పునన్.

శా. ఓలంబాలక యోల యోల యనుచో లోలంచు మేలంబునన్
గోలంబాలిక యోర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూఁటాడి కెం
గేలం బట్టి తటాలునన్ నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారలయశశ్శ్రీ దెచ్చుచందంబునన్.

సీ. కేలఁ దమ్మిఁ ఘటించి పాలమున్నీటిలోఁ, బొడమిన జవరాలిఁ బోలె నొకతె
యమలమృణాళనాళాక్షసూత్రముఁ బాణి, గీలించి యజురాణిఁ బోలె నొకతె
వెలిదమ్మిరేకు వేనలి నంట లేసెల, పువ్వుఁ దాల్చుభీవాని బోలె నొకతె
కలువపుప్పొడి రాల్చి కాయజాస్త్రముల తు, ప్పాలందుల్చు రతిదేవిఁ బోలె నొకతె

తే. సారకాసార సాగర జనితజలజ, కుండమాధ్వీసుధాధారఁ గ్రోలదివురు
ప్రబలరోలంబమాలికా రాహుఁబఱపి, దంభనారాయణి యనంగ దనరె నొకతె.

ఉ. ఆటకొలంకునం గరఁగి యంబుజగంధులగంధసారముల్
గాటుకయుక్ హరిద్రయును గానఁగనయ్యె నితాంతధన్య ల
జ్జోటులు మున్గువేళఁ బరిశుద్ధసితాసిత నిర్ఘరంబు ల
న్నీటఁ బిశంగవర్ణతటి నీమణితోఁ దలచూపెనో యనన్.

సీ. కొలన నీరీతి నీరాడి కొప్పులంబు, రాశి నిర్గతవార్ధికా భ్రమములఁ బోల
నాత్మనిరసనభీతినా ర్ద్రాంబరములు, తనులతల నంటఁ బెనగ దత్తటముఁ జేరి.

ఉ. కామిను లన్నగాత్మజకుఁ గల్పకభూరుహ దత్తకోమల
క్షౌమముఁ గట్టనిచ్చియల కల్ దడియార్చివిరుల్ ఘటించి ము
క్తామణిభూషణంబు లిడి గంధ ములంది వెలందియానతిం
దాము నలంకృతాంగు లయి దప్పకరాద్భజనా దరంబునన్.

సీ. నారంగములు వాస నారంగములు, గొన్ని యళినాదమంత్రముల్ దెలుపుచోటఁ
దిలకంబు లవనీజ తిలకంబు లవిగొన్ని ప్రసవాసవార్ఘ్యంబు లొసగుచోటఁ
గాంచనంబులు వన్నె కాంచనంబులుగొన్ని, కళికాప్రదీపముల్ నిలుపుచోట
సహకారములు చైత్ర సహకారములుగొన్ని, తలిరాకుటారతుల్ దాల్చుచోట

తే. ముప్పిరిఁ బెనంగి ద్రాక్షలు గప్పికొనిన, గొప్పకప్రంపుటనఁటుల చప్పరాల
నొప్ప రాలినకప్పురా లుప్పరాలఁ, బెనచి వలిగాడ్పు ధూపమర్పించుచోట.

ఉ. గొజ్జఁగమంచునం గలపి కూర్చినపుప్పొడి తిన్నెమీఁద లా
మజ్జక కాయమానలసమానవిమానముక్రింద నొక్క పూ
సెజ్జ ఘటించి యందొక కుశేశయకర్ణిక నిల్పి యందు పం
పజ్జలజేక్షణాసుతునిభావము వ్రాసి కురంగనాభికన్. 168

తే. అతని వామాంకమున రతి నావహించి, మ్రోలనుదురాజు బుతురాజుఁ గీలుకొల్పి
క్రేవల సగంధపవన కోకిల మరాళ, కీరసారంగముల వ్రాసి చేరి చెలులు

సీ. ధ్యానంబు హృదయవాస్తవ్యకుటుంబికి, నావాహనము జగద్వ్యాపకునకు
నర్ఘ్యపాద్యములు నారాయణప్రియసూతి, కభిషేకముద్ధిక న్యాంకశాయి

కలరువోయిన్లు పువ్వులవింటివారికి గం, ధము గంధగిరి మరు ద్బాంధవునకు
ధూప మప్రతిమ ప్రతాపోష్మ సురభికి, దీపంబు తిమిర భయాపహునకు

తే. మధురసఫలోపహారంబు మధుపకీర, పరిజన పరాయణునకంచు భక్తినొసఁగి
మానమథనాయ మదనాయ మధుసఖాయ, మనసిజాయన మోనమోయనుచు మ్రొక్కి.

క. కామ కమలాస్త్ర కమలా, కాముక సుత కామనీయ కనిధీ యనుచుం
గామినులు విన్నవించిరి, కోమల కోకూయమాన కోకిలఫణితిన్.

శా. వాతాందోళిత చందనాగరులతా వ్యాకీర్ణ కేళీవనీ
జాతంబుల్ భవదీయనర్మ గృహముల్ చైత్రుండు నీబంటు నీ
కేతత్కాననజాతవస్తు నిచయం బేమిచ్చి పూజించుటల్
'శీతాంశోరమృతార్ణవ' మ్మను క్రియం జేకొమ్ము చేతోభవా.

మ. బలవన్మేరుశరాసనంబును బర బ్రహ్మాస్త్రముం గల్గు బ
ల్విలుకానిం దృణమైన చాపమున గాలిం బోవు లేయల్గులం
జల మానించి సగంబు చేసితవు నా సంకల్పసిద్ధుల్ గొనం
బలుమేరున్ నిరసింప లేఁజిగురుఁ గొమ్మం జేవ గాకుండునే

మ. కొండఁట విల్లు వేదలల కుండలిరాజట నారి యమ్మనం
తుండట పైటిపల్లియలు దున్నినవాఁడట యొండు రెండు భ
ర్గుం డిది నిండుపౌరుష మొకో యని గెల్చవె ముజ్జగంబులం
ద్దండత నొక్కఁ తుంటవిలు దాలిచి యంటివిఁ గందుతూపులన్

ఉ. మానశరాస నీశరము సొచ్చినధాతను నీమహోభరం
బానక రౌప్యభూధర గు, హా గృహ మీఁగినశూలికిం ద్వదీ
యానఘశౌర్యశక్తి హృదయంబున బూను రమావిలాసికిన్
మానధువోరజంబును దమంబును సాత్త్వికముం గ్రమంబునన్

క. మొనయంగనకా కటకట, మొనయంగన కాద్రిధరుఁడై ముదితను పవనా
తను పవనాహతి కొసఁగక, తనుపవనా మదన నీయు దంచిత కరుణన్.

సీ. లోకత్రయీజయోత్సేకంబు దెల్పునీ, పడఁగ నారాయణ ప్రథమమూర్తి
రెండంటఁ జేయు నీ కాండచాతురికి నా, ద్యనిదర్శనంబు నా మూర్ధజాని
గాఢనాళీకసంగ్రస్తుఁడై నేఁడును, నీడాగువాఁడు నా జీవిలాని
యెక్కిత్రొక్కనిచోటుఁ ద్రొక్కించు నీయాజ్ఞఁ, గడవదు పద్మినీ కాముకుండు

తే. కాంతలనెంత నీయంత ఘనునకింక, నళిచికుర బ్రోవవయ్య పద్మాక్షిఁ గావ
వయ్య శుకవాణిఁ గరుణింప వయ్య పూర్ణ,చంద్రముఖి నేఁచకయ్య యో చక్కనయ్య

క. వలదు కోల దాఁకు సుమ్మని, చెలువలు మరు గొసర విసరి జిలిబిలిగాడ్పుల్
జలజల నలరులు రాలెను, గలకల మను శుకపికాళి కలకల మొసగెన్.

చ. అఱిమి రమాకుమారుఁ డపు డగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్లతిముదిఁ దోఁచినం గువలయాక్షి వడంకి కడంకిఁ దూలిపై
మఱచి సగంధగంధగిరి మాగుతపాశ్రిత వల్లికాభయై
యొఱగిన సంభ్రమించి చెలు లుద్గతబాష్పతరంగితాక్షులై.

సీ. మోహాపదేశత మోముద్రితము లయిన, కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతారకా గమఖిన్నకుచకోక, ములఁ జంద్రనామంబు దలఁపరాదు
శీర్యదాశావృంత శిథిలితాసులతాంత, మసియాడ వీవనల్ విసరరాదు
తటుతాపపుటపాక పరిహీణతనుహేమ, మింకఁ బల్లవపుటా ర్పిడగరాదు

తే. లలన కానంగకీలికి లాకలాప, సంతతాలీఢ హృదయపాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబు పొంగిపొరల, జల్లని పటీరసలిలంబుఁ జల్లరాదు. 180

క. ఏమందమేమి సేయుద, మేమం దని మందలింత మేమందమొ యిం
దేమందయానఁ నడుగుద, మేమందఱ మనుచుఁ దరళ హృదయాంబుజలై

సీ. జవరాలి యడుగులఁ జివురాకులంటించి, పొలతియూరు లనంటి పొరలఁ బొదివి
కొమ్మచేదోయి చెందమ్ములహత్తించి, లేమబాహులు మృణాళికలఁ బెనఁచి
యతివగుత్తపుగుబ్బ లలరుగుత్తులఁగూర్చి, కాంతచెక్కులఁ జంద్రఖండమలఁది
కలికి క్రేఁగన్నులు కలువరేకులఁగప్పి లలనపెన్నెఱుల వాఱంబు ముడిఁచి

తే. నవనవసుఖానుబంధ బాంధవము లైన, చలువ లెన్నేనిగావించి చెలువచెలులు
నెలఁత కీవసులాభంబు నించుమంచు, నించువిల్కాని మరలఁ బ్రార్థించుటయును.

శా. ఆకార్యంబులలో సుధామయఖ్భై కాయత్తచిత్తేశసం
జ్ఞావర్ణంబు లొకింత వీను లెనయన్ సంజాతచైతన్యయై
పూవుంబోఁడి సుధాంశుబింబ సుషమా పూర్ణాభిషేకభ్రమీ
లావీతోత్పలవల్లివోలెఁ గనుగ ల్వల్ విప్ప నాళీజనుల్. 183

ఉ. కొండల మేల బాల మన కూర్చుసపర్యకు మెచ్చి యిందిరా
నందనుఁ డిందు సన్నిధి యొనర్చెఁ జుమీ సుమనఃప్రసాదముం

తెంచెదమీ శుకోక్తిఁ గల సేమము దెల్పెదమీ సమీహితం
బొందెదు సందియంబు వల దమ్మ యటం చభయంబుఁ దెల్పుచున్.

క. కేళీ కమనీయ కానన, పాళిక వెలువడి తురంగ పాళికశాబిం
బాళికలు బాళికడిమిన్ బాళిక దెచ్చిరి విహార భవనంబునకున్.

## ఆశ్వాసాంతము.

పశ్యత్ఫాలవిలోచనానలశిఖా భాస్వన్మహోమిత్ర, మి
త్రశ్యామారమణేక్షణప్రవణ చేతఃపద్మ పద్మాంగ భూ
దృశ్యాంగద్యుతిసంగ సంగరమదోద్వృత్తారిరాహుత్తరా
డ్వేశ్యాలోకభుజంగ, జంగమనగ ద్వేదండపూర్ణాంగణా. 186

క. శంబరనయనానూతన, శంబరహర విమతకుధర శంబ రణజయా
డంబర పీతాంబర యెం, తెంబరగండాంక యతుల ధృతినిశ్శంకా.

## కవిరాజ విరాజితము.

అనయనిషూదన శశ్వదపాదన యప్రతిపాదన దివ్యఝుకీ
వనమదనోదన కీర్తివిసూదన వైరివనాదనమత్తకరీ
ఘనఘననాదనటజ్జయవాదన గాఢనినాదన తేంద్రగిరీ
దినమదసూదన మల్కు వినోదన వీరబకీదనరాదహకీ. 188

## గద్యము

ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబనుమహాప్రబంధమునందు
తృతీయాశ్వాసము.

శ్రీగురుభ్యోనమః.

# వసుచరిత్రము

## చతుర్థాశ్వాసము

క. శ్రీరంగరాయకలశాం, భోరాశినిశాసహాయ భూభువనధురా
ధౌరేయ వీరగోష్ఠీ, ధీరాద్భుతసాంపరాయ తిరుమలరాయా. 1

తే. అవధరింపుము శౌనకా ద్యఖిల సన్ము, నీంద్రులకు రౌమహర్షణి యిట్లుపలుకు
జెలులకై దండఁబూని యా చిగురుఁబోఁడి, చారుమణిధామమల్లనఁ జేరఁజనుఁడు. 2

సీ. పతి వంచనామానఁ బంచిమించినవేడ్కఁ, బొంచియుండినపువ్వు బొదలుసూచి
సమయానుగుణ సమాగమలీలఁ గాంచిన, వరణాధుచరణాంక సరణిఁజూచి
రమణికృతోపచారము లిచ్చఁగైకొన్న, ప్రియుఁడున్న సౌవర్ణ పీఠిఁజూచి
రమణానుబింబ భాగ్యములు నోఁచినచక, చకితమాణిక్య భిత్తికలు సూచి
తే. హైమగృహవాటి నాఁటి వరావలోక, కౌతుకం బవ్వడటుగన్న కరణిఁదోప
నలసి సొలసి ప్రవాళశయ్యాతలమున, నలసితాపాంగమై సేర్చి యడలునంత. 3

### సూర్యాస్తమయ వర్ణనము.

చ. భవదనుజాత్మజన్ వసు నృపాలుఁడు గైకొను నెల్లినేఁట న
య్యవనివరప్రసాదమున నంటదువో భవదీయజాతికిం
బవిభయమంచు మంచుమల పట్టికి భావిశుభంబు లోకబాం
ధవుఁ డెఱిగింపఁ బోయిన విధంబున నేఁగెఁ బయోధిచెంతకున్. 4

ఉ. కాలవశంబునం దనయ ఖండిత చండిమ దూలిపోళి యు
స్తాలయువాటికిం జనుచు నాత్మకరావృత దుర్గపాళి నా
ప్తాళి నమర్చె నాఁ బరిణతాతపముల్ గిరులెక్కనిక్కఁద
న్మూలములం దవాతపస మూహము పేరిటియుర్ల వేలముల్.

మ. పటుతారాపటలఖండమండితనిజప్రాగంశుధారాపరి
స్ఫుటసూత్రంబుల బ్రోగుఁ జాతివెస నంభోవాహమార్గాఖ్యవా
నటవిం బ్రాక్తనకల్లనాభిమణి శేఁటాడన్ ముదానేకస
చ్ఛటలోదంబులఁ బడ్డయట్లు తమముల్ జారెన్ బిలశ్రేణికిన్. 19

మ. ఉదయాలూఖల మెక్కి నెక్కి సహజాంకోత్కేంద్రసంయుక్తుఁడై
చద లన్ బూద శశాంకకేళి కరవిస్తారంబులం బట్టి బి
ట్టుమునం గారెఁ జకోరగోపతతిపాలై చంద్రికాక్షీరముల్
పొదవెన్ ఘూర్ణితదుగ్ధధామనిబిడప్రోద్భూత సంరంభముల్. 20

శా. ఆవేళం బతిసంభ్రమానుగుణ గంగాంభోఝరంబుల్వలెన్
ద్యోవీధిం దెల్లిసెన్నెలల్ నిసుడ నిందుండందుఁ గ్రీడించు దే
వావాసద్విప పుర్యోఁ దన్మధితక్షుబ్జాబ్జంబులై తారెఁ దా
రావర్గంబులు తత్క్రోదకములై రాలెం దుషారాంబువుల్. 21

సీ. మిత్త్రాధికారంబు మీఱరా దని కాక, వెసఁబట్టపగలు గావింపలేదె
మాకుల క్రిందిసోమరు లెంత యనికాక, మలసి నీడల రూపు మాపలేదె
బాడబాక్షేప పాపమున కోపక కాక, యౌర్వాగ్ని నయినఁ జాల్లార్పలేదె
రాజకాంతాకృతి ప్రతిసర్గ మనికాక శిలలెల్ల సరసముల్ సేయలేదె

తే. జగతి నిదియనిఁ జగములు వొగిడ నెగడె, హాగునితలయొక్క వెలివమ్మి నడఁగఁ ద్రొక్కి
కలశవారాశి నెమ్మేనఁ గలయఁ బ్రాఁకి, కుముదరుచి నేలి కౌముది సముదయంబు 22

వ. వెండియు నఖండశశిమండల కుండలితకుసుమకోదండకాండాసనమహితకరకుముద
కాండ ప్రకాండతాండవిత పాండురపరాగ మండలంబున మెండుకొనుచు నిండార
విరిసిన బొండుమల్లియల తండంబు లంబోదలు మృదుల దళపుటాంతరంబుల వడిగొ
నిన తేటతేనియం దోఁచిన శిశిరకర కిరణాసారంబులుత్ఫుల్లహల్లకపరాగ మధు
రాచ్ఛమత్స్యండికా పుంజంబులం బొరలించి పుక్కిళ్ళకు వెక్కసంబు గాముక్కున
బంటి మెక్కి మెదలు నిక్కించు చలచ్చంచు సుందరీబృందంబుల యానందబాష్ప
బిందుసందోహంబులం గ్రందుకొనుచు జిగినిగులు తొగలదొరనిగనిగల మిగులఁబు
దులు కొనుచెగలునం దనమగని నగణిత పన్నప్రదేశంబులం నరసి యరసి వేసరి యొ
సరిలి సరసీమధ్యంబునం దననీడఁ జూచి కంటిఁ గంటినంటుకానిననుచు నంటంబోవ
నడియునుం దవులకవల జవనాసన్నుండయ్యు నొల్లండు వల్లభుండేల యని యుసు
రసురసుచు, ననురుసురై సొక్కుజక్కవ జవరాలి బహువిధా విలవిలాపంబులకుం
గనికరించిన తెఱంగునం గరంగ కురంగధర కాంత కందలంబుల జలజలని తెలిసీటి

జాలునం గ్రాలుకొనుచుఁ నచ్చవెన్నెల విచ్చలవిడిఁ బెచ్చుపెరిగిఁ పచ్చతామాని కెంపుఁ జిప్పలం బరిశుద్ధాసవంబు నించకయ నించినట్లుండఁ జంచలనఖాంచలంబులం బయలు చిందించువారును బూర్ణ పాత్రంబులం బోఁచునిండుచందురుం బిండి యమృతంబని వాసితాసవంబుఁ గ్రోలుచుఁ గలంక శంకం గలువ రేకు దిగిచివైచువారును ప్రతిఫలితతారకంబులు ద్రాక్షాఫలంబులని త్రిత చప్పరించువారును, నిజాననాంభోజ భోజనంబులం బట్టిన మైరేయంబు మగలనుఁ ద్రావించునెడ వారు వాసనాన్విత సహకారపల్లవంబని చక్కెరమోవి చుఱుక్కున నొక్కనం గలక్వణిత కంకణాంకితకరంబులు విదిర్చుచుం గనీనికలు రెప్పల తుదల నప్పళించుచుం గమనీయకీత్కార కంఠనాదభేదంబులం గులుకరించుచుం బానశాలా పురోభాగ సమానవలదకాయమానంబులం బొడము పొదవెన్నెలలఁ బువ్వులనియొత్తి యువ్వంబోవువారునుఁ గాదంబరీ మదోన్మాదంబున మోదమ్ములు పెరిఁగి చేదమ్ములు చఱచుచుం జెందులుగ నాడుచుం బాడుచుండ నృత్తంబులకు మెచ్చి నెత్తమ్ముల పగఱపుత్తెంచిన యుడుగరులని ముంగిళ్ళ రంగుమీఱు ముత్యాల యయంగుల చెఱంగులం దుఱంగలించు మెఱుంగులు కరాంగుళుల విప్పి కప్పికొనఁబోవువారునునై యతి ప్రబంధ గంధోత్తమాగంధానుబంధ బంధుర లగు సింధుర యానలయుద స్తనాసామణి ప్రభాస్తబకంబులు నుల్లసిల్లసిత లోధ్రచూర్ణంబులనుకన్నమితా వటువిలంబిహారంబులఁ బేరెంబులువారెనో యనం గొన్ని యెడల, నున్నత చంద్రశాలా బహిరంగణంబుల నడుగులకు మడుగులుపఱచినారని చరణకిసలయాయాసంబు లెఱుంగక చందన తిలకంబులు గరంగఁజారుహారంబు లెగరఁ జపలమండల హీరకోరకంబులం వెలంగ భావిపుంభావ సంభావనా పరిచయంబు సంపాదించు పెంపునం బంపిళ్ళుగూయుకలికి కొమరెల మొలకచను మొసులందులకరించినతళుకుసిబ్బెంపు దళతళ దళుకు కొనియెనో యన నొక్కొక్క గడంగడవరాని తమచేడియల బెడంగునుడుగుల నడుగు లామడలుగా వచ్చి యభినవవిహారహర్మ్యంబులు సొచ్చి శాతకుంభస్తంభంబుల నత్తమిల్లి యుత్తరీయంబులు పట్టి తివియ నీడిగలంబడుచుం దనులతల యడంకువలందఱఁగని వడంకులందను తానముడిసడలు నిద్దంపు వలువలదరిపాటువం జరణాంగుళి దంశికలం బట్టి నుసిమిన మిట్టిపడి యిట్టట్టుఁగదలనేరక పరుల హృదయపంజరంబులు మాటి యెట్టకేల కుంజిట్ట కాలకుంజెవి యొగ్గిన సిగ్గరికత్తియలు వాతాయనంబుల దగ్గఱ మెలంగు చలిదిగ్గుల గనింగని తొంగి చూచు ధూర్తపక్షి సుస్మిత వదనంబని యదరిపడి పొదవుకొన్న నున్నచేలలఁజిన్నారి నెరికలఁ జెన్నారు మిసమిసలఁ గన్నంబు పెట్టికైకొనియెనో యనఁ గతిపయస్థలంబులం బచ్చిదేరునంగ మచ్చంబులతో వచ్చి తచ్చనవినయంబులు దెచ్చుకొని మోవిమాటి

మాటాడియు చేతులుగట్టుక నిలిచియు గట్టుపాశ్వంబున నొడిగట్టిన దిట్టనిట్టులంబట్టి పూదండలంగట్టి ప్రేలింపం జాలాగతకిరణ దండంబులకుం జెయిసాంచు మగుదమగు వల కరనఖరకాంతి భంగంబులం బొంగిపారలెనో యన వేరొండుచాయలం గోయక కోయుకాయజుని మాయకత్తులరాయి డింబకలేక ధవళాంబరమాల్యానులేపన నేపథ్యంబులుపూని మును మాపుచూచివచ్చిన కప్పురకదలికాంకిత కుంజంబులకువచ్చి యచ్చట నఖిలకుంజంబులు నట్లయుండంగొండొకనేపు విచరింపలేక పలపులవలనం దెలిపి నిజసమయ నిలయంబు లీగునిత్యకేజనంబుల మనంబు లరయనలసి నూర్త్మ గలుమాటన కరుసటయు నవ్వేళ నెవ్వరింగానక యుకణ్యాకోదనంబు నిజంబయ్యోనని నిశ్శబ్దంబుగా నేడ్చుచుం జేయునదిలేక చేష్టలు దక్కియున్న యన్నెలుగులు వారింప సన్నిహితులై వారు కన్నీరుదుడిచి కవుగిట మన్నించినం గనుదెఱచి చూచునన్నెలంతల విస్మయసూచన ప్రభాదట్టంబుల నిట్టవొడిచెనో యన మరియుం జెక్కునెళవులం గళలయిక్కవలు దెలసిన యదనమదనకదనంబున వదమదంబు లగు నంగంబ లనంగ ధట్టంబులు మార్పడవైచుకొని యుప్పరిగలబయళ్ళను నేగుదెంచి చందమామ గుటికల్కుగోలు మందయానల చెక్కులవెలుంగు పలివెలుంగుం జూపి మీమొగముల మిలమిలలు గిలుబాడవచ్చెం జుమీ వెన్నెల బచ్చుముచ్చు పిడిచొచ్చెట మసలుటమనకునేరమని నారులం బునారతంబులకు నెలయించికొని పోవువలకారులజారు కొప్పులం దొరంగు విరిగుత్తులతో బొత్తుగలసెనోయన వెలసి యభివ్యక్తశుద్ధవర్ణబ్రహ్మంబుగావున నుర్వింగలవారినెల్ల సర్వజ్ఞులంజేయుచుం దారవాద ధౌరేయంబుగావునం గొండలనెల్ల వెండికొండలం జేయుచుం బద్మాశ్రిత పాదత్రభూత నూతనస్రోతోవిశేషంబుగావున నఖిలభువన మాలిన్యంబుల దొలగింపుచుం బంకజభవాండ మంటపంబు పంకుచేసిన పాంకంబున నంకింపుచు నకలంక మీనాంక నిరంకుశయసోమకీచీ వీచీసంద్రభీనంబై విజృంభించు సమయంబున.

శా. అచ్చంపుందెలి నిండు వెన్నెలలతో సజ్జారి వచ్చెం గడుం
హెచ్చెం బచ్చని వింటిజోదు చలిగా డ్వేతెంచె నిచ్చోట ము
చ్చిచ్చుం గూడిన నోర్చునే చెలి యయో చెల్లించు నాళీజనం
బిచ్చం మెచ్చగ మంజువాణి సకలాభీష్టక్రియాధుర్యయై. 24

సీ. రిక్కరాయనికళల్ చెక్కుగీటక మున్న, వెతతూపు దృగ్వీధిం బడక మున్న
యెలతుమ్మెదలదిమ్ము తలంగ్రమ్మకయ మున్న చిగురు చేపట్లకు దిగక మున్న
కలికికోయిల గళగ్రహము సేయకమున్న, రాచిల్కమాటకు రాకమున్న
నిసువు తెమ్మెరదంట యసువులంటకమున్న, రాయంచకాళ్ళ దోలకయమున్న

తే. యబ్జముఖులార యేఁబోయి యచలకన్య, యుత్తలముదెల్పి వసురాజు చిత్తమరసి
వత్తునత్యంతశుభవార్తఁ దెత్తుననుచుఁ, గొమ్మ హారంబుపూని యేఁ గుటయునిచట.

శా. క్రీడామందిరజాల మార్గములచే క్రిన్ నిక్కి జాబిల్లిజా
గోడల్ నీరుగ జాఱఁగ్రోచి నెలత ఘృణుల్ చొచ్చి వెన్నాడిమై
నాడం గోమలి యోర్వలేక వలవం తం బద్మినీజాతికిం
గీడానుగ్రశిఖామణిం బలికెన క్షీణానులాపంబులన్.

శా. రాజీవాక్షుల నేఁచుపాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో రంజిల్లె సత్సంతతుల్
తేజంబందెనొ డిందెనో యహిభయోద్రేకంబు తాఁ జెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే.

ఉ. ఇంతుల నేఁచుపాతక మ దింతటఁ నంతట బోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహత్కళంకమై
వంతులఁ బెట్టి యూరు పది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి చూచెదవు గా తుది నీబహుళార్తిభేదముల్. 28

సీ. కమలించె గాక యంగజవిరోధిఁ శిరోధి, దల కెక్కఁజాలెనే హాలహాలంబు
క్రాఁచెఁ గాక పయోధి కాండప్రకాండంబుఁ బైకిఁ బొంగించెనే బాడబంబు
తూరెఁ గాక ముకుంద తుందప్రఘాణంబు, వెడలెనే యెదఁ గాలి విపినకీలి
యదఁచెఁ గాక శిలోచ్చయచ్ఛదాహంకృతుల్, గరఁచెనే నీరుగా సురపహేతి

తే. నీకరణి నిట్లు దయలేక లోక మేర్చ, నీకరణియైన యలయత్రి నేత్రమునకు
ఖగకరాలోకగాఢనిష్ఠురతపోగ్నిఁ, బెటిలిపడకున్కి భరమెక్క పీటజన్మ. 29

మ. విషరాశిన్ జనియింపవో విషసహోవిఖ్యాతి వాటింపవో
విషభృన్మార్గము నంటవో విషధరుల్ వేష్టింపఁ గాలూదవో
విషభుక్చ్ఛాలికఁ బిన్ననాఁడె కనవో విఖ్యాతకౌటిల్యమున్
విషమం బెట్లగు నీకు జీవకృతవిద్వేషంబు దోషాకరా.

మ. కమలాభర్త భవద్విరోధిపయిఁ జక్రంబుం బ్రయోగింప ను
త్తమశస్త్రంబది యాత్మనామకభిదా దర్పాంధు నిన్నున్ మొఱం
గి మహారాహువు దున్మియుం దునుమ కేఁగెం గాక చక్రంబుచే
దుమురై పోవని వారలుం గలరె నీ దోషంబు గాదే శశీ. 31

చ. సమధిక కాలకేళిగుణ శాలివి నీవు దరస్థలోక సం
ఘములకుఁ గీడొనర్తు వని కైటభదానవభేది యంతరం
గము వెడలించెగాని నిను గండడఁగింపకపోయె నిందిరా
రమణుఁ దలంచి రాత్రిచర రాగనిమగ్నుల కేడ ధర్మముల్.

ఉ. కొండొక సేపు నిన్ను మది గూర్చిన మాధవు నంతవానికిన్
బండె వధూవధ ప్రబల పాతకజాతకళంక మింక నీ
దుండగమేమి చెప్పెదను దోయజవైరి శిఖండవీధి నీ
ఖండము ప్రానుశంకరుఁ డఖండజగన్మథనుండు గాఁడొకో.

శా. ఈ వజ్రుండవు నీటఁ బుట్టితిఁజుమీ యేనంచు మోమోటపుం
ద్రోవల్ సెప్పఁగ సిగ్గు గాదె మఱి నీ తోఁబుట్టు శ్రీదేవి లీ
లావాసంబు సిరుల్ హరింతు వనుచో నయ్యోక్యకళాదుండు చే
తో వీధిన్ సహజాధనాపహరణో ద్యోగంబు సెగ్గించునే. ౩౪

తే. నీరజారాతి నినుఁదన నెలవుగూల
నేల సృజియించె విధిసృజి యించుఁగాక
యేల జైవాతృకునిఁజేసె నేలతప్పఁ
బుడమిఁ "పాపీ చిరాయు" వ స్సెఁగునుడుగు.

సీ. స్వామియై నిగమాతి భూమియై సురపుగో, గామియై యబ్ధిజా కామియుండ
హారియై హాలహాలా హారియై భవదంశు, ధారియై ప్రసవాయు ధారియుండ
ధాతయై కుశలసం ఘాతయై భువనని ర్మాతయై వాగ్వధూ నేతయుండ
మిత్రుఁడై పరమప విత్రుడై విమలచా, రిత్రుడై నవనీక శత్రుఁడుండఁ
తే. దొలుతొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళయొసంగి, నంటుగావించు టెల్ల న నాథయువతి
జనతనూదాహసాహాయ్య మునకుఁగాక, కానవా వారి నెవ్వారిఁ గమలవైరి ౩౬

క. అని మఱియు బెక్కుభంగుల, వనజారిని దూఱినారి వనితాజనతా
ఘన తాప వజ్రఘనతా, ఖినుతాంబకధరుని మరుని బేర్కొని కినుకన్.

క. వలదాశుగశిఖికీలల, వల దాశుగతిన్ నిగుడ్ప వలరాయఁడ చె
ల్వలదాయవె కలదా కే, వలదారుణవృత్తి దయ ల వంబును వలదా. ౩౮

ఉ. శంబగవైరి నీవు పటు శంబరపోషణశాలి యాతఁడ
జ్జాంబకధారి నీవు మధి తాజ్జు దతండు నిశాటఘూటద

ర్వం బడఁగించుబల్లిదుని పట్టివి నీవు నిశాటుఁ డాతఁడో
యంబుచరాంక నీకుఁ దగునా హరిణాంకునితోడి కూటముల్.

ఉ. అద్దిర జీవమాత్రచరితార్థక నీయెడ గాలివోయె న
స్మద్దయనీయవాక్యములు శాంభవలోచనవహ్నిఁ గ్రాగఁ బె
న్నిద్దురఁ బూని మే నెఱుఁగ నేరక యుండెదు నీకు మ్రొక్కి వే
నుద్దులు చెప్పినన్ మనసు చొచ్చునె బోధము పుట్ట నేర్చునే.

మ. అణుమధ్యాతతిమీద నంతవిరసం బౌ చాపముల్ సిఘపా
రణ మత్తాగొని సోలునారి శిఖిమిత్రంబైన తేరున్ వసాం
గణలుబ్ధానుగ కోటిఁ బూని పెదలం గానిట్టి దే ధర్మమే
గుణమేయెక్కుడిదేఁ బలంబును మనః కోదండ నీకెంతయున్.

మ. అనిదానాగ్రహముం బ్రియోక్తుల నమస్కాధిక్యముం బాంధవ
ర్ధన నీకున్ మధుమత్తభావమునగా దాకగ్రె గాకున్న నీ
వనిలాంకూరము నెక్కి యాడుమనో వశ్యానీదజశ్రేణి చేఁ
బనిపాటల్ గొనఁజూతువో మఱితువో ప్రఖ్యాతకాయక్రియల్.

సీ. మనుప లేఁడాయెనే మోహాక్రగ్రాహ సం, గ్రస్త సామజ పరిత్రాణమునకు
మనుప లేఁడాయెనే మనుజాశనునిఁ జీరి, యనఘ నిష్ఠాయుక్త నాత్మభక్తు
బెనుప లేఁడాయెనే హృచ్ఛ్వాసుపర్వాళి, మారుతనిర్గత జీవ మారుతముల
నునుప లేఁడాయెనే యుగ్రఫాలాగ్ని దూ, లినలోక మెల్లఁ దొల్లింటిపగిది

తే. శౌరి యఘటితఘటనా విహారహారి, యేమి గావింప గూర్చెరఁ డామహాత్ముఁ
డసదృశచరిత్రు నినుఁ బుత్రుఁ డనక కినుక, గిరిశఫాలాగ్నిఁ బడ నుపేక్షించెగాక.

తే. అనుచు ననవింటి పెనుదంట నాడరాని
గెంటుసము లాడి మఱియు నమ్మంట మాఁగ
గలయ నెక్కొంచుకొనివచ్చు మలయ నగభు
జంగ విషదిగ్ధపనసుపైఁ జలము వొడమ.

ఆ. విరియుఁగువలయంబు విధిపదంబు చలించు, నెసఁగు భువనభంగ మీవువోలయు
మలయపవను పవన జలదవేణికలపై, మలయపవను పవన వలయభవన.

ఉ. కీలియు నీవుఁగూడి యుడికింతురు లోకమటంచు నెప్పుడున్
మూలల నైచె మిమ్ము నలు మోములవేల్పటు వైచినం జనం
జాలక హవ్యవాహుని సంగతినుండి జగంబు గాలుపం
గాలుపదంబు చేరితి ప్రకంపన నీ వనుకంప చాలమిన్. 46

క. గోలలనావల్లభుఁడిది, గోలలనల యుసురువోసి కొందువని వనీ
బాలానిల నిను మెసవం, గాలాహికి నేండ్లు వేయు గావించె వెసన్.

మ. అమితోల్లాసి పలాశవృత్తివయి బాల్యావస్థఁ గొల్లాడి తో
సుమనస్సంపద నింక నీ వతనుని స్ఫూర్తిన్ విజృంభింప లో
కముభూలిం జనదే ప్రభంజన రమాకాంతుం దనంతావతా
రమహాయత్నము పూనికాని వినుఁ దీర్పంజాలఁ డల్పంబునన్.

క. చలదలఘు చటులకీలా, హాలహాలమున నఖిలభువన హారణక్రీడా
హాలహాలిక వెలయు బలియుని, గలదుం బవమాన నీవ కాంచితివిగదా.

చ. నిబిడితమోనుబంధ మహానీయమహామహిజాతమైత్రిమైఁ
బ్రబలుశనైశ్చరుండ వతి పాంసుల నీవిక భీకరాకృతిం
గబళము గొందుగాక త్రిజగంబు వడంక బెడంక నిత్తువే
యబలల జీవనానిలము లన్నియు నాఝుషకేతుసంగతిన్. 50

క. అని వనిత జాలిగాలిం, గనలుచుఁ బోనాడి తుహినకరకిరణఝురిన్
మునుఁగ జనఁ జెలులు గని హా, యని వదరుచు నడ్డగింప నతిశోకమునన్.

శా. ఆహా బిల్లివెలుంగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెగ్గెత్తి యా
రాజీవానన యేడ్చె గిన్నరవధూ రాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధా పూరంబు తోరంబుగాన్. 52

ఉ. అప్పుడు ముద్దరాలిఁ జెలు లక్కున జేర్చి ముఖాబ్జ మొత్తి కన్
జెప్పల బొప్పనుల్ దుడిచి చేపె నృపాలుడు గారవింప నీ
వొప్పులసొప్పునై సిరుల నొందెద వేటికి గుందెదమ్మ మా
యప్పవు గా మదిం దలఁపకమ్మ వినూతనసాహసంబులన్.

చ. అని మన నూర నూరడిల నాడి యయో మఱిమంజువాణియుం
జని తడవయ్యె నేమిటికి జాగొనరించెనొకో నగేంద్రనం
దనమది కొందలం బెఱుఁగ దా తగదా ఘగదాయ వెన్నెలన్
మునిఁగెడి బాలనెత్తి నయముం బ్రియమున్ దఱుమున్న గాగనన్.

శా. ఎట్లో కాకని యన్నులన్ని దెసలన్ వీక్షింప నప్పట్టునం
బుట్టుంగెంపున నింపుమీఱు రవిపెంపుం బెంపి దట్టంపుఁ గెం

బట్టుం బుట్టమురంగు నింగిరవు కా పాదించు దివ్యప్రభా
ధట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యాలక్ష్మికిం జుట్టమై

సీ. ఇది తమ్మికంటిపై నీసడించిన నిశా, ధవుఁ దోలు లోకబాంధవుని పొడుపు
పొడుపు గా దిది తల్లి పడఁతి కెత్తగ దెచ్చు, రక్తరాజీవనీ రాజనార్చి
యర్చిగా దిదిసహజానురక్తినగాత్మ, జనుఁబోవఁ గదియునో పథులచాయ
చాయగాదిదికూఁతు చందమారయవచ్చు, కోలాహలునిరక్త కూటదీప్తి

తే. దీప్తిమాత్రంబుగాదిది దివ్యధామ, మనుచుఁ జెలులాడు కొనవచ్చె నంతనాన్న
పాగ్చితనవాబ్జరాగము ద్రాంగుళీయ, రంజితాత్మీయపాణియై మంజువాణి.

క. వచ్చి వసురాజశేఖరుఁ డిచ్చిన ముద్రిక లతాంగి యెదుట నిడి చెలుల్
గ్రచ్చుకొని యనుఁగ నిట్లను నచ్చేడియ తనయుదంత మాద్యంతంబుల్.

ఉ. అమ్మనుజేంద్ర చంద్రుహృద యమ్మనియెట్టిదయోయెఱింగి యీ
కొమ్మమనమ్మునం గలుగు కొందల మంతయుఁ దెల్పిరమ్మ పో
పొమ్మని మీరు నంప బని బూని పొలంతుకలార కార్యవే
గమ్మున నంబరోత్పతన కౌశల మందితి తత్క్షణంబునన్.

సీ. బడివాయకిల నగ ప్రతతితో జివ్వన, నెగిరిన ట్లెతోచు మగువలార
నై పైపమీరణా ర్భటినింగి బోరన, నఱచిన ట్లెతోచు నతివలార
నిఖిలభూములు జవ నిక వాప దారున, నెదిరిన ట్లెతోచు నింతులార
చనజన వెడదయై శశిమేనుగ్రక్కునఁ, బెరిగిన ట్లెతోచు దరుణులార

తే. కొండ లచ్చనగండ్లయి నిండుచెఱువు, లెల్లన ద్దంపు బిల్లలై యేర్లుముత్తి
యంపుసరులై యరణ్యంపు గుంపులెల్ల, నారులైతోచుఁ బొడువున నారులార.

చ. పురములు దుర్గముల్ శిఖరముల్ వెలిపేటలు నూళ్ళుపల్లియల్
ధరపయిఁ గుప్పవోసినవి ధనంబున నేర్పడకున్కి గొంతసే
పరయుటకై వినిశ్చలత రాకృతినుండి వసుక్షమాతలే
శ్వరునగరీలలామకము చాయఁ గనుంగొని సంభ్రమంబునన్.

సీ. పోవఁబోవగఁదోచెఁ బురరమామకుటమా, ల్యంబులై ధర్మహర్మ్యధ్వజంబు
లేఁగ నేఁగ నెదిర్చె గృహదేవతామాళి, కలితాబ్జకళికలై కలశతతులు
చేరఁజేరఁదలిర్చె వీరలక్ష్మీవాస, వనజాతదళములై వప్రశిఖలు
చనఁజనఁ దులకించె జగతీసతీకాంచి, హారపర్వంబులై తోరణంబు

తే. అరుగ నరుగంగఁ జూపట్టె సేరి యనంత, తనువులై మల్లఖురళికా భినయవాటి
కాకరితురంగ శాలికా గంధవిపణి, కాముకార్పితమణిపుత్రి కాచయంబు.

క. అందు ఘనసారమృగమద, చందన కాశ్మీరసార సౌరభలహరీ
సందోహదోహదానిల, కందళి నుపశమితసగన గమనశ్రమమై.

చ. అహ యిది యింతనీడ యని యారెపు లూరక సంభ్రమింపఁగాఁ
జెదరి కపోతముల్ గొణఁగి చేరఁ దారకవీథి బాఱగా
నిగుడఁ బోఱఁగి కేకిరమణీ నివహంబు విధూతపక్షమై
కొంద లాదరింపగా నొకశిరోగృహపాళిక ప్రాలిను న్నెఱన్.

ఉ. సాలము యంత్రక్షిరము విశాలకవాటికఘట్టనంబు దృ
జ్మీలన హైందవామృతస మేతపతాకిక జిహ్వా చంద్రికా
జాలము భూతిపూత నవచంద్రశిలాంబువు లశ్రుధారగా
బ్రోలు ప్రశాంతఘోషము యి పూర్ణసమాధిఁ జెలంగెనయ్యెడన్.

సీ. పతిగళార్పితభూజా లతికలై రతికేళి, యలపాగ్రముంగిళ్ళ మెలఁగువారు
నళిగి యేఁగుచుఁ బ్రియుల్ నిలిపిన నిజభుజాంగీభావ మేర్పడ గెరలువారు
వరు లొండుకడ కేఁగ బురుషభూమికఁ బూని, తెరువాగి భంగింప దివురువారు
రాసమారులయిండ్ల కేకితంబునఁ దదా, ప్తుల వెంట బుడిబుడి బోవువారు

తే. మదనమంత్ర రహస్యముల్ సదనవలభి, నిభృత పారావతములకు నేర్పువారు
నైన వెలయాండ్రచే నప్పు రాధిరాజ, వేశవాటిక చూడ్కికి వేడ్క యొసగె

సీ. కమనీయకౌముదీ కాంతివారి వియోగ, గాఢపాండిమ పొత్తు గలయఁబోలు
వలివెలు త్రా నెలు వలు వారిమదన వ, హ్నిజ్వాలికల వేఁడి నిగురఁబోలుఁ
బ్రతిహట్టరత్నదీపములు వారిదృగంశు, యమునోర్మిమాలిక వడఁగఁబోలు
యామికారభటీభయంబు వారిమనోజ, భూవరాజ్ఞాసిద్ధి పొలయఁబోలు

తే. బండు వెన్నెలయనక యా పయి విధూప
లాంబువనక యాత్రోపర తాన్నంకురాగ్ను
లనక యామీద నారెపు లనకచనరి
తరుణు లొకకొందఱవి యెల్ల సరసికొనుచు.

చ. హరిహయ సౌధసన్నిభము లన్నియు నన్నియు నద్భుతాకృతుల్
హరితమణీ ప్రకల్పితము లన్నియు నన్నియు జిత్రకేతువుల్
హరిపద మార్గలంఘనము లన్నియు నన్నియు హేమవప్రముల్
పురిభవనంబు లిందు నృప పుంగవ ముంగళధామ మెద్దియో.

మ. అని చింతించుచు నొక్కభామమునకున్ యక్షాంగనల్ పుష్కర
ధ్వనితోఁ జారణకన్యకల్ చటులవాగ్వైచిత్రితో బన్నగాం
గనలుద్యన్మణిదీపమాలికలతో గంధర్వకాంతల్ సుకం
ఠనినాదాతిశయంబుతోఁ బ్రహరిమట్టుం గంటి జిత్రంబుగాన్.

మ. నరలోకంబుఁట సిద్ధసాధ్యఫణిగంధర్వాంగనాసేవనా
పరిపాకంబుఁట యెంతవింత యనుచుం బల్మారు వీక్షించిరే
సురరాడ్రత్నవిమానచిత్రమహిమల్ నూయంచునూహించి యా
ధరణీనాధమలావతంసభవన ద్వారంబు సేరంజనన్.

క. దానాగతరసికాళి ప, దానాహతగీతిచెవుల నంటఁగ నిదురల్
పూనని బహిరంతరవీ, రానేకపరాజియచట నచ్చెరు వొసఁగెన్. 70

సీ. పటుహీరములచాలు బాలసున్న మొనర్ప, శక్రకాశ్మములచాలుఁ జాదుపూయ
శశికాంతములచాలు జలసేక మొనరింప, గలికిపచ్చలచాలు నలికివైవ
విద్రుమంబులచాలు వింతజాజుఘటింప, ముక్తామణులచాలు మ్రుగ్గులిడఁగ
వైదూర్యములచాలు వన్నెల తెరలుంపఁ, దేటకెంపులచాలు దివియలెత్త

తే. జకచకితపుష్యరాగమాలికలచాలు, గగనచిత్రవితాన సంగతియొసంగ
నిమ్మహాస్థానికనఁదోచె నృపుహజార, మామహామంటపముదాఁటి యవలఁజనుచు.

చ. తళుకుఁబసిండియోవరులు దంతపుఁజావడు లర్చనాగృహం
బులు గుడినీరుమేడలును భోజనశాలలుఁ గెంపుటోడుబి
ళ్ళలగిరడీలు శీతలశిలాతలముల్ భువనేశ్వరంబు లు
జ్జ్వలజలయంత్రధామములు సజ్జలుదాఁటి ధరావతీర్ణనై. 71

సీ. ఒకవంక నిర్మలోదక శంకసంపద, త్పరిధాన నైరత్తఁ బాఱ వెఱతు
నొకచోట విఘటితోరుకవాట గృహవాట, మనిమిన్నకయతూరి చనఁదలంతు
నొకయిక్కనిది వితర్దిక నిక్కమని పదా, గ్రము నిక్కరిపి సెక్కఁగాఁ దలంతు
నొకచాయఁ జిత్రభిత్తిక గాయనుచు పోయ, గమునఁ బాయక డాయఁగాఁదలంతు

తే. నిట్లు గృహరాజకేళి తానేకరత్న, వివిధరుచివైభవంబులు వెగడుపఱుప
నిదియ కాబోలు నృపుకేళిసదనమనుచు, నచట మాయాబలతిరోహితాంగినగుచు. 73

చ. అనుపమరత్నసౌధకమలాలయవాటిక నొత్తగిల్లిపైఁ
జను మొనదోఁప నొంటివలిజక్కవతో సరవిందముల్ మొగి
డ్చినయెలదమ్మి తీవియలకీవిగనుంగవ మూసియున్న యం
గనల ననంగదేవతలఁ గాంచితి రాజసమీపభూములన్. 74

సీ. ఒకతె చన్నులమీఁదఁ యుబికికిన్నర గాలిఁ, బలుక నింత చలించి బయలుమీఁటు
నొకతె యూరుపుగాలి నురళివూనురఁటి తే, నియ చిందఁగనువిచ్చి బయలువిసరు
నొకతె చంద్రాశ్మ వేదిక ముఖద్యుతిఁ జల్ల, బడనుల్కి చేయాకు బయలుసాఁచు
నొకతె కర్పురగళాచిక దేంట్లు సందడిం, పఁగ మిట్టిపడి కేలు బయలుపట్టు
తే. నిదురతిమిరైన నుడిగంపుఁ జదురులిట్లు, వాసనాబలమునఁ బూను వనజముఖుల
గంటిఁ గని తత్ప్రదేశంబు గడచి చనఁగ, నునిద లిద్దఱు పతియొద్దనుండి వచ్చి. 75

శా. ఏమే హేమలతా యటంచుఁ బని యేఁమే మాధవీయంచు నీ
భామా మన్మథుచంద మెట్లనుచుఁ జెప్పంజాల భూపాలుఁ డా
రామక్షోణికిఁ జిన్నినాఁటగోలె నిద్రాసౌఖ్యముల్ మానినా
డేమో యంచు వచింప వింటిఁ దమలో నేకాంతలీలాగతిన్. 76

క. ఆమాట కొంత చెవులకు, నామెత గాఁ బ్రియము విస్మయము నాదు మనో
భూమిదళు కొత్త నృపమణి, ధామాభ్యంతరము సొచ్చి తడయక యచటన్. 77

చ. మొలక మెఱుంగుఁ గెంపు మొన ముక్కుల నిక్కుకిరీటివచ్చ రా
చిలుకలకోళ్ళతోఁ జికిలి చెంద్రికవన్నియ పట్టుపట్టెతోఁ,
దొలకుపసిండిప్రాఁత తెరతో నెఱితావుల మేలుకట్టుతోఁ
జలువలు చిందుముత్తియపుఁ జప్పరమంచముపై మహోన్నతిన్. 78

సీ. సేసకొప్పున జాఱు చంగల్వ మొగడలు, జాగదారుణ కటాక్షముల సెనయ
నిద్దంపు గప్రగంపు నిదురయొంటులచాయ, గండపాండిమకుఁ గైదండయొసగ
నెత్తమ్మినూలిజన్నిదము శయ్యావి వ, త్తనలూనహారసూత్రములఁ బెనఁగఁ
బలుచనివలిపదుప్పటుల తావియ చిక్కఁ, బూసిన గందంపుఁ బూతఁ బోల
తే. నొప్పుపుప్పొడిపఱప్రపై నొత్తగిల్లి, మోముదమ్మితలాడపై మోపి యదుగుఁ
జివురు చిగురాకుబటువునఁ జేర్చి చిత్ర, ఫలక మీక్షించు నాసార్వభౌముఁ గంటి. 79

చ. కనుఁగొని యా నృపాలక శిఖామణి డెందము శైలకన్యకా
మనవమహానురాగిరుచిరమగ్న మొకొ కా కప్రియాంతరస్పృహా
ఘనరసపోషరూపితి మొకందము గాకని గంధతైల భా
జనభవనప్రదీపికలచాటున నల్లనఁ బొంచియుండఁగాన్. 80

చ. ఉసురసుఁ గన్నుమోడ్పుఁ దలయూఁచుఁ దలంచు నగుం జెమర్చు న
ద్దెసలు గనుంగొనుం బొఁలు లేచు వడంకుఁ జలింపకుండు హా
ప్రసవసుగంధి యంచుఁ బుపుఁ బొన్నవ వ్రాలు నృపాలపుంగవుం
డసమశరప్రవీర విశితాశుగదుర్దినదూయమానుఁడై. 81

క. భావగతభావవాసం, భావితభావంబులిట్లు పల్లడిగొనఁ గో
త్రావల్లభుఁ డిట్లనుఁ జి, త్రావేశితవనితఁ గని మహామోహమునన్. 82

ఉ. ఏమిటి కల్గితే కువలయేక్షణ పల్కవి దేటికే వధూ
టీమణి యేల తాళటికి డెందము పూనితివే లతాంగి య
య్యో మనసారఁ దావకపయోధర పాళి దృఢాంకపాళి యీ
వే మృదువాణి నీకునొక యెగ్గుచు జేయఁగదే తలోదరీ. 83

చ. అళులకు మోము ద్రిప్పుగతి వంచలు రాఁ జెలిఁ బిల్చురీతి రా
చిలుకకుఁ బండ్లు గోయుక్రియఁ జిత్రగృహంబుననుండిపోవుచున్
సొంపున నీవు నన్ మఱలి చూడఁ ద్రిశుద్ధిగ నేలితంచు నే
నలరితిఁగాని భావజుని కగ్గముసేయు టెఱుంగఁ గోమలీ. 84

ఆ. గుణనిగుణము రోజగిరులు గాంచినఁ గాంచు, గాక నీ మనంబుఁ గాంచనేల
తల్లికుటిలవృత్తి తగుఁగాక కురులకు. నింత నీదుచెయ్వి లెనయనేల. 85

సీ. కలికి పెన్నెఱు లింద్రశిలలయందముఁ జూపుఁ, జూపుద్రొన్ననవిల్తు తూపుచిలుకు
చిలుకు తేనియల జొబ్బిలు మోవి సురమణి, రమణీయవజ్రాళి రదనపాళి
పాలిండ్లు పసిఁడిగుబ్బలులై చెన్నారు, నారుకాతిక్రపాణి యంద మెఱుగు
మెఱుఁగుచక్రముమించు మించుల జఘనము, ఘనమూరురుచికరి కరముకన్నఁ

తే. గన్నశవుసేయుఁ గచ్ఛపాకారగరిమఁ, గరిమరాళికయాన నీ చరణమహిమ
మహిమనోభవమణి పుత్రి మాడ్కి నీకు, నీ కుటిలకర్కశత మాను నేలకలికి. 86

చ. అని విభుఁ డింతిఁ బల్కవిని యప్రతిమానసుధాసరోధి జీ
వనములఁ దేలినట్లు బహువాసర పుణ్యఫలంబు కన్నులం
గనుఁగొనఁజాలినట్లు త్రిజగంబులు నొక్కట నేలినట్లు ప
ద్మనయనలార సంతసముఁ దాల్చితి మామక మానసంబునన్. 87

ఉ. వెండియు దూఱుచుండెఁ బృథివీపతి యానరలోకపుష్పకో
దండు విఁ బల్కరించి వనితామణి యుక్కియుఁ దెల్పి యాత్మకుం
బండు వొనర్తునంచు నృపమంచసమంచితయంత్రపుత్రికా
మండలిలోన నొక్కమణిమండితపుత్త్రికనై రయంబునన్. 88

చ. పకపక నవ్వి యో వసువృపాలక బాలిక దూఱెదేల సా
రెకుఁ బరతంత్రతలింతులు పరింతురె కాంతులఁ దమ్ముఁదామ క
న్యకలకు నేరమా యది యనన్యగతిన్ సుదతిన్ మనోజు బా
రికి నెరఁజేసి లోఁ గనికరింపనివారిని గాక నేరముల్. 89

శా. మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయవ్యాపార గోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహీపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు చెప్పనేల మగవారిన్ నమ్మఁగావచ్చునే. 90

ఉ. అంటినసంగ సంగజనిభాంగుఁ డభంగుర విస్మయార్ణవం
బంటినచూడ్కితో నిని ప్రియాహృదయానుశయాగ్ని సూచనం
గంటి కితాఖిలాంగుఁడయి కంతువనాటవిపాటఝాట సం
ఘంటితమైనడెందము ఝు లుక్కని పెక్కుతలంపు లూరఁగాన్. 91

ఉ. చారణకన్యయో ఖచరసారసగంధియొ కాక కిన్నరాం
భోరుహపాణియో బిలువపాల్గుకయో మఱి శైలకన్యకా
ధీరవయస్య యైనవనదేవతయో యొకమంజువాణి యే
తేరఁగఁబోలుఁ బొలఁగతిఁ దెల్పఁగ నిచ్చటి కద్భుతంబుగాన్. 92

మ. అని యూహించి వదీతనూజతలఁ బాహా మామకప్రేమ బం
ధనిమగ్నం బని పల్కు వింటి నిఁక నా తాపానలం బాఱెఁ బ్రా
క్తనపుణ్యంబు ఫలించెఁ బంచశర శస్త్రశ్రేణినిం జిరికిం
గొనఁబో నేనిక నొక్కఁడా ప్రియతమా ఘోరాత్రికిం గుందెదన్. 93

శా. నా డెందంబున నుండి కందెనొ కటా నన్నాత్మలోనుంచి తా
వాడంబాఱెను నేనె తా నగుట నాపరిద్ష్ణ సంతాప చిం
తా డోలాకలనంబు దా నెనసెనో తథ్యంబు నావంకకై
తా డస్సెన్ నవలా యటంచు నొఱగెం దల్పప్రఖానంబునన్.

చ. ఒఱగినఁ జూచి యా నృపకులోత్తము చిత్తము కూర్మికాత్మ ని
వ్వెఱపడి తాపవారకము విస్మయనీయము నింతి నెయ్యపుం
గుఱుతును నయిన నుత్కర వినూతనహారము చేరఁబోయి యా
నెఱదొర కంఠపీఠమున నిల్పితి నిల్పఁ బ్రఫుల్లనేత్రుఁడై. 95

ఉ. అబ్బలభిన్నిభుండు మణిహారముఁ దప్పక చూచి యౌర యెం
తబ్బుర మీ యమూల్యమణిహారము రాఁగతమెద్ది యొక్కొ యే
సుబ్బెతహార మొక్కొ యిది కూరిమి నేచెలి దెచ్చెనొక్కొ హా
నిబ్బరమైన తాపము జనింపమునో యిది మేను సోఁకఁగాన్. 96

శా. ఈ హారం బొకమాటు పిమ్మటికి నే నెచ్చోటనో కన్న యు
ట్లూహింబయ్యెడి నీయపూర్వమణిహారోత్తంసముం జిత్రక
న్యాహారంబు నుదారవైఖరి నొకండై తోఁచె నీ హార మా
సీహాద్రిజకన్యహార మగు సందేహంబు లేదెంతయున్. 97

## మాలినీవృత్తము.

అని విభుఁడెద నుంచున్ హార మందంద కాంచున్
గనుఁగవఁ గదియించుం గంఠపీఠిన్ ఘటించున్
దను వఖిలముఁ జేర్చుం దక్షణస్వేదధారా
ఘననయనజలంబుల్ గాఢతన్మైత్రిఁ జూపన్. 98

క. ఈ గతి నా రా జూపకం, బాగతనక్షత్రదామ మభినవకర సం
యోగమున గారవించును, రాగోపనిబద్ధబంధురంబుగఁ బల్కెన్. 99

మ. కమనీయద్యుతిధామమా విమలముక్తాదామమా సేమమా
కమలామోదకు దత్సఖీసమితికిం గల్యాణమా తన్మరా
ళమయూరీ శుకశాబశారికల కెల్లన్ భద్రమా తెల్పుమా
ప్రమదారత్నము పేరుగా నెద నినుం బాటించి ప్రార్థించెదన్. 100

మ. నిను భాగ్యాక్షరపంక్తిగాఁ దలతునో నిర్వేలమూర్ఛాపనో
దనదివ్యామృతధారగా మనమునం దర్శింతునో కాక మ
ద్ఘనపుణ్యద్రుమకోరకావలియ కా గన్గొందునో ప్రేమ నే
మని వర్ణింతు ప్రియాపయోధరవిహారా హారవంశోత్తమా.

చ. వనజముఖీకుచోపరిని వాసనుఖోన్నతి నున్కి మాని నా
మనికిత మార్చ వచ్చితివి మౌక్తికహారమ నీగుణంబు లే
మని వినుతింతు నట్టిద కదా యవదాతసువృత్తమూర్తు లెం
దును నిజసౌఖ్యభంగము గనుంగొన రార్తులఁ బ్రోచువేళలన్.

చ. చెలుల మొఱంగి నాఁడు మణిచిత్రగృహంబున మోము వాంచి తొ
య్యలి భవదేకదర్శితమదాకృతిఁ జూచెఁగదా వినీలకుం
తల హృదయంబు నీకు విదితంబుగదా యిఁక దాఁచ నేటికిన్
వెలఁదిమనంబు దెల్పఁగదవే మణిహారమ నిన్ను వేఁడెదన్.

ఉ. గ్రావసుతాపచాగ్రపరిరంభనిరుంభసుఖోపలంభ సం
భావితభావిత్కారవి మర్దన కోడకుమీ విశుద్ధము

ద్రావళ్లి బాళికానవసమానసమయోగ్య మహోపహారిక
శ్రీవెలయింతుగాని నినుఁ జిక్కులఁ బెట్టఁజూమీ రసాంబునన్,

శా. శుక్తిక్రోడకుటీకుహావసతి నై సూచ్యగ్రసంస్థాయి నై
ముక్తాహారము నై భజించితి గదా ముగ్ధానవద్యాంగ్యసం
సక్తిం బాదృశభూతి తావకకృపా సంసిద్ధి లే కబ్బునే
ముక్తాహారత నన్ను యంత నెత్తలం బ్రోల్ నింపు నాకింపుగాన్.

చ. చిన్నటనాటనుండియును జెల్వను గూర్చినదాన నాట నేఁ
జెన్నక కేక... దద్యథను నీవును గుందితి గాఁ సఖుఁడా
ప్యన్నతరత్నమాలికయ యోనిని మచ్ఛమకీక పుత్రియో
పిన్న వసుంధసారముల చేఁ దెలి వొందఁగఁ జేయు మెన్నఁడో.

మ. అని రాజేంద్రుఁడు రత్నపుత్త్రిఁ గని యీ హారాధిరాజంబుఁ జె
ప్పిన యాయ్యప్రతిమోపకారసుకృతశ్రీ గణ్యదాక్షిణ్యశా
లిని నీకుం బ్రతిమాపదేశ మిఁక నే లే పల్కవే సన్నిధిన్
వనితా నష్టభజీవితంబులఁ సఖీ వాక్యసిద్ధితంబుల్ గదె. 197

సీ. అన విని రఘునంద నుని సన్నిధిఁ బ్రభూత, చైతన్యయై నిల్చి చట్టుపొలఁతి
కరణి రత్నపుబొమ్మ గతి మాని ద్యుతిపూని, క్షితిజానికి జోహారు చేసి నిలిచి
కలికితి నో మహాభాగ తావకమహా, మహితోక్తి దప్పునే మంజువాణి
నచలకన్యక బోటి నగుదుఁ గన్నియయయుని, దెలుపవచ్చితిగదా తెలుపనిట్లు

తే. పంచశరశాతశరహేతి పాలుచేసి, తిరిగి చూడవు దగునయ్య దొరలకెందు
మఱపుగలిగిన ననదల మఱతురయ్య, వెలఁది దూఱిన దూఱులు వినఁగదయ్య.

ఉ. తావకశైలభేదనకథావిరుదాంకము లేమి పేర్కొనం
దా విని మెచ్చనూర్చి వని తావణి నిత్యకఠోరముల్ గల
గ్రావము లంద్రు వానిఁ బద ఘట్టన గీటడఁగించినట్టి గో
త్రావరుఁ డింక నేమిటఁ గరం గునయో యనినించు బాష్పముల్.

మ. జనలోకస్పృహణీయభవ్యసుషమా సౌభాగ్యముల్ భాగ్యవ
జ్జనభోగానుగుణత్వముం దదితరానిత్యదైన్య వ్యథా
జనకత్వంబును గల్గఁ జూచియు ధరా జంభారి కంభోజజుం
డొనర్చెన్ వసునామమంచు నవలా యూహించు మోహంబునన్.

సీ. అనుగుదమ్ములఁబాసి కనుసన్నల మెలంగు, నిందిర తృణముగా నెంచు ననిన
గూర్మాసనాభ్యాస కర్మఠయై భజిం, చు ధరిత్రిఁ జాలుకగా జూచు ననిప

ఉ. మన్ననబోఁటి నేఁటిరుసు మాపు మహేంద్రభుజిష్య వచ్చి తా
నన్నియుఁ జెప్పె నింద్రుఁడు మదాశయ మాత్మ నెఱింగి భక్తినం
పన్నతఁ బాణిపీడనశుభం బొనగూర్చుటకై వరోత్తముం
గన్నియ వేఁడ వచ్చునఁట కౌతుకసాంద్రమునీంద్రకోటితోన్.

క. అచ్చెలి తియ్యనిశుభ, వాచావిభవంబు విన్న వాఁడనయి సుమీ
వాచాలమదన గుణనా, రాచాగ్ఛటి కోర్చినాఁడ బ్రాణంబులతోన్.

ఉ. ఈశుభవార్తమీచెలియ కిప్పుడుపోయి యెఱుంగఁ జెప్పి కా
మాశుగపీడితంబులగు ప్రాణము లూఁకడిలంగఁ జేయు మో
పేశలవాణియంచు నను బేర్కొని యీమహితాంగుళీయము
క్ష్మేశుఁ డొసంగి వీడ్కొలిపె నేను వచ్చితి నీక్షణంబునన్.

చ. అని యఖిలంబుఁ జెప్పి రమణాంగుళిముద్రిక మంజువాణి యి
చ్చిన నవలా విలాసమునఁ జేకొని కైశ్యపగాఢపద్ధతిం
దనరఁగఁ జేయు నేత్రనలినంబుల నొత్తు ఘటించు నున్నత
స్తనయుగళీరథాంగములఁ దద్రవి తేజము సేకతంబునన్. 122

ఉ. మున్నుగ నన్నగాత్మజను ముద్రికపైఁ బతిపేరు సూడఁదోఁ
చెన్నుపుఁ జూచినట్లు నను సిగ్గు తదూర్మిక వ్రేలఁ బూనభా
గ్యోన్నతిఁ దత్కరగ్రహ మహోత్సవమప్పుడె కాంచినట్లుమిం
చెన్నదకాంతివిభ్రమ విశేషసంభ్రమ వైభవోన్నతుల్.

సీ. ఒకనాఁడు చూచె బాలిక నిలాపతియంచు, బతియంచు దనకు నప్పార్థివేంద్రు
నతివ గోరఁగ మించె నంగజానల మంచు, నలమంచు చాయవాఁ డబల నేఁచ
నుర్వీశుకడకేఁగె నొకబోఁటి కొమ్మంచుఁ గొమ్మంచు నతఁడును గుఱుతొసంగి
చెలియతోఁ దెలిపెదో య్యాలిమీఁది తమియంచుఁ, దమియంచుమట్టునం తనె బలారి

తే. వచ్చునఁటవిందునకునిందు వనితవడుగ, ననుచు ననుచు వయస్యలా ద్యంతమును నె
ఱుంగఁ జెప్పిన విని మహాభంగగరిమఁ, బొంగెజనయిత్రి మిన్నంద భూమిధరము.

చ. అపు డరవిందగంధి హృదయాంబుజఖేద మడంపవచ్చితో
రపురుచితో వెలుంగు వసు రాజకరోర్మికఁ గాంచి భీతిమై
జపలవిలోచనం బొదుచ జాలక తారభటాలితో నిశా
ధిపునిబలంబు లేగిన గతిన్ రహిఁ బీడెను బాండుచంద్రికల్.

మ. ఒకనాఁ డింద్రునియంతవేలుపు దుడీ యోక్తిన్ విడంబించి తా
నొకకాలం బెఱిఁగింప వచ్చి మునికాపోద్వృత్తిపాలయ్యె మా

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁ దాల్చినపాండురకోరకాండముల్
క్రమ్మనిమీలితచ్ఛదపరంపరచే ప్రసవాప్తివేళ రా
నిమ్మగ వాని నొయ్య విరియించిన హేతుగుణాప్తి బాంధవ
గ్రమ్ముల నేఁమ లేటి పిలుకల్ వెడలెన్ సహజాసితచ్ఛవిన్. 134

చ. సమయమహర్షి బోధగుణశాలి మహోదయభూమభృద్వ్రతం
సమునకుఁ బ్రాగ్వధూటియెడఁ జక్రహితుండు నశేషదేవతాం
శము నగు సూనునిం దలఁచి సాంధ్యమహోమయహోమవహ్నిదీ
ప్తముగ నొనర్చెఁ దారచరుభక్తశతాహుతిపూర్వకంబుగాన్.

మ. కుముదాధారవిహారముల్ కమల కన్గోఁజాల కంభోజగే
హము మూయం దెఱపింతు వేగ నని వామాలోకమున్ మాటియా
సమయోపేంద్రుఁడు దక్షిణాక్షిఁ దెఱచెన్ సంజాతరాగానుబం
ధముతో నావిధుఁ డేగెఁ బ్రొద్దుపొడిచెన్ బంధూకబంధుచ్ఛవిన్.

శా. ఓచామీకరచారుగాత్రి నినుఁ గోత్రోత్తంసమున్ వేఁడి నే
డాచేదిక్షితిపాలశేఖరునితో హత్తింపగా వచ్చు త
త్ప్రాచీభర్తకు బట్టుపట్టుగొడుగై భానుండు దోపం బ్రభా
వీచుల్ తద్గతరత్నగుచ్ఛముల కీ విం బొల్చె బ్రాంతంబునన్.

క. అని విన్నవించుటయుఁ గ్రొ, న్ననపానుపుడిగి ప్రసన్ననలినానన దా
ననఘ దినాననకృత్యము, లొనరించి గురున్ భజించి యుండెం బ్రీతిన్.

## ఆశ్వాసాంతము

మ. అధరీభూతజయంతకాంతకుసుమాకారా! రాకారజ
న్యధికోత్తేజితరాజబింబరుచిధారాధార! రాధారమ
ణ్యధినాథాంఘ్రిసరోరుహద్వితయసేవాచార! వాచారమా
మధురాశేషవిశేషభూషిత సుధీమందారమందారతా. 139

క. అబ్రాశిధీరధీరచి, తబ్రాహ్మీమథనవివేక తరుణచరణ భా
గిబ్రాహ్మశరణ సకలక, వుబ్రామాభరణకరణ గుణసంభరణా. 140

## మాలిని

పరిచితకరవాటీ ప్రాప్తకర్పూరవీటీ, విరతకటకలాటీ విశ్రుతస్వర్ణఘాటీ
స్థిరవిజయకిరీటీ తిమ్మమాగర్భశాటీ, వరమణినిభఘాటీ వల్గుధారాటఘోటీ

## గద్యము

ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబనుమహాప్రబంధమునందు

జతుర్థాశ్వాసము.



శ్రీ గురుభ్యో నమః

# వసుచరిత్రము

## పంచమాశ్వాసము



శ్రీసద్మశ వేంగళాంబా, భాసుర రక్షాంఘ్రి శంఖ పద్మ శుభాంక
ప్రాసాద కేళిరసిక సు, ధీ సన్నుతగుణవిరాజి తిరుమలరాయా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిల మును, లింద్రునకు రౌమహర్షణి యిట్టులనియె
నాత్మకన్యోపలాలనాయత్త హృదయుఁ, డై హిమాహార్యసుతు డున్న యవసరమున.

సీ. తొలువొల్త బారిజాతలతాంతమాలికా, పవనంబు ఘుమ్మనఁ బరిమళించె
నావెన్క నాకాండి కాభ్రగర్జాస్ఫుటి, బుధదుందుభుల్ ఘుభుంఘుమనియె
నాపిమ్మట వియచ్చరీపాణిపల్లకీ, గుంభస్వరంబులు ఘుమ్మురనియె
నాపిదప నఖండమై దండిమై నొక్క, దివ్యతేజము దిగ్దిగ వెలింగెఁ

తే. జనుల కొక కొంతసేపునకును విమాన, పంక్తియనియును వీరు దిక్పాలురనియు
మునులనియు లేఖభామిను లనియు నవనిఁ, గలజనుల కద్భుతంబుగాఁ గానవచ్చె.

క. హరిముఖ హరిసేనానుల, హరిహయ సామజవిమాన హరిహరిణాక్షీ
హరిముఖ ముఖులను దోఁపఁగ, హరిహరి యంబరము చిత్రమై విలసిల్లెన్. 4

మ. ప్రబలాకారముతో గిరీశశిరముం బ్రాపింపఁ జేస్తాఁగ నాఁ
గ బెడంగయ్యె జనాపనావ మిది యుక్తంబౌనె నాకంచుఁ దా
నబలాకారముఁ బూనిచయ్యన గిరీశావాప్తికిన్ వచ్చెనన్
విబుధేంద్రాపగ పద్మపాదపదవీ విన్యస్త భృంగాక్షియై. 5

సీ. తవిలియక్షపులాయితమున బోదనఁజూపు, నోజ జేజేరాచ తేజి డిగియెఁ
దుళకించు మొగ్రేలఁ దలవంచుకొన్నవ, న్నియ మిఱిఁ వేల్పుకన్నియ మెడిగిరి
కరఘాతపతదబ్దఘటఁ గొమ్ముకొనఁజిమ్ము, తమిదోసెడొగ్గి చా దంతిడిగియె
రేచకాభ్యాసమునూచకాత్మియచా, తురిఁజేసి బాలవాల్గారలు డిగిరి

తే. గిరిగరుచ్ఛేదిముఖ వియచ్చరుల యుచిత, గమనకథనకటాక్ష రేఖా గుణముల
వెంబడిన దివ్యరథపదం బంబుడిగియె, వసుధ నుద్గ్రీవులై యెల్ల వారుఁ జూడ.

మ. సకలామర్త్యభటాళికిన్ భటుల నా చౌదంతికిన్ దంతిదే
జికిఁ దేజిన్ మణిబింబదంభమునఁ దా ల్చెంగాక పైవచ్చువ
జ్రికి గట్టేమియు నల్కడయ్యె వసుధా శ్రీభృన్నఖాగ్రంబు వేఁ
తకు బిట్టోర్చినగట్టుగా వెఱచునే దంభోళిభృత్కేళికిన్. 7

చ. అమరసమాగమావిలమృగౌఘవిలంఘనదీర్ణ ధాతు చూ
ర్ణము బహువర్ణరత్నశిఖరద్యుతితో నభ్ర దభ్రమార్గముం
గమిచె నగేంద్రుఁ డింద్రశుభ కార్యసమాగతి కిచ్చ మెచ్చి త
త్సముచితచాపచంచదుప దాధరుఁడై యెదురేగు కైవడిన్. 8

సీ. సరసపర్జన్యసంజ్ఞాధురంధరుఁడు రా, నారెఁ గాంతార ఘోర దావలార్చి
శతకోటిదీప్తి దీపితకరుం డరుదేరఁ, దరలె గుహాంతర ధ్వాంతరాజి
సకలజగన్నియామకుఁడు చెంగట నిల్వ, వదలె జంతుజాతి వైరవిహృతి
సతతసర్వర్తు సేవితుఁడు చెంతకుఁజేర, జనియెఁ గేకిపికాది. సమయముద్ర

తే. యమరపతి జంగమస్థావ రాభివాద, నీయచరణాంబుజుండు సన్నిధియొనర్ప
ధరణీధరరాజమునఁ గల్గు తరులతా ప, రంపరలు మించె బహుఫల ప్రసవవృష్టి.

మ. పతయాళు ప్రబలప్రపాతఝరముల్ పాద్యంబుగాఁ దిర్యగా
యతమందారతరుప్రసూనఘటనం బర్చావిధానంబుగా
నతదివ్యోపలకూటదర్శనము నా నారత్నపూజాసమా
గతిగా నింద్రున కన్నగేంద్రుఁడు నతుల్ గావించె నత్యున్నతిన్.

తే. వెండియు నగేంద్రతనయుండు వేఁడివేల్పు, మున్నుగా వేడివేల్పుల మునుల కెరఁగి
గంగనలరించి క్రమమెసఁగంగఁ గ్రతుభు, గంగనల నందఱ మృదూక్తి నాదరించి.

ఉ. నాకులదైవతంబు లల నాకులభూషణ మీలతాంగి మే
నాకులభూధరేంద్రుల యనాకుల నిర్మలభాగ్యరాశి మై
నాకులముద్దు కూతురు పినాకులకోడ లటంచుఁ దెల్పి నా
నాకుల పాలికల్ పొగడ నాకుల మ్రొక్కఁగ బంపె బాలికన్.

క. గురువనుమతి గురుకుచభృతి, సరి నవనతిఁ గాంచి నిలుచు శైలజగనగా
సురలయుని మేషభావము, హరి బహులోచనతయుం గృతార్థతఁ జెందెన్. 12

తమ్మన నున్నశుక్తిమతి రాఁగరుణించి తదీయబంధుజా
తమ్ము మదాప్తులం బిలిచి తావకమిత్రున కిమ్ము కన్నియన్. 29

చ. అనుటయుఁ దాతపార్శ్వగత యై తగునాలతకూన దాన తా
ననయము కేలి కేళినలినంబు మొనల్ నఖరాంచలంబులం
దునుముచు నుండె వజ్రధర దోరశని ప్రతిమాన మీనలాం
ఛనవిశిఖంబు లింక నఖ సాధ్యము లంచు గణించు కైవడిన్.

ఉ. అంతకు మున్న సర్వకళ లంతకమానగవైరి వాక్యముం
జెంతకు వచ్చునెచ్చెలుల చే విని పుణ్య మహాతరంగిణీ
కాంతలుఁ దాను శుక్తిమతి కౌశికుఁ గొల్వఁగ వచ్చె దేవతా
సంతతి యాత్మ నాత్మశుభ సంతతికల్మికి సంతసిల్లఁగాన్. 31

సీ. అమృతమూర్తి వహించు హరజటాసంభవ, సుమనోమణుల బ్రోచు సోమకన్య
ధరనుద్ధరించు భూధరరాజ తనూజ, తమమెల్ల వారించు తపనపుత్రి
కాలవైషమ్యమ్ముఁ గడపు రుద్రాంఘ్రిజ, చలువలు వెదజల్లు మలయదుహిత
యభవసాధనరత్న మగు పినాకోత్పన్న, యార్యాప్తి నెసఁగు శీతాద్రిజాత

తే. మఱియుఁ దక్కిన పుణ్యనిమ్నగలు మరుద, ధీశ భవ్య నిదేశాపదేశమున ని
జాప్తశుక్తిమతీతనయావివాహ, మహమునకు వచ్చి రాత్మీయ మహిమ మెఱసి

శా. ఉత్సాహంబున నిట్లు సైకతటినీ వ్యూహంబు లేతేరఁగా
వత్సాళిన్ వెనుకొన్న గోగణము లే వన్ వచ్చెదోడ్డో మహీ
భృత్సందోహ మభంగశృంగములు నా పీనస్తనాంచన్నితం
బోత్సేధంబు వృషోపసర్పణవిధాయోగ్యక్రమంబున్ దగన్. 33

సీ. అజ్ఞాతగోత్ర య నాదిశక్తిమగోత్ర, భవయయ్యె నితని గర్భమున బుట్టి
యాదిభిక్షుండు దుర్గాధ్యక్షుడయ్యె నీ, తనిపాదతీర్థ మాదల ధరించి
మితతేజుఁడగుజగన్మిత్రుఁ డుత్కటవసు, స్థితినొందె నీతని దిక్కుఁ జేరి
కులమువా రభిరామ గోరత్నములఁ గాంచి, రితని శేషంబున కిచ్చగించి

తే. తన కొకమఖాంశ మొసగు న య్యనిమిషులకు
ననవరతయాగభాగ భోజనము లొసఁగి
యితఁ డపర్ణైకగురుఁడన నెసఁగు ననుచు
నాకులు నుతింప వచ్చె మేనాకుటుంబి.

తే. ఆవడకు మెట్టదొరకు హస్తావలంబ, మగుచు మేనక వచ్చె భవ్యగుణమంజి
మనమురాళి మానసమున మునమరాళి, మనమరాలివివాహ సంభ్రమముఁ జూడ.

సీ. పిడుగు కైదువు పెట్టు తడకట్టుగాఁ బయో, ధి మహామందిరంబు చమరెననఁగఁ
గడవి కరళ్ళ రాయిడి గీడ్పడి తటాంత, వనరాజి మైసంట వాలె ననగ
మున్నీటిపెన్నీటి ముదురుచిల్వలయల, జడిఁ బచ్చలజోడు వొడిగె ననఁగ
దనకుందనపుఁజాయ పెనునీటిమప్పుక, ప్పెనవెన పసఁబస రెక్కవనగ

తే. సంతతజలాంతరాళసంస్థానమహిమఁ, బ్రాచిపట్టిన మేనితో బయలు మెఱసి
వచ్చెవలిగట్టు తొలిపట్టి వాసవాది, వాహిత నిజానుజభవాబ్ధి వాహమునకు.

చ. ఇరువురు దేవసంభరణు లిర్వురు నబ్జదళోన్నమత్కరాం
తరమహనీయు లిర్వురు నవంతగుణాఢ్యులు గావుఁ గం బర
స్ఫురసమతాసమగ్రతర సఖ్యనుగంగ గకూడి మేరుమం
దరధరణీధరాన్వయవతంసులు వచ్చిరి తత్క్షణంబునన్.

ఉ. రోహణ శైలరాజము మరుద్గిరి తోడనె వచ్చి నిచ్చె వై
వాహిక కార్యకర్తృ మఖవంతుఁ డనంతసువర్ణరత్నసం
దోహము రాశి వోసి విబుధుల్ మనుజుల్ భుజగుల్ నుతింపగా
నాహిమవత్కుమారతన యామణి కుంకువ దెచ్చెనోయనన్. 38

మ. మఱియున్ వచ్చిరి ధాత్రి గల్గువగసామ్రాజ్యైకధౌరేయులం
దఱుఁ దద్భూరిభరార్తి గ్రుంగు నవనిం దామ్యత్ఫణారాజిఁ బ
ల్మఱు సంధించుచునుండెఁ గాని వనుకల్యాణంబు వీక్షింప రా
వెఱచెన్ శేషుఁడు శేషవృత్తిగనె విస్రంభసంచారముల్.

ఉ. వచ్చిన సింధుకాంతల నవారిత సత్కరుణాభివృద్ధిచే
పొచ్చెఁగఁ జేసి గోత్రశిఖరీంద్రుల నున్నతి గారవించి పై
యచ్చగళోకభర్తయు హిమాలయసూతికి నాస్పదంబుగా
నచ్చట నొక్కనూతన మహానగరంబు మదిందలంచినన్.

సీ. నిమ్న ప్రపాతాంత నిర్ఝరపరిఖతో, గనుపట్టె గోటయై కటకపరిధి
మణిచిత్రకిరణతోరణమాలికలతోఁ బ్ర, కాశించె గృహములై గహ్వరములు
శుచికరోపలభంగ సోపానసరణితో, జెలగె సౌధాళియై శిఖరపాళి
ఘనసారవనసార గంధసారములతో, నలరె నగండులై తటాజిరములు

తే. కలమధుర కోకిలాలాప కవలతోడ, జెన్నలరెఁ గన్నెలై కొన్ని చిన్నిలతలు
సమధికస్కంధ శాఖాభుజములతోడఁ దనరెఁ దరుణాగ్రగణ్యులై తరువులెల్ల.

ఉ. ధాతుపరాగ రక్తియును దంతవిభక్తియుఁ జామరప్రకా
శాతిశయంబు సంగలదు దాంకనముం గదళీకదంబసం
భూతియుఁ గర్బురాకృతియుఁ బుష్కరభూతియు బూనిభద్రతా
ఖ్యాతి వహించె మించెఁ బృదు గండములచ్చటనద్భుతంబుగాన్.

ఉ. జాతికిసెల్ల రాజపరిచర్యయు గాలికి నెక్కుడన్న వి
ఖ్యాతియు రా గురంగములు గట్టున నేమితపం బొనర్చెనో
యాతతశృంగభారరహితాత్మమహాసుఖకాంతితాప్తి నా
రా తనరారె నన్నియుఁదు రంగములై తదభీష్టసంపదన్. 43

చ. హరిపర తంత్రవృత్తియు మహామణిచాప శరానుబంధ బం
ధురతయు రాజహంసకవినోదనముం బవిఘోషఘుర్ఘురి
స్వరమును జిత్రవిగ్రహవిశంకటభావముఁ బూనిశైలరా
ట్పురివరదంబులై శరదముల్ నెరసెం జపలాంనుసంపదన్. 44

చ. గిరివర ఘోరకందరలఁ గేవలవన్యగజైక వృత్తిచేఁ
దరలక యున్నసత్కృతము తప్పనె యప్పురి కేసరుల్ నృకే
సరు లయిపూర్ణపౌరుషవిశాలత మించె మహానృకేసరిం
బరువడి మార్మృగం బిడమి భక్తుని బ్రోవ సటల్ ఘటింపమిన్

సీ. విపులవప్రంబులు విప్రవరావాస, వాటముల్ కల్యాణ కూటములును
భూదారవర్గముల్ భూరిశంచుకిద్గి, హరిరాజతతులు యూథాధిపతులు
శ్యామాసమాజముల్ సామోదవిటపప్ర, కాండముల్ సరసుల తండములును
నిర్జరసౌధముల్ నిరుపమగణికావినోదముల్ వంశీని నాదములును

తే. గలుగుఁగాకేమి నగములఁ గలుగు టరుదె
కలయ నివియెల్ల నిజనామ గరిమ వదల
కచట నుచితార్థగతిఁ బూను టరిది గాక
యనఁగ హరికృప బట్టనం బయ్యె వనము.

మ. ఘనఘోషార్భటియున్ సమీరణముఖాఘాతాహితానాహత
స్వననానానుషిరావళీఘుమఘుమవ్యాపారముం గిన్నరీ
నినదంబు గలకంఠికారవసుధానిష్ఠ్యూతియున్ ఝుర్ఝరా
ఘనినాదంబును నందుఁ గ్రందుకొనుచుం గప్పెం గకుప్పాళికన్.

మ. అగురుక్షోదపటీరభేద ఘనసారామోదసంభేదము
ల్మృగనాభిద్రవచర్చికల్ వికచమల్లీమాలికల్ కీరరా

జగదుద్రాజివిరాజితోరణము లం చచ్చామరంబుల్ ధగ
ద్ధగితామూల్యమణీవితానకములుం దద్భూమిఁ బొల్చెందగన్.

సీ. పద్మినీనవపాత్ర పాళికానీతగం, ధరజంబు లాశవంకఁ దావులీన
పరివర్ణినీవర్గ పరికల్పితాంగరా, గవిశేష మొకచాయఁ గడలుకొనఁగ
రంభోరు కాండోత్క రపురోముఖన్యస్త, ఫలజాత మొకదెస బరిఢవిల్ల
బూగీసుకంధరా పుంఖితక్రముకతాం, బూలీదళములొక్క పొంత నెసఁగ

తే. మిత్రకాంతాభిలక్షితా రాత్రికములు, శ్రుతిహిత ద్విజకామినీ సుస్వరములు
మృగవిశాలేక్షణాదత్త మృగమదములు, బలసి యందు శుభార్థమై భవము దెలుప

చ. కనుఁగొని కన్నె నెచ్చెలులు కాననదేవత లాయహార్యశా
సనవసువాసవప్రబల సఖ్యము నాత్మమనోరథద్రుమా
తనఫలపాక రేఖయు ముదంబున నెన్నుచుఁ బుణ్యవాహినీ
వనితలుఁ దారు సామయిక వైభవముల్ సమకూర్చునంతటన్.

క. ఈరే యొకశుభగ్నం, బీరే వివరించి వరున కింతికి గుశలం
బీరే యన వాచస్పతి, యీరేడుజగంబు లేలు నేలికఁ బలికెన్. 51

శా. సూర్యాదిగ్రహతారకా తదధిప స్తోమంబుతో నిట్టి స
త్కార్యం బీవు భరింప శోభ నముహూర్తధ్యేయపుణ్యాపగా
హార్యస్వాములు పెండ్లిపెద్దలయి రా నస్మత్కృతాచార్యకం
బార్యప్రస్తుతమై వధూవరులక త్యైశ్వర్యమీఁ జాలదే.

చ. అళిఘట మీనకేసరి కశ రాసన గో మకరంబులంగచం
బులఁ గుచ నేత్రమధ్యముల భ్రూకటి జంఘికలన్ జయించి ని
స్తులత నిజాంగనాధికయశోనిధియైనయవక్రవృత్తికిం
గలికికి నియ్యెడన్ మిథున కల్పన యోగ్యమటంచుబల్కినన్. 53

శా. ఆచార్యోదితలగ్నమంగళ మహార్య స్వామికిం దెల్పియా
ప్రాచీపాలుఁడు చేదిభర్త కెఱిఁగిం పన్ వచ్చెఁ జెంచత్ప్రతా
కాచాంచల్యము కార్యసిద్ధియు సుకీ గానంబు కల్యాణ చ
ర్యాచారంబును దూర్యఘోషమువరా హ్వానంబుసూచింపగన్.

ఉ. నిండుమనంబునఁ దనమ నీషితమెల్ల ఘటింపవచ్చునా
ఖండలురాక చారణము ఖంబున మున్నయెఱింగి చేదిభూ

మండలభర్తఁ గాంచె నతి మాత్రముదం బది యెంచఁ జిత్రమే
కొండలఁ బిండిసేయు శత కోటియుతుండు హితుండు గల్గినన్.

తే. రత్నకూటవిహారగారవమె కాని, యెందుఁ గుసృష్టి యొంటఁగని యింద్రుపదము
లపుడు నిజమౌళిరత్నకూటాగ్రసరణిఁ, గూర్చెనుచితంబుగా వసుక్షోణిభర్త.

క. అడుగుల కెరగిన పెండిలి, కొడుకవు గమ్మనుచు బలిమి కొని వజ్రిముదం
బడర నొడలెల్ల గన్నులు, గడలుకొనం జూచి యవని కాంతుని బలికెన్.

ఉ. నిన్నటిమాపు మాపురము నీ రమణీయ సభావిభాగ భా
గున్నతరత్నపీఠిఁ గొలువుండి సురాంగన లాడఁ గిన్నరుల్
కిన్నరమీటి పాడఁ దిలకించుచు నియ్యెడ కేల రాఁడొకో
మన్నిరవద్యమిత్రుఁడని మక్కువమీఱ నినుం దలంచితిన్.

క. తలఁచి భవనీయమానస, తలచింత యొఱంగి యెంత తలఁకెనొకో నా
చెలి పేరామని చెలికిం, గలువలచెలి కనుచు నిదుర కంటికిరామిన్. 59

ఉ. అంబకపంచకంబు గల యం బచరించుచు నంబకత్రయా
డంబరశాలిచే గడు విడంబితుఁడైనయనంగు డాసహ
స్రాంబక బాంధవుం డెనకి యారడిఁ బెట్టెడివాఁడె యంచుఁ జి
త్తంబునఁ దావకాంగభవ తాపనివారణ తత్పరుండనై.

ఉ. ప్రొద్దున వచ్చి శీతనగ పుత్రుని గన్నియ వేఁడి గట్టురా
పెద్దలఁ బుణ్యవాహినుల పెండ్లికి రా నియమించి నీవు న
మ్ముద్దులకన్నె నిచ్చునగ ముఖ్యున కొక్కపురీలలామకం
బుద్ధవిడిన్ సృజించి మును హర్తము నేఁడె యొనర్ రయంబునన్.

శా. గంధర్వానకదుందుభిధ్వనులతో గంగాది సాధ్వీరమా
బంధు శ్రీ పరిణీతి గానములతో భవ్యద్విజాశీర్వచ
స్సంధానంబులతో నగేంద్రతనయా సాంద్రానురాగద్విప
స్కంధారూఢుని నిన్నుఁ బెండ్లికొడుకుం గావింపఁగా వచ్చితిన్.

చ. అనిన మహేంద్రు నానతి ముఖానతిఁ గాంచు నుహీమహేంద్రు నె
మ్మనము నవంబుగా నెఱిఁగి మంత్రి పురోహిత దండనాథ శా
సనధరు లాత్మణంబ శుభ సంభ్రమ సన్నహనానులాపముల్
మొనపఁగ నమ్మహానగర ముం గైసేయఁగఁ బంచి రెంతయున్.

సీ. పన్నిరిమేరువుల్ బహుసంఖ్యల గొలందిఁ, జంద్రసూర్యాకల్ప శతముతోడ
నాటిరి హరిచందనగంబు లెన్నేని యధికాయమానరంభాళితోడ
సవరించి రింద్రరత్నవితానములఁ బెక్కు, వజ్రకూటప్రభావళులతోడ
నిలిపిరి చిత్రరేఖలఁ జాలఁ మితిమీఱ, నతులహేమాకృతి ప్రతతితోడ

తే. గట్టి రగణితపుండరీకవ్రజంబు, తగునెడ ననంతకుసుమసంతతులతోడ
వాసవపురస్థితానేక వస్తుమహిమఁ, జూచి వాసవపురివారు చోద్యమంద

చ. పరిణతదివ్యగంధ ఫల భారనమత్కదళీపరంపరా
పరివృతకాయమానముల బర్వ్యఫలావళిఁ జూచి పైపయిం
బరిగొని వచ్చు రాజశుక పంక్తులచొప్పున నొప్పెనప్పుడ
స్వరవిపణి ప్రఘాణముల భూరిహరిన్మణి తోరణావలుల్.

చ. పసిఁడికురుంజాలకన్ మెలఁగు బంగరుబొమ్మలఁ జూచు దేవతా
ప్రసవ సుగంధులన్ ధ్వజపరంపరఁ బిల్చి వివాహపీఠికా
విసర మొసంగ నెత్తునను వీరపురేందిర బాహులోయనన్.
లసదహివల్లికామృత ఫలక్రముకంబులు నాటి రెల్లెడన్

చ. హిమసలిలాభిషిక్తయును హేమపటావృతయుం బటీరకుం
కుమ రవలిప్తయుం గుసుమగుంభితయున్ నవధూపధూమసం
భ్రమపరిజృంభమాణశిఖి బర్హశిరోజయునై యొసంగె భూ
రమణపురాధిదేవత హిరణ్మయదర్పణదీప్యమానయై

ఉ. కాంచనపత్రికావళుల గౌతుకసూచకవాచికంబు వ్రా
యించి సమస్తదేశవసుధేశుల కంచిన వారు మాళి సం
ధించి సువర్ణపట్టభృతి నేఁడుగదా మన కంచుఁ దెచ్చి ర
భ్యంచితపత్రయోగ్య నవ హాటక పుష్ప ఫలోపహారముల్.

సీ. వైణికవల్లకీ శ్రేణి నిమ్ముల మీటె, గాయకగాంధర్వ గమక రేఖ
గాంధర్వ గమకరేఖఁ బరాహతము చేసె, వాంశికవంశికా వైభవంబు
వాంశికవంశికా వైభవం బెగసూఁదెఁ, దాళికాధరకర తాళగరిమ
కరతాళగరిమంబు కంచుమించుగనొత్తె, నానద్ధచటుల తూర్యవ్రజంబు

తే. చటుల తూర్యవ్రజమునంటఁ జఱచెఁబరిణ, యాగతదిగంత నృపతి నాగాశ్వరథప
దాతికోలాహలంబు రోదసి నఖండ, మగుచు నాదాత్మకబ్రహ్మ మతిశయిల్ల.

క. పూగీమనుమతి సప్తవతి, హారిమధ్యలు దెచ్చి గరిది హాలివాణములన్
హారితశతపర్వికాఫల, హారిచందనవీటికాళుభాక్షతవితతిన్. 70

చ. అమితేలసౌమ్యమావనిల యస్ఫురణంబును సాతిమాత్రతా
రకమరివర్తనంబు శుభ రాగమిళత్పరపల్లవాంకము
ద్రికయును బెంపుమీఱ నజ దృష్టుల బోలిన సింధుకన్యకా
ప్రకటనివాహగీతికలఁ బాడిరి పుణ్యపురంధ్రికామణుల్. 71

## పృథ్వీవృత్తము

సుపర్వగణికామణి స్ఫురణతో సుధారమ్య పా
త్రపాలికలతో శుభార్ద్ర మగు వేలుపుటాఁమ్రినితో
నృపాలగృహసీమఁ జె న్నెహరిరాణి రామాసుధా
సుపాత్రతరమాత్రవత్స్వరపదర్ప మల్పంబుగాన్. 71

ఉ. మజ్జగ మేలువేల్పు తల మోసలనుండి వివాహ యత్నమున్
సజ్జ మొనర్ప నాతనిప్రసాద మెఱింగి సురాంగనాజనం
బుజ్జగతి మహేంద్రుశిర సంట నలుంగిడ బుజ్జవంబునన్
మజ్జనమార్పఁగల్పకము నంబులు గూర్పఁగడంగి రయ్యెడన్. 72

సీ. ఈరాజుఁ గరమొప్పఁ జేరి సేవలు సేయఁ, దరి తారసిలెఁగదే తార యనుచు
రాజమాత్రుఁడె దరేంద్రస్వామి యితనిపై, నంటు మైనంటు మేనక యటంచు
నీ సర్వమంగళావాసునిశిర సంట, శశిరేఖ నీవ పోజాణ వనుచుఁ
గమనీయగతిఁ దిలోత్తమ సేర్చుఁగాక నా, నియ్యయంట నెవ్వారు నేర్తు ననుచుఁ
తే. బరమవసు సంవహనలీలఁ బరిఢవిల్ల, రత్నమంజరి నీవ నేర్పరి వటంచు
నతిచటులచాటుచతురోక్తు లాడుకొనుచుఁ,గదిసి తత్స్థలమున శుభాక్షతములుం నుప.

చ. తఱు లరనిక్కఁ బూఁతె నెఱ తావియచిక్కు నపాంగమాలికల్
మెఱుఁగులుగ్రక్క నూరుపుల మేల్మిఁ దేటులుసోక్క హారముల్
కఱుచలఁద్రొక్క ముంగురులు క్రొం జెమటంబదనెక్క వేలుపుం
జెఱవ యొకర్తు చేదిజగతీపతికిన్ శిరసంటె వేడుకన్. 75

సీ. భ్రమరకంబుల చిక్కు వాపవే యన నింక, భ్రమరకంబులచిక్కు వాయుననుచు
బృథులకుచంబు లుబ్బింపకేయనఁ బృథు,లకుచ ప్రకాశకాలం బటంచుఁ
గర గెంబో వరతిలకంబన సుస్నేహ, కలవఁ గరఁగు వరతిలక మనుచుఁ
గడు మెఱయింపకే కటకంబులన ప్రోయఁ, గటకముల్ శుభయత్న గరిమ ననుచు
తే. జెలిపలుకు గేరడించుచుఁ జికిలిగోళ్ళ, సొగసుసోఁకులఁ గళలు నించుచు మెఱుంగు
ముంగురులు గూడదువ్వుచు ముడికిఁదార్చి, మజ్జనపువేళ తడవేల మహీపయనుఁడు

తే. సింహగతిమీఱు వసురాజు చెంతనొక్క, తోయధరవేణి పాదముల్ కడిచిమెట్టు
వెట్ట నొకకన్యహస్త మర్పింపవచ్చె, సలిలభవనంబునకుఁ బ్రజోత్సవము మెఱయ.

ఉ. పతి యభిషేకవేళఁ గర భావితకుంభకురంగభృన్మణి
ప్రతిమలు నిర్జరీసుముఖ భావముఁ గన్గొని నీరువంచి య
య్యతివలు సిగ్గునం గనలి యాస్యము వంచిన నూరకుండె న
ప్రతిమరసజ్ఞ రత్నపరిపాకము లిట్టివకావె ధామణిన్. 73

మ. ఘనచాంపేయకవాసనా వివశభృంగశ్రేణిఁ జేపట్టి చ
ల్లనివ్రాఁదేనియ చల్లి తేర్చుమగువేళాలక్ష్మియో నాఁగ సో
గ సెఱుల్ సంపెఁగనూనె నిగ్గుపడలంగాఁ బై పయిన్ దువ్వి నే
ర్పున గంధామలకంబు పెట్టె నొకయంభోజాక్షి భూజానికిన్. 78

చ. కరముల నుజ్జ్వలాభినవ కైరిక కుంభము లంటఁగూర్చి పు
ష్కరములు కంకణప్రకర సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీభరణ సమ్మదశాలికిఁ బద్మినీవరం
పర పరమానురాగమున మజ్జనమార్చెఁ బయోగృహంబునన్. 80

చ. పదఁతి యొకర్తు చెందిరిక పావడఁ బైతడి యొత్తివైవ ను
గ్గడితపుజీబునేత్ర మొక కామిని గట్ట నొసంగ సంజకెం
పెడలిచి నిండువెన్నెల వహించి శయోనిధిమండలంబు వె
ల్వడునుడురాజు నావలకళానిధి యంబుగృహంబు వెల్వడన్.

తే. నవనవావర్తమండలోన్నమిత కద్రు, విద్రుమంబులఁ ద్రిప్పు సాముద్రభద్ర
విమలతరవీచికలచంద మమర నమర, రమణులెత్తిరి మంగళారాత్రికములు.

శా. అంభోజేక్షణువక్షమోయన శుభాంకాలంకృతంబున్ జతుః
స్తంభశ్రీకరవైభవాన్వితము భద్రశ్రీకృతామోదమున్
శుంభన్నూతన వైజయంతికమునై శోభిల్లు వైవాహికా
రంభస్థాపితవేదిఁ జెందె వసురాడ్రత్నంబు భవ్యోన్నతిన్. 83

సీ. ఆగిరిజాసక్తు నొడల తడియార్చె, నొకశరద్రమ్యరాజోజ్జ్వలాస్య
యారాజహంసుపై నడరించె మృగమదజలా, ర్ద్రానిలం బొక మానసాభిరామ
యామోహనాగ్రణి కలరు లందిచ్చె నొ, క్కలతానిభాత్యంత కోమలాంగి
యాజగజ్జీవను నలరించె వరగంధ, పరిలేపమున నొక్క సురభిచరిత
తే. ఘటిత ఘనకంకణ శుభాంక గరిమ దాల్చె, నాయగణ్యలావణ్య రత్నాకరునకు
బహువిధామూల్య మణికలాపంబు లునిచె, నిర్మలస్వాతి నిధియొకర్తు

చ. ఘనఘనసారచర్చితిలకంబు వహించి నిధీశదత్తనూ
తనమకుటంబు దాల్చె వసుధాపతి వక్రవతంసఖండచం
ద్రుని దిగఁద్రోచి యక్షయశిరోమణి భావవిభాసమానునా
యనుమ భాను భానుఁ దన యౌదలఁ బూను మహేశు కైవడిన్.

మ. వసురాజన్య కిరీటపీఠి ననఘ స్వర్లోక వాస్తవ్య భ
వ్యపతీకల్పిత కల్పధామఘటితం బై ముత్తెపుంబాసికం
బెసఁగెం గాంచన శైలరోహణ మహాశృంగంబుపై నుద్భవిం
చు సురద్వీపవతీత్రిరూపవిపుల స్రోతోవిశేషంబనన్. ౮౮

ఉ. క్షోణిబలారికిన్ బలని షూదనదత్తములైన గొప్పక
ట్టాణి సుపాణియొంటు లలరారె నగాత్మజ లక్షణంబు శ
ర్వాణికి శక్రురాణికిని వాణికిఁ గానమటంచు నాఘన
శ్రోణివిధంబు దెల్ప గురుశుక్రులు వీనుల నేరిరో యనన్.

మ. వెలిదీవిం దెలిబావిలో నమృతమున్ వేత్రాపి దివ్యాంబుదం
బులు వర్షింప సుధాబ్ధిలోఁ బొడము బల్పూసల్ ఘటింపన్ సుధా
గుళికానిర్మలహార మయ్యెనిది గైకొ మ్మాయురారోగ్యముల్
గలుఁగుఁగా నీకని యబ్ధినాథుఁ డొకముక్తాహార మర్పించినన్.

ఉ. మానవనాథుఁ డయ్యమృత మౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాభజన భూరిసుఖాచిరలాభహర్షసం
ధానవిశల్యకౌషధము నన్ మది నాటినపంచశాయకా
నూనలతాంతకోరక సముత్కరముం దెలిఁబర్చెనో యనన్. ౮౯

ఉ. మానవనాథుఁ డయ్యమృత మౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాపృథుస మున్నత వృత్తకుచోపగూహన
శ్రీనిరవద్యవైభవము చెంతకుఁ దెచ్చినభాగ్యవర్ణసం
తానము తద్భుజాంతరమునం బ్రకటంబయి దోఁచెనో యనన్.

చ. గరుడసమన్వితాభినవ గారుడరత్నమయాంగదంబు భూ
వరభుజపీఠిఁ బొల్చె నగ వర్యసుతావరణాభ్యసూయచేఁ
దరలనిభూతధాత్రి యనఁ దత్సతిఁ బల్మరు నారడించుపై
ఖరి దరెం దదీయభుజ కాండపరిస్ఫురణంబు లయ్యెడన్.

శా. సుత్రామప్రియ మిత్రపాణియుగళిన్ శోభిల్లెఁ జిత్రప్రభా
పాత్రస్ఫారవిదూరజాభరణముల్ పర్జన్యరాడ్దత్తముల్

క్షేత్రశ్రీకరనూత్న సన్నహసలక్ష్మిం దన్పు ప్రాగామిః ప
త్క్షేత్రశ్రీకరసూత్రసన్నహస లక్ష్మీశ్రీవైఖరుల్ తెల్పుచున్.

చ. అలకారాజకుమారుఁ డద్భుతముగా నర్పించు రౌక్మ్యంపుఁ గెం
పుల పెండేరము చేదిరాజచరణాంభోజంబునం బొల్చె నీ
బలవద్దీప్తి ప్రదీప్తమయ్యె నిదె నా పార్శ్వద్వయంబందు నా
వలయగ్రావము వందనప్రవణమై వర్తిల్లు చందంబునన్.

మ. చెఱగుల్ పూఁతపసిండివ్రాత మిసిమిం జిత్రాతిచిత్రంబులై
మెఱయన్ రత్నపుఁగుచ్చులంచులబడిన్ మించుల్ దువాళించు క్రొ
మ్మెఱుఁగుం జంద్రికకావిపట్టు సురభూవిభాజార్పితం బిచ్చెనా
తఱచుం గన్నుల వేల్పుపట్టి వసుగోత్రామండలస్వామికిన్.

ఉ. వ్రీళవివర్తితాస్యయయి వేలుపుటింతియొకర్తు చేదిభూ
పాలమహేంద్రు కట్టెదుట బట్టె మణీమయదర్పణంబు శో
భాలలితానురూప్యమునఁ బార్థివ యీముకురంబు పోలె నా
మేలిమిచెక్కుటద్దములు మేలొ కనుంగొను మన్విధంబునన్.

చ. వసువసుధాసుధాంశునవ వారిదనాహనుఁ డార్క్షణంబునన్
దసదృశచిహ్న మొక్కటి మహామహనీయమహోచితంబుగా
నొసఁగఁ దలంచి దివ్యసరిదుద్భవరత్నమృణాళినీ బిస
ప్రసవసరంబు మంగలకరంబు గరంబున నెత్తి యిట్లనున్.

ఉ. కమ్మపసిండిగట్టుపయిఁ గ్రమ్మెడు వేలుపుటేటిపార్శ్వదే
శమ్ముల నిమ్ములై పొదలు చాగపుమ్రాకుల మానికంపు బూ
దుమ్ములు రాలఁగా నయిన తోరపు బేరసటన్ జనించె నీ
తమ్ములు చిత్రదీప్తి మహితమ్ములొసంగు నభీప్సితమ్ములున్.

ఉ. అవ్యయనవ్యవాసనలొ కప్పెడు వీడక వాడకుండు నీ
దివ్యసరోజదామకము దీధితిమాత్రదినేశమిత్రతా
భవ్యము దీనిగన్న నెడ బాయుఁ బ్రదోషములన్నచోఁ బ్రదో
షవ్యసనంబు పైకొనఁగఁ జాలునె దీని జగత్త్రయంబునన్.

క. ఈశరజాతములకు నెన, యేశరజాతముల గాన మివి బవరములో
నాశరజాతము వఱపెదు, నాశరజాతముల నడచు నభినవమహిమన్.

శా. సోకన్ వచ్చు శిలీముఖంబుల వశం చూడ్ రాజహంసాళి న
త్త్యాకం బెట్టు ననంతరత్నరుచి వో నాడుం దపశ్శీలనన్

క్రేకంబై వెలయుంగా ఘనోదయమునంగా విప్ఫారు నిష్పద్మముల్
వీఁకం జిత్రచరిత్రపాత్రములు గా వే ధాత్రి నూహింపగాన్.

ఉ. తమ్మనివింటిజోదు నెఱ కైదువులైన మిటారితమ్ములి
తమ్మర నెట్టుపోలం సతి తమ్ములతాంగుల మానయుక్తి చి
త్తమ్ములఁగూడఁ బోలు నవి తమ్మ లసన్మహిళామనోంబుజా
తమ్ములుఁ గూడి మోహసహి తమ్ములుగానివి మించుమించుఁగాఁ.

ఉ. తమ్ములకెల్లఁ బెద్దయగు తామర సోదర నాభికాసనో
జమ్మది విశ్వముఁగాఁ విధివ శమ్మన గాని సృజింపఁజాల దీ
తమ్ములయొత్తు చిత్రచరి తమ్ము జగత్త్రియ సారవస్తుజా
తమ్ము సృజింప నేర్చు నిర తమ్ము దలంచిన యంతలోపలన్.

ఉ. వాసనమాలికాంకమున వర్తిలునీ నిరవద్య వాసనా
వాసవరాసవాభినుత వారిజ దామము ధాత్రి జెందియుఁగాఁ
వాసవ మాలికాంకమున వర్తిలు దావకమై వసుత్వమా
వాసవ చాలనెత్తియున వారికి నెందును జేరు దప్పునే.

చ. ఉరుగుల కీసుపర్ణరుచి యుక్తము డాయఁగడింది ధాత్రిపై
నరులకుఁ బోల వీశముల నాయక తేజము దేరిచూడ నీ
పరమమహేంద్రమాలిక సుపర్వులకైన ధరింప భార మో
గిరిహర నీవు నే నని సఖిత్వము మీఱఁగ నీకొసంగితిన్.

శా. భూనాథోత్తమ యుష్మదీయవరసంభూతామరత్వంబుతో
దీనిం గొమ్మని వాసవుండొసఁగఁ జేదిస్వామి నెమ్మేన న
మ్లానస్వచ్ఛసరోజమాల్య మది చాలం బొల్చె నింద్రైక్యది
క్షానిర్ణైత్యమహాసహస్రనయనీ సౌభాగ్యముం దెల్పుచున్

క. ఆవేళ దివిజమురజవి, రావము హరిరచితగిరిపుర ప్రాంగణవీ
ధీవితతంబై గిరిజా, వైవాహికకలనమునకు వడిదరు విడిచెఁగా.

ఉ. అయ్యెడ సంభ్రమం బెసఁగ నాప్తసఖీకులముత్సవాకులం
బై యగకన్యఁ జేరి శిర సంటుదు మజ్జన మార్పు దధిగై
నేయుదు లేశమందదవు సేయకుఁడంచు ముహూర్తమెంతయుం
డాయఁగ వచ్చెనంచు వినుఁ డానృపతూర్యములంచుఁబల్కఁగాఁ.

చ. హరికరుణాకటాక్షమహి మాగత దివ్యవివాహమందిరో
దరమరుపింత వేదియెడఁ దార్చిన నిర్మల వజ్రపీఠిపై

భరసుత నుంచి నెన్నుదుటఁ దామ్రత రాక్షతముల్ ఘటించి పె
ట్టిరి నలుఁగుల్ సమంచిత పటీరరజంబునఁ బుణ్యభామినుల్.

సీ. కంకణాగ్రోన్మేధి కచ్ఛాయఁ దొలుదొల్తఁ, దేటనూనియ నిగ్గు నీటు నెఱపఁ
పరిళ వక్షోజము స్తాఘార బడిబడి, జాళువా బిందెల జాలు పరుప
గమనీయ నిశ్వాస కందళం బెడనెడ, నురఁటి వత్రువ గాలి సొగసు దెలుపఁ
వరుణాభణాంగుళీ కిరణముల్ పయిఁబయి, జెంగల్వరేకుల చేరు వెరువ

తే. మున్ను గానాత్మశృంగార మూర్తి లతాంగి, మంగళస్నానవిభవసామగ్రిఁ గూల్ప
గమ్మనఁ బిసాళివలపులు గుమ్మరించుఁ, గమ్మజవ్వాదిఁ దలయంటె గలికియొకతె.

ఉ. మంజులచంద్రకాంతమణి మజ్జనశాలవిశాలహేమపీ
ఠం జపలేక్షణార్పితప టీరజలోక్షితకేశపాశయై
కంజనిభాస్య పొల్చె నతి గౌరసుధానిధిమధ్యవీచికా
పుంజిత ఫేనయుక్తయయి పుట్టుసరోరుహగేహయో యనన్.

మ. ప్రమదాభ్యున్నతి జెక్కుఁదోయి చెమరింపం బూర్ణశృంగారతన్
సుమనోదంతులు శాతకుంభకలశీ శుద్ధాంబువుల్ నింపగా
గమలాభ్యంచితపాణి పొల్చె సురరాట్కారుణ్యలబ్ధానివా
ర్యమహైశ్వర్యకులాద్రిధుర్యగృహసా త్తల్లక్ష్మి చందంబునన్.

చ. మెలతలు శైలరాట్తనయ మేదడి యొత్తఁగఁగూర్చి నిండువె
న్నెలపొరవంటి దువ్వలువ నిద్దపుగుబ్బలఁ బ్రాలుచున్ గళం
బలముచుఁ జెక్కు లంటుచు ను దంచితరాగరసార్ద్రమయ్యెఁ బూ
వలమెయి సోకినన్ విమల భావము నిల్చునె యెట్టిపట్టునన్.

చ. కళుకు మెఱుంగు గ్రొంబసిడి కాంచికయై కటిమించఁజాలు నం
దులమణులంఘ్రిభూషలయి శోభిలఁజాలుఁ జెఱంగు ముత్తియం
బులె యెదనుంపఁజాలు సరముల్ కటవాసకసౌరభంబె మైఁ
గలపము నింపజాలు వసఁ గట్టిరి దివ్యదుకూల మింతికిన్. 113

చ. తమతమ తమ్ములం దిగిచి తన్మృణాలక్ష్మికి ద్రిప్పరీతిని
త్తమతమపుణ్యసింధువని తల్ బహుచిత్రదళంపు టారతుల్.
క్రమమున నెత్తె నయ్యచలకన్యక వచ్చె నమూల్య పద్మమా
ల్యమున నెసంగు చేదిపభుజాంతరకల్ప వివాహవేదికిన్. 114

క. ఆకల్పలలామకములు, నాకల్పకదామకములు నపుడగనుత కా
ర్యాకల్ప కనిచె హరిసతి, యాకల్పవిభూతి గలుగ నాళీతతిచేన్.

సీ. జవరాలినెత్తిపేశి జడవాహములమించ, దడియార్చ్యముడిచెఁ బైదలియొకర్తు
తరుణిక్రొవ్విరి తుమ్మెదలదాటుదాఁట సం, పఁగె దండచేరిచె గోమలియొకర్తు
చెలువనేవళి చిమ్మచీకటి గిసరింపఁ, జంద్రసూర్యులనుంచెఁ జామయొకర్తు
మగువక్రొవ్వననభంబు బెగడ సిద్ధోమంపుఁ జుక్కచేరు ఘటించె సుదతియొకర్తు
తే. నెలఁతతురుము మహోమహానీలరాశిఁ, బకపకహసింప మరకత శకలకలిత
మృదులదూర్వాంకురములలోఁ గదియఁజేసెఁ, జకితసారంగశాబలోచనయొకర్తు.

మ. ఘనశృంగారరసోత్తరంగ రుచిరం గద్వేణికిన్ బాసికం
బున దండన్ బలుఁగట్టఁగట్టినిలువ న్ముక్తాకలాపచ్ఛలం
బునఁ దూమేర్పడఁబెట్టి కోటి గిరిజాభ్రూపుండ్రసౌభాగ్యము
ల్దవరం గస్తురిరేఖ దీర్చె నెవతో లావణ్యశేఖరిన్ మించఁగన్.

శా. శ్యామోజ్జృంభితతారకా వరరుచిన్ సంధించి యొందున్ వసు
స్వామిం గన్గొనుచుం బ్రకామశరవర్షస్ఫూర్తిఁ జెన్నొందని
త్యాసూదంబున మించుఁమించు జెలినేత్రాబ్జంబులన్ నళ్యల
క్ష్మీత్రామాలం బగుగావు నించె నవమంచెం గజ్జలం బింతికిన్.

మ. అతి తీవ్రాశుగ వృత్తిమైనతనుధన్వాభోగసీమన్ గతా
గతముల్ సల్పి భ్రమించులోలతరవీక్షాపాతపాంథాళికిన్
శ్రుతికూపాంతసుధానిపానకములై శోభిల్లు నిత్యప్రభాం
చితవజ్రోపలకుండలంబులు ఘటించెన్ బోటిపూఁబోఁడికిన్. 119

మ. శ్రుతికూపామృతమున్ వతంసకళికాగ్ర్గోయంత్ర సంక్రాంతదీ
ధితిదండోజ్జ్వలవర్తులాభరణపాత్రిన్ నించి తాటంకక
ల్పితకల్యాముఖ హీరసారకిరణోద్బదంబు పేరన్ వెలా
ర్చితటిద్దేహకుసన్యపత్రలతికాశ్రీ నించి రాళీజనుల్.

చ. సురభికురంగనాభికల చొక్కపుఁ గుంకుమఁగప్పి కుంకుమ
స్ఫురితమహోష్మ గప్పగపు సోకులమానిపి కప్పురంపుఁజ
ల్విరి మెఱుఁగుంజవాది నెడలించి కదంబము గూర్చి సెచ్చెలుల్
తరుణి కలందిరన్నియును దత్తనువాసనఁ బూవుఁగట్టుచున్.

సీ. అధరమాధుర్యభిక్షాగతంబగు సుధా, గుటిక నా ముంగలఁ గుదురుపఱిచి
సమయానుగుణమహోచ్చగతగ్రహాళి నా, జనుబోయినవరత్న సరము వైచి
కిసలకోరక భృంగ కీరవర్గంబు నా, దోర్వల్లిపయి వన్నె తొడవులు నించి
ఘనకుచాంగజదుర్గ కల్పితాధరవప్ర, పరిధనా నొడ్డాణ మిరవుకొల్పి

తే. యనఘ జఘనానుషంగ మష్టాంగయోగ, కలన నివిగాంచె నవవజ్ర కాంచికలిడి
యంగజితరతిబిరుదాంక మంఘ్రిఁగట్టు, కరణి మణిమయమకరనూపురము దొడిగి.

చ. చెలువలు బాల నిట్లు గయిసేయఁగఁ బైదలియొత్తు రాగమం
ఘ్రుల నలరించి చూచితిరె కొమ్మలు తమ్ములినాంఘ్రిరాగకం
దళిఁ దగు ధాత్రి నీయరిది తమ్ము లినోజ్జ్వలమాళి రంజనా
కలనము లంచుఁ బల్కఁ జెలి కన్నుల నించుక నించె రాగమున్.

శా. కాంతల్ శుక్తిమతీనగేంద్రభవముక్తారత్నరాజిం దదే
కాంతస్వచ్ఛశరీరయుక్తి ననుజా కల్యాణవేళాగ్ర స
త్కాంతుల్ నించిరిగాక కానిదొడ లోకశ్లాఘ్యసౌభాగ్యవ
త్కాంతాలోకమణిక్ మణీశతిములం గైసేయఁగా ముగ్ధతే.

శా. నానాభూషణరత్నజాలములలోవం బొల్చు నాత్మీయకా
యానుచ్ఛాయలచేఁ గరం బలరె మేనాపత్యసత్పుత్రి సె
మ్మేనుల్ దాల్చె శుభాదిదేవతలు సంప్రీతిం బ్రవేశింపని
త్యానందంబున నంద మొం మనరవిందావాసచందంబునన్. 124

క. ఐదువగాణీలశుభా, పాదనగేయములపేర భారతి సతిపై
మోదమున ధవళవర్ణ, ప్రాదుర్భావంబు నెఱపెఁ బలుమఱు నచటన్.

## ఆశ్వాసాంతము

శా. సంధాభార్గవభార్గవహిన్నయన జ్వాలాభశౌర్యప్రభా
సంధానాదర నాదరక్తిరసిక శ్యామామనోవారణా
సంధారోహణ రోహణ ప్రతిమదోశ్చారుక్షమాపాలసం
బంధాపాదన పాదనమ్రమహాయరా డ్భస్వత్సపాదాంకనా.

క. ఖల్యాభయకర హరఖుర, హల్యాహతజన్యజాంగ లాంగణఫలసా
కల్యావహ బహుదిగ్జయ, కల్యాణ నిజామగుప్త కల్యాణహరా.

## తరలము

ద్రమిళలాటకురువరాట దహాళఖోటకుంభినీ
రమణజూట తటకిరీట రత్నపాటలప్రభా

కమలఝూటకలితకూట కనకహాటసంభ్రమ
ద్భ్రమితఘోట ఖేదదకోటి పటుకవాటపాటనా.

## గ ద్య ము

ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబనుమహాప్రబంధమునందు
పంచమాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీగురుభ్యోన్నమః.

# వసుచరిత్రము

## షష్ఠాశ్వాసము

శ్రీరామ చరణవందన, పారీణ యపారరణకృపారీణ ధను
ర్జ్ఞారాచనవ్యదీవ్య, ద్వీరాచరితాంకగేయ తిరుమలరాయా.

తే. అవధరింపుము శౌనకాద్యఖిల సన్ము, నీంద్రులకు రోమహర్షణి యిట్లువలుకు
నితర దిక్పాలకాంతలు నిగురుఁబోఁడి, కర్హభూషావిశేషంబు లనిపిరపుడు. 2

శా. పౌలోమీప్రభృతుల్ కుమారి నిటుల భావింపఁగా మున్ను ది
క్పాలుర్ భూపు నలంకరించి శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగా
నాలోఁదాను దదర్హవస్త్రమణివిశేషోన్మేషసన్నద్ధుఁడో
నాలోకాప్తుఁడు చేరె రాగమహిమన్ రత్నాకరప్రాంతమున్. 3

మ. వసుసమ్రాడ్గిరికాకరగ్రహమహావ్యాలోకశానందసాం
ద్రసురేంద్రప్రమదాశ్రయం బగునభఃప్రాసాదదేశంబునన్
ఘుసృణాలేపమొనర్చి ధూపమిడి ప్రొద్దుల్ వెట్టిరో నాఁగరం
బెసఁగెన్ సంజయు నిర్ణుఁదారకలం భూయిష్ఠప్రకాశంబునన్. 4

ఉ. ఒప్పననంతసౌధమున నుండి తదుత్సవచిత్రసంపదల్
ముప్పది మూఁడుకోట్ల సురముఖ్యుల పట్టపుదేవు లందఱుం
దప్పకచూడఁగా నిడిన దట్టపుసోరణగండు నాఁదెసల్
గప్పురుచి ప్రరోహములఁ గాసఁగ నయ్యె నపారతారకల్. 5

ఉ. ఉన్నతవైజయంతవలయోపరిభాగము చేరి చేదిభూ
భృన్నగరీమహోత్సవము పెంపఖిలంబును నిక్కి చూచువే
గన్నుల వేల్పురాణి ముఖకంజము పైపయిఁదోచు రేఖ దే
గన్నియ తేని మేను తొలుగట్టుతుదం బొదలెం గ్రమంబునన్. 6

చ. సరసిరుహారి యప్పుడిలఁ జందనసేకము దిక్తటంబులం
బరమసుధానులేపమున భంబునఁ బాండువితానలక్ష్మియున్
నిరుపమకౌముదీరుచుల నించుచు సారె నలంకరించి నా
సురకులసార్వభౌమహిత శోభనవేళ నజాండగోళమున్.

చ. అతినికటంబు లగ్నమని యాంగిరసుం డపు డుచ్చరింప దై
వతవిభుఁ డాదరోక్తిఁ బిలువన్ నలువంకలఁ బుణ్యభామినీ
కృతశుభగేయముల్ మగధకీర్తనవైభవముల్ సెలంగఁగా
సితకరి నెక్కి యొప్పెఁ బతి శీతనగోజ్జ్వలశంకరాకృతిన్. 8

వ. ఇవ్విధంబున నవ్వసుంధరాధురంధరుండు పురందరసింధురస్కంధాధిరూఢుండై పాండురద్వీపరాజోపరక్రీడనోల్లాసియగు సింధుజావిలాసియో యన ననంతమణిమాలికామహితమహాభోగాతపత్రసహస్రంబులనడుమ విలసిల్లుచు నతిదుమల తేమ ధమామికాతమ్మటభేరికాపటహతుత్తుంభికాదివాదిత్ర గంభీరఘోషసంరంభంబు కుంభినీకబళనారంభజృంభమాణ జంభారిపురముఖరరవంబునై అవఱవంబోలె హాటకగిరి కూటకటకవాటికాపాటనాటోపంబు వాటింప నిబిడతర విద్యోతమాన నూతనకేతన ప్రకాండదండాఘాతకాతరత్వంబున ధరాతలంబునకు దిగిన జ్యోతిర్జాతంబుకరణి గణనాతీతగంధతైల దీపితకరదీపికానికాయంబులు వెలుంగ సముగ్రతర సాంబ్రాణికధూపధూమంబుల జాడలను జడిగొన్న గొడుగులనీడలను గెరవితెర లెత్తునిరులం దెరవింప ననేకరూపంబులం దీపించు తమోరి పుత్రయుం బనం జిత్రయంత్రకారసంధానిత లీలాగ్నియంత్రచంద్ర సూర్యజ్యోతుల మరిచి ధట్టంబులం దట్టంబులై నెట్టనంబట్టపగలుగావింప సాత్త్రియసామ్రాజ్య లక్ష్మీసకాశంబున ననిందిత సైర్యవిద్యాపరిచయంబుపచరింప నవతరించిన క్రొమ్మించుఁ దీవియ గుంపునింపు వెలయంగలయ వెదకికొన వచ్చిన తదీయ విరహపాండురంబగు నంబుదంబుడంబు విడంబించుచుఁ గంబుకంఠీకదంబంబు పయిం బట్టిన యుల్లాభంబు పశ్యల్లోచనవల్లభంబై మెఱయ పాకశాసనశాసనంబునం బరిణయోచితదివ్యవస్తు సంభారసంభావనంబునకునై విశ్వంభరావలయంబుఁ జెందినమందారవల్లి కలయందంబునం గొందరిందువదనలు చిత్రజాంబూనదాంబరఫలకుసుమాది మంగళద్రవ్యంబులం బూని మెఱుంగటనడవ జగత్త్రియజేగీయమాన ధైర్యా సమానవసుమానవనాథ చిత్తంబు శైలజాయత్తంబుగా సమకట్టి గాసిం బెట్టిన జగజెట్టి నెఱజోదని బిరుదు వక్కాణించి చెఱకువిలుకానికోదండములఁ బూదండలు గట్టి యగ్గించు తదీయవిజయేందిరల చందంబున మఱికొంద ఱిందీవరాక్షులు పుష్పమాలికాలంకృత పుంద్రేక్షు

కాండంబులుపూని పురోభాగంబున కడతేరఁ గంధర్వకోటి సౌందర్యశాలియగు నితనికామనీయకంబు భవదీయలోకాలోకనీయకుమార బృందంబునందు సెందేని యుంగంటిరేయని దివిజభుజగరాజరాజీవగంధులకుం దెలుపు పోలుపున లాస్యప్రవీణకమలాస్య లభినయముఖంబుగా గరకిసలయంబులు సాఁచి మెలపుచూప వైవాహికమహూర్తసారప్రతీక్షాపరమహర్షులు పరమహర్షులై పర్వానుపర్వసుపర్వపాలితపారిజాత పరాగపాళికాదుర్లక్ష్యం బగు నంతరిక్షంబువలన సమక్షంబునకు నాకర్షించిన దాక్షాయణీ చక్రంబుకై వడి నవక్రచక్రడోలా యంత్రంబులం దిరుగు మొఱుగుఁబోండ్లతండంబు శాణభ్రమన్మదనబాణభ్రమం బొనరింప నెడనెడం బన్నిన యపరంజికురుంజాలపై రంజిలుచు మృదంగదింధిమిధ్వానంబులకు నాడు యంత్రపాంచాలికాసముదయంబు విమలమణివిమానమండలంబుననుండి గొండ్లి బరిఢవించు తెలుగంటి తెలివలతెలుంగు నంగీకరింప వర్ణనీయవారవరవర్ణినీ వారవారణదుర్లభయాన వైభవంబు వాసవావాస వామలోచనావర్గంబులకు వసుధాపదన్యాసవైదుర్యంబు సంపాదింపఁ బల్యంకికాదివాహనంబులు డిగ్గి పాదచారంబులనడచు పట్టాభిషిక్తుల పద్మరాగకిరీటపాటల ప్రభాపటలంబులు పవనసఖశిఖాముఖంబులకు మలిసరణి నవరింప సమస్తజన సముచితమార్గ మర్యాదానుశాసన సముద్దండదండధర సంభ్రమంబులు సమవర్తికి సమధికస్వామిక సమకూర్పఁ బ్రబలతమస్ఫుర దురహంకార వీరభటకృపాణికా చాకచక్యంబులు రాత్రించరకరాళకరవాల కాళిమంబులు మూలకుంజొనుప బహుళసితదంతిఘారాటకోటీ సమాటీకనిర్వేల సర్వతోముఖవాహినీశ్వర సంసేవ్యమాన రసాధినాథ సన్నాహంబులు వారిధిస్వామికి వదలనిజడసిద్ధి యొసంగఁ బరిమళిత ఘనసార గంధసార పరిమిళిత కస్తూరికాసారంబుల వసంత మాడుసామంతబాంధవావళి గంధవహునకపారతారళ్యంబు వెనుప గంభీర బిరుదగాథాపఠన పారాయణ పాఠన పరంపరలకు నెడనెడ హితపురోహితామాత్యజనం బొసంగు నసంఖ్యాత ధనసంఘాతంబుల ధనదున కమందమందాక్షభావంబు సంఘటింపఁ బ్రచండతరనటన ప్రకాండతాండవ పాండిత్యంబులు ప్రాచీననటుని నెమ్మనఁ బాండిమంబు నిండింప నిట్లాశాపశులకు నాశాసనీయంబును నహివల్లభులకు నతిదుర్లభంబును సిద్ధులకనను భూతిసిద్ధంబును సాధ్యులకసాధ్యంబును జారణులకు నవిచారణీయంబును యక్షులకు ననక్షిలక్షితంబును నైనయనన్యసామాన్యమహావిభవంబునం గోలాహలపుగంబుఁ జేరం జనుసమయంబున. 9

శా. క్రీడామంథరదృష్టిపాతములు నుర్వీపాలవంశాగ్రణీ
చూడాగంజితపాదపీఠునతనిం జూడక్ మణీనిర్మిత
క్రీడాసౌధతలంబు లెక్కి రి నవ శ్రీమన్మహా శైలస
ప్రౌడావాసపురాంగనల్ కుతుక సామగ్రీసముద్రీవికనత్. 10

సీ. రాగంబు మూర్తమై రహిఁ ద్రోవఁ జూపు పెం, పునఁ బదచ్ఛాయ మునుమున్న నిగుడ
శిక్షాప్రహితదూతి వెస నేఁగు మని ప్రొమ్ముక్క, గతి సంఘ్రిఁ గర్ణాబ్జ కళికఁ బ్రాల
నీవిఁ జుట్టినభోగి నిట్టూర్పుగమి నుబ్బ, సడలినా నొడ్డాణ మెడలి తూలఁ
గంను నెన్నడుముపై గరుణించి చనుదోయిఁ జిందు, పన్నీరు నాఁ జెమటు దొరుగ

తే. గటికి రటికి కంఠసీమపై గంతుఁ డనెడ, బిరుదుమావంతుఁ జేసిన కేలుజల్లి
పెంపుగను పెన్నెలులగుంపు క్రిఁదిలిజాఱ వచ్చె నొకసతి వసుమతీవరునిఁ జూడ.

ఉ. డించఁగఁ బ్రొబ్బుకేకెద ఘటించిన రత్నవిపంచితో సు
వర్ణాంచితమూర్తి యోర్తు ముఖరాంఘ్రిసమాశ్రితసత్కలాపయై
యంచల వచ్చుపోఁ బుగపు టంచలఁ దోలుచు మిన్ను చేడె యౌ
నంచు నుతింపవచ్చె వెస నాచతురాస్యుని మోముఁ గన్గొనన్. 12

మ. పొలఁతి యొకర్తు చెంగలువ పొట్లము చేతను పూని వచ్చుచున్
వలపుల పండ జాఱ గుణ వద్ధళమాత్రమె తాల్చె నిమ్మహీ
తలపతి కేన కూర్తునని తప్తపరశ్వధ మెత్తివైచి మం
జులదళ తంతులేశపరిశుద్ధి జనాళికిఁ దెల్పుకైవడిన్. 13

ఉ. చిత్తరియోర్తు ముత్తియపుఁ జేరు పలగ్నమునన్ ఘటించి కే
లుత్తపుఁ జన్నుదోయి నొవ గూర్చి రయంబునఁ జూడవచ్చె రా
జోత్తము నాత్మహారవిభవోజ్జ్వలమధ్యవిదారణక్రియా
యత్తము లైనచన్నులఁ బ్రియంబున వేఁడుచు వచ్చెనోయనన్.

మ. రమణీయోజ్జ్వలవజ్రపట్టిముపై రత్నాంకభూషానుబం
ధముతోడం బరువెత్తె మే లని పద ద్వంద్వంబుపై నాహిత
ప్రమదంబై హృదయంబు వేగ విగళత్ప్రాలంబముక్తాభిషే
కము గావింపగఁ నచ్చె నోర్తు వసులోకస్వామి నీక్షింపగన్. 15

సీ. తనుఘనంబుగ నమ్మి దరియు నెమ్మికిఁ గొప్పు, మాల్యభోగి నొపంగి మెఱలఁ బంచెఁ
దనుఁ గొండయనివచ్చు నునుజింకఁ గుచము గాఁ, రుడశిలాసరదూర్వ లిడి మరల్చెఁ
దనుఁ గల్ప లతికఁ గా దలఁచి ప్రాలెడు శారిఁ, గరము రత్నఫలాళి నెరపి నిలిపెఁ
దనుఁ బద్మమనియంటఁ బెనగునంచను సంఘ్రి, హీరాంగదమృణాళ మిచ్చియనిచె

తే. నాత్మపోషితవర్గంబు లవనిపావ, లోకగమనాంతరాయంబు గాకయుండ
నవయవంబులతోడయ్యె నతివ కనుచు, నెచ్చెలులు మెచ్చ వచ్చె మానిని యొకర్తు, 16

ఉ. పౌరపురంధ్రు లిట్లు వసు పార్థివుఁ గన్గొన వచ్చి మంగళా
చార మనోజ్ఞలాజములు చల్లిరి సింధుభవావివాహవీ

త్సారమణీయమూర్తి యగు శౌరిపయిం గలశాబ్ధి నిర్మలో
దారతరంగరేఖలు సుధాలవముల్ వెదచల్లు కైవడిన్. 17

మ. అప్పు డద్రీశ్వరుఁ డాప్తబాంధవులతో నభ్రాపగా ముఖ్యపు
ణ్యాపురంధ్రీతతితో నెదుర్కొనఁ దదీ యద్వారసీమన్ సిత
ద్వీపమున్ డిగ్గి సురాధిరాజపురవేత్రిశ్రేణి సాహాయ్యనన్
నృపచూడామణి తత్ప్రధానజనతా నిర్దిష్టమార్గంబునన్. 18

సీ. మణికుట్టిమములు భామాగీతికార్ద్రివి, భావభవ్యజలాప్తిఁ బాద్య మిడఁగ
మందార సుమకాయమానముల్ పవమాన, శీర్ణకేసరముల సేసచల్లఁ
జిత్రితారాత్రికా పుత్త్రికల్ కరదీప్త, రత్నదీధితుల నారతులు ద్రిప్ప
బహువిధద్వారరంభాకోటి పరిపక్వ, ఫలరసంబుల మధుపర్క మొసఁగ

తే. మున్నుగా నన్నగాన్వయ ముఖ్యభవన, లక్ష్మి యిట్లు వివాహవేళా మహోప
చారముల నన్నిటి ఘటింప సాంద్రవిభవ, కలితకల్యాణవేదికఁ గదిసె నపుడు. 19

మ. నరనాథోత్తము మ్రోల నున్నమిత దంతస్తంభమై చారుచా
మరకత్న్యాకదళీకలాపశుభకుంభంబై సదా మోదమే
దురసారంగమదాంక సంకలితమై దోడ్తో మహావారణ
స్ఫురణల్ దెల్పువివాహవేదికపయిన్ శోభిల్లె బద్మావళుల్. 20

క. మనుజపతి యపుడు నగపతి, పనుపున మణిపీఠి నమరెఁ బ్రకటిత కమలా
కనకాంబర కల్యాణాం, కనకాంతవివాహ సదన కాంచనవేదిన్. 21

చ. విధివిహితంబుగా బుధగవీదధిమిశ్రసురద్రుమంజరీ
మధుమధుపర్కమున్ విమల మౌక్తికపాత్రికఁ దెచ్చియాగుణో
దధికి నొసంగె మామ మధు దానవవైరికి లచ్చి నిచ్చునం
బుధి యమృతాంశుతోనమృత పూరము మున్నొసంగు కైవడిన్.

చ. అపుడు పురంధ్రివర్గ వృత యై చరణాంకకృతార్థమైన క
ప్రపునుమ్రుగ్గుపై మకర పద్మము లేర్పడ నీక్షణప్రభా
స్నపనపవిత్రకుట్టిమమునన్ వరనీలనిధుల్ జనింప నా
నృపమణి భాగ్యలక్ష్మికరణిం దరుణీమణి వచ్చె నొయ్యనన్.

ఉ. ఐదువ లామహేంద్రుగురు సానతిఁ గెందిరయెత్తి విశ్వధా
త్రీదయితున్ సతిం గడియఁ దెచ్చిరి వేడ్క బ్రభాతవాతసం
పాదితబోధలైననవ పద్మిను లాత్మపరాగపాళికా
చ్ఛాదన మావహించి కవ జక్కవలం గడియించు కైవడిన్. 24

ఉ. రాజకరానుషంగము న రామకరాంబుజ మొప్పు గన్యకా
రాజితహస్తయోగమున రాజకరంబు నతిప్రకాశమై
రాజిల దక్షగట్టుక్రియ రాజముఖీకరపంకజంబున
న్రాజకరంబునన్ గురుఁడొనర్చె సమంత్రక కౌతుకాంకముల్.

మ. సుముహూర్తంబని సన్మునుల్ దెలుప నచ్చోఁ దివ్యశైలేంద్రుఁడా
యమరాధీశహితక్రియానిరతు నా యమ్లానమాలాకలా
పమనోహారి నకుంఠవిక్రమునిఁ గా భావించి లక్ష్మీగురు
త్వము దీపింపఁగ ధారవోసెఁ దనయన్ వర్ధిష్ణుసంపన్నిధిన్.

మ. నతచూడాపరికర్మచంద్రతపనుల్ నక్షత్రధామంబునం
బ్రతిబింబింపఁగ నున్న కన్నెయు నతఁడున్ మాంగల్యసూత్రంబు శా
శ్వతకల్యాణగుణావహుం డునిచె నాచంద్రార్కనక్షత్ర సం
తతిపై మించుతదీయనిత్యగుణముల్ వాకుల్ ప్రశంసింపఁగన్.

చ. అతివ సతీకరోన్నమిత యై విభునౌదల సేసఁజల్లెఁ ద
త్ప్రతివపహాళి రత్నగత భవ్యనిజాకృతి చూచి కంటిశే
పతిశిర సెక్కె నీక్షణమె బాలయటంచు ధరాధరోపరి
స్థితి సరిదాత్మసంభవకుఁ జెల్లదె యంచు సఖుల్ వచింపఁగన్.

ఉ. శుక్తిమతీకుమారి కరశుక్తుల ముత్తెపుసేస చల్ల నా
రక్తసరోజపాణిపయి రమ్యగుణాఢ్యయు నట్లనించెఁ ద
న్మౌక్తికముల్ వధూకచసమాజకరాంబుజ కాయకాంతిసం
సక్తి ననేకవర్ణమణిజాలములై విభవంబుఁ దెల్పఁగన్.

ఉ. అత్తఱినమ్మహానిధి నిరావరణస్ఫురణంబుతో బరి
ద్యోతితపద్మినీ సుమహ్య దుచ్ఛదసంగ్రథితాంశుకాంతుఁడై
యాతతదీప్తివైభవకృతాంబరపీఠిక బోల్చెఁ బ్రాజ్యయో
గాతిశయప్రకాశముహుతాశికి గూర్చె మహాద్భుతంబుగన్.

ఉ. లేజవరాలిపాణి యుగళీపరిరంభణ పాటలీభవ
ల్లాజచయంబు భావినిఖిలక్రతుభుక్తినిమంత్రణాక్షత
శ్రీజనకంబు గాఁగ నని చెన్ శిఖినా శిఖియుం బ్రసన్నుఁడై
యాజితచిత్తభూరతుల కారతు లిచ్చె బ్రదక్షిణార్చులన్.

మ. జనకోత్సంగనివాసవాసనరా జవ్యస్తహస్తాభిమ
ర్శనసౌఖ్యామృత పారవశ్యమునసో సైఁచెన్ శిలారోహణం

బని సాధ్వుల్ పొగడం బ్రియాంఘ్రి ఘనకల్ హత్తించె భూజానిత
ద్ఘనభాగ్యంబు ఝుళంఝుళత్కటకరత్నంబుల్ ప్రశంసింపఁగన్.

చ. సిరులు ఫలింప దంపతులు చెంత నరుంధతి జూచుచోఁ బర
స్పరనయనాంతముల్ గదియ బాలికచూపులు పర్వె నప్పు డ
ప్పురమసతీ పదాబ్జముల వైభవదీయను వాసినీత్వవై
ఖరిఁ గఱిఁగింపుమంచు విరి గల్వల బూజలు సల్పెనోయనన్.

సీ. వెలయించి రభిజాత వేదులతో జాత, వేదుఁ బ్రదక్షిణా పాదనములఁ
గాంచిరి ధ్రువపదం బంచితామరవర్య, వరముతో నుత్తరో త్తరము గాఁగఁ
దాల్చిరి గురుతపోధ నుల దీవనలతో, నమృతవర్ణంబులా ర్ద్రాక్షతములు
తిలకించి రవలోకి చల కిరీటములతో, రత్నరమ్యములు నీ రాజనములు

తే. తనిపి రనుపాధికహావ్రప దత్తరుచిమ, దమృతసారాన్నసామగ్రి నాత్మబంధు
జాతములతో మహోత్సవా యాతసకల, శతమఖపురాధివాసుల సతియుఁ బతియు.

క. వీడు చదివించె నర్ఘ్యోద, వీడని వేడుక బలారి విబుధులతో లే
వీడుమణు లవఁగఁదగు తన, వీడుఁ గలమానికములు వివిధాంబరముల్.

సీ. గండశైలములకుఁ గరపాదములు వచ్చె నోయన మెఱయు నాగాయుతములు
హరిణజాతికి మరు న్నిరసనోద్ధతి గల్గెనో, యన దగు సైంధ వోత్కరములు
సంభోదములకుఁ బా యనిమించులాద వెనో, యనమించుమణిమయ స్యందనములు
నవలతావళికి యా నవిలాస మెసఁగెనో, యనఁ బొల్చుసరస క న్యాయుతంబు

తే. లాత్మమణి హేమరజతంబు లపుడయుచిత, తనువులు వహించెనో యన దనరువివిధ
శయనపాత్రాసనములు భూ జాని కొసఁగె, హరికృపాలబ్ధశుభశాలి యచలమాళి. 36

సీ. కస్తూరి మెకములు కమ్మజవ్వాదిపి, ల్లులు నుమ్మివి మదంక విలసితములు
ఘనసారకదళికల్ గంధద్రుమపులు నుమ్మి, వి మదీయ జీవన సమధికములు
కిన్నరద్వంద్వముల్ కీర రాజములు ను, మ్మివి మదీయక్రోడ విపళితములు
మాణిక్యసారంబు లాణిముత్యములు ను, మ్మివి మదాకరవంశ హిండితంబు

తే. లివిమృదులదివ్యవసనంబు లివియమూల్య, బూషణము లివియమ్లాన పుష్పములు మ
దగ్రసంతానజములు సు మ్మనుచుఁ దెలిసి, యల్లునికి నిచ్చె వెండియు నాదరమున. 37

చ. అసదృశభక్తిశు క్తిమతి యాత్మజరత్నములన్ నిరంతశ
ద్విస్పృహగదీప్తివాని శుచి వృత్తమహత్త్వమువాని నన్నిటిన్
వసున కొసంగి యర్ఘ్యోద న వారితభూరితదీయ సామ్యవ
ద్వసుపదవామపుత్త్రిమణిఁ దద్వసుపాదము సేర్చెఁ జేర్చినన్.

మ. సకలాశాంతనిశాంత రాజమకుటీ సంక్రాంతమాణిక్యకో
రకనీరాజనమున్ మహాకటకశోభాగంధర్వముం గాంచి పా
యకపద్మోన్నతిఁ బూనుచున్ నిజపదాఖ్యాయోగ్యతన్ మించ రా
జకులగ్రామణి యుంచె నవ్వసుపదుఁ జైన్యాధిపత్యంబునన్. 39

ఉ. రాజపురందరుండు నగరాజతనూజయు నిట్లు శక్రసం
యోజితమంగళం బెసఁగ నున్కిఁ గనుంగొని మున్న వారి స
ద్వ్యాజకతీవ్రతేజమున వేఁచిన సాహసి గాన వేగ సం
భోజవిరోధి సేరె బద భూధరకందరకోటరాంతమున్. 40

మ. జనరాడ్దివ్యవివాహవైభవము మించన్ రేయి రేరాజు నిం
చినజ్యోత్స్నాంశువితానతారకసుమశ్రేణుల్ నెఱుల్ వీడఁగా
దినరాజన్నియనూడ్చియయ్యెడ మిళత్తేజోమయాతామ్ర నూ
తనపట్టాంబరముల్ ఘటించె హరిదంతవ్యోమభాగంబునన్. 41

ఉ. ఇంతికిఁ జేదిభూపతికి నిట్లు వివాహమహంబు శేషహో
మాంత మొనర్చి యాచతురహంబులఁ బూర్ణహవాదికక్రియా
సంతతదీయమానచరుసారములం బరితృప్తిఁ గాంచి య
త్యంతకుతూహలంబున సుధాంధసు లిచ్చి రభీప్సితార్థముల్. 42

సీ. సురభిసంతానవిస్ఫురణ మిచ్చె నగారి, యిష్టార్థసంసిద్ధి నిడియె వహ్ని
యహతధర్మగుణంబు లర్పించె సమవర్తి, కామరూపతఁ గూర్చెఁ గ్రవ్యభోజి
భువనవశీకార ముఘటించె సలిలేశుఁ, డసమతివ్యామోద మొసఁగె గాడ్పు
కల్యాణసామగ్రి ఘటియించె నిధిరాజు, జితదర్పకత్వంబు చేర్చె శివుఁడు
తే. ప్రబల దీర్ఘాయురారోగ్య భాగ్యకరము, లగు వరంబులు సమకూర్చి రఖిలమునులు
నూతనవివాహకౌతుక ద్యోతమాన, మానసీయాకృతికిఁ జేదిమనుజపతికి. 43

క. వెండియు నాఖండలుఁ డరి. ఖండనజయసాధనప్రకాండము సమిదు
ద్దండ మొకదివ్యవైణవ, దండము దయ నొసఁగి ధరణిధవునకు ననియెన్. 44

సీ. తనయవంతాదిదుర్దాంతమూలబలంబు, లఖిలలోకతల మెల్ల నాక్రమింపఁ
దనశతకోటిపర్వనితాంతమహిమయుం, దికనగంబుల వకావకలు సేయఁ
దనమేచకశిరోధి కని రూఢనటన మ, భ్రగపురంబుల నెల్ల రాయిడింపఁ
దనయభిజాతనూతనసుపర్ణస్ఫూర్తి, విషధరంబులమూఁక విపొవనర్పఁ
తే. బుట్టె నీవంశ మపరంజి గట్టుమీఁద, దానితుదవ్రయ్య లీలాన దనుజహరుల
కాదిఁ బృథుకార్ముకములయ్యె నయ్యఖండ, వేణుకాండంబు సుమ్మి దివిబుధమిత్ర. 45

క. ఈదండము పరపాదప, సేదండము పరమపటిమ విహాసితపురభి
త్కోదండము భవదీయభు, జాదండమునన్ ఘటింప జయమగునాజిన్. 46

సీ. ఘనమై ఘటించు లోకక్రూరనిర్ఘాత. మాశుగమైకూల్చు నలఘుతరుల
నతిఘోరతమమై ప రాంధ్య మాపాదించుఁ, గీలియై సమిద్ధ కేళి నెఱపు
విలసద్విశేషమై విషముల నేచు న, చ్యుతమూర్తియై బలి స్ఫురణ మడఁచు
మహితోగ్రవృత్తియై మహిభేదహతి సల్పు, భానిధియై ప్రతాపంబు నూపుఁ

తే. బార్థివ యఖర్వ సర్వాను పర్వ విభవ, ధూర్వహము గాన యిది యాజి దోఁచు నఖిల
దివ్యసాధన సారమై దీనిఁ దాల్చు, ధన్యుఁ డుద్దండ సుభటమూర్ధన్యుఁ డరయ. 47

శా. సచ్ఛిద్రం బసమగ్రసార మొకవంశం బౌని గోచక్ర మా
త్మేచ్ఛాధీన మొనర్చె గోపతనయుం డీదివ్య వంశోత్తమం
బచ్ఛిద్రం బతిమాత్రసార మిది బాహామండలిం బూనువాఁ
డిచ్ఛిన్నంబుగ నేలఁజాలఁడె సమస్తావక్రగోచక్రమున్. 48

ఉ. చండతమంబు పర్వలవ సంధి నొకానొకవేళ రాజమా
ర్తాండులఁబట్టి క్రాయునది దారుణ చండతమంబె యీమహో
ద్దండతమం బఖండగతిఁ దాఁకొని క్రమ్మఱ నీదు రాజమా
ర్తాండులఁ బర్వసంధి ఘటితద్రఢిమంబు నిరంతరంబుగన్. 49

క. ఈగద సాకారజయ శ్రీ, గద జగదవనధుర్య చిరకీర్తివధూ
యోగద యనదగు దీని న, గ్గోగద లెన్నేని బోల నోపునె జగతిన్.

చ. రతిపతి తండ్రితూపును బురత్రయశాసను శాతహేతి భా
రతిపతియంబకంబు నగరంధ్రవిధాయకుశక్తి దీనికిం
బ్రతి సమ మీడు జోడనఁగ రాదు ధరాధిప దీనిభక్తితో
బ్రతిసమమున్ భజించుచు సపర్య లొనర్ప శుభంబు నీకగున్.

ఆ. అనుచు దివ్యవంశ మాదివ్యవంశ బాం, ధవున కఖిలధరణిధవున కొసఁగి
యతుల హితుల నెనసి యతులవైఖరి నేఁగె వాసవుఁడు నిజాధివాసమునకు.

క. గిరియును గిరిజామాతయు, గిరిజామాతయు యథార్హ కృతసత్కారా
దరగరిమ ననుప దమతమ, యిరువుల గరిగిరి సరిద్గిరీశ్వరు లంతన్.

ఉ. హేమలతానిభాంగికి నగ ధీశని వేశనప్రవేశ దీ
క్షామహనీయమంగళము సర్వము సాంగముగా ఘటించి య

కోమలిఁ జేరఁబిల్చి తల గ్రుచ్చియుఁ గౌగిటఁజేర్చి భూధర
గ్రామణి పల్కె గాఢతర గద్గదికాఘన నిస్వనంబునన్.

క. నీతమ్ములశుభ వాసన, నీతలిదండ్రుల గభీర నిశ్చలగుణ వి
ఖ్యాతియును దలఁచి మెలఁగుము, నాతల్లీ కులవధూజ నమతల్లిక వై.

సీ. మాఱుమాటాడదు మఱచియైనను గురు, వ్యాహారమున కీయ హార్యతనయ
యానమగ్రిమ బూను మానంపుసవతులె, లైనది నీవ్యర తన్నుజాత
బాగర్హయై మేర మీఱ దొకప్పుడును ఘన, శ్రీల బొంగియును నీ సింధుకన్య
యేకాకృతి వహించు నిను రాగవృత్తికి, నపరాగవృత్తికీ యబ్జవదన

తే. యచ్చెరువు వింత యబ్బురం బరిది యనుచు
విశ్వధాత్రీశ్వరులు మెచ్చ వెలయవమ్మ
యమ్మ భవదీయచిత్రగుణాతిశయము
వలన మాకెల్ల వెన్నెరా మెలఁగవమ్మ.

చ. పతికృతధర్మ కౌశలము పట్టునఁ దోడగు నారి నారి దాఁ
బితృశరణప్రచింత మదిఁ బెట్టక యాశ నివేశితాత్మ యా
సతి పతి రాశికెక్కె యిన సత్కృతి కైకొను కన్యకన్య శా
శ్వతమతి నిట్లుగా మనని వామయె వామ సుమమ్మ కోమలీ.

శా. ఈశైవాలవతీప్రతీరభజనం బీనిర్మలప్రసరో
ద్దేశావాసము నీమృగార్భకశకుం తీసఖ్యమున్ లేమిఁ జిం
తాశల్యంబు వహింపకమ్మ చెలి యే తచ్చర్యలెల్లం దపః
క్లేశాంగంబులు నీకభీష్టపరలక్ష్మీధన్యకిం కేటికిన్.

క. అని తెలుప నశ్రుధారా, వినివేశ విలీయమాన వినతానన యా
తనయం గని కల్లోలిని, తనయంగని తాంతయుక్తిఁ దార్చుచుఁ బలికెన్.

ఉ. తమ్ములఁబంపుదున్ మణిశతమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములబంపుదున్ బరిచితమ్ముల గాననదేవతాళిజా
తమ్ములఁబంపుదున్ ద్రుతగతమ్ముల నేనును సారణీప్రపా
తమ్ముల వత్తు విశ్వవిదితా ముదితా మది తాప మేటికిన్. 60

సీ. మెదలు మిటారితుమ్మెదలు జొమ్మనిమ్రోయఁ, బొదలు నిచ్చటిపువ్వుఁబొదలఁ జూడఁ
దేటి మాధురిఁ గడతేటి పేరివమున, వారి నేయుమదీయ వారిఁ దేలఁ
వలనంది దరులక్రేవలనందికొనుచు నా, వల నగల్చు మహోర్మి వలనమరయ
గములఁ బాయక తరంగములపైఁ దగుసితాం, గముల మానసవిహంగములఁ బట్ట

తే. సరిద్వ్రతముల సరిగంగ లాడఁ జైత్ర, శుచినభోబాహుళ తపోవి శోభిసకల
సమయముల దావకప్రాణ సమునిఁగూడి, యిచట నె మెలంగెదు కలంగ దేలతల్లి. 61

క. బెగడ వల దనుచు బెట్టిద, మగు నెవ్వగ వగడుపడుచు నాఁడుబడుచు తే
పగవారికి వల దన నా, పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁ డనుచున్. 62

చ. అనుపమహేలతో నరవరాగ్రణి రత్నరథాధిరూఢుఁడై
యనుపమహేలతోఁ గదలె నాత్మపురంబున కభ్రమండలిన్.
ఘనమురవార్భటిం దెరవు గట్టి నిలింపనితంబినుల్ ఘనా
ఘనమురవార్భటిన్ మెఱచు కాఱుమెఱుంగులరంగు లీనఁగన్. 63

ఉ. వేడుక నిట్లగణ్యరుచి విభ్రమధన్య యగేంద్రకన్యరాఁ
జూడఁదలంచి సిల్చిరి వసుక్షితిపాల పురీపురంధ్రికల్
మాడువులన్ హజారముల మచ్చుల సజ్జల గోపురంబులన్
మేడల నాట్యశాలికల మేరువులన్ భువనేశ్వరంబులన్. 64

సీ. సరిగాదు మద్వ్యథూ సర్గ మీసతి కంచుఁ, దెలుప నందఱఁ దెచ్చె నలువ యనఁగ
నిజభాగ్యలక్ష్మిరా నెమ్మిఁ జొజిడ ననం, గుఁడు మూలబల మెల్లఁ గూర్చెననఁగఁ
గొనియె మాసియుల నీ కొమ్మంచుఁ బతికిఁ దె, ల్ప నశేషయౌవతం బెనసెననఁగ
జలసుతాసమకన్య గలుగునో యని నేల యీనున వేవేల నీళ్లె వనఁగ

తే. గణనమీఱివయోరూప గరిమ మించు, లలనతోఁ దులఁదూఁగఁ జాలక భజించి
రుపరిభాగంబులనఁ జేది నృపలలామ, పట్టనపయోజముఖులు చూపట్టి రపుడు. 65

క. కమలోపమలోచన లా, కమలోక్షేంద్రుల విభాతిఁ గన, దగుజగదు
త్తమలోలాక్షీరమణుల, దమలో నెన్నుచు గుణార్హ తమలోభమునన్. 66

చ. అమరబలావకృష్టమయి యంబుధిఁ జేరి యొసంగెఁ బూరుషో
త్తమునకు మందరాగ మొక తన్వి న దెంత యటంచునీనగం
బరమ నమందరాగ మయి యావరసింధువు జేరి పూరుషో
త్తమున కొసంగెనార వని తామణి నంచు నుతించి రెంతయున్.

ఉ. కాంతికలాపరూపజిత కంతుజయంతున కీవసుంధరా
కాంతునకుం జరాచరయు గంబున నీ దగుకాంత లేమి యు
త్కాంతరశాలియై విధి చ రాచరయోజనచే సృజించె గా
కింతి ఝురిం గిరింబోడము నె యని పల్కిరి కొందఱయ్యెడన్.

సీ. తరుణ ధూర్తశిఖావతంసున కొక్క కా, త్యాయని గూర్చిన యరగొఱంత
రాజుతో సత్కళా రాశితో నక్షత్ర, జాతి దార్చిన పక్ష పాతరచన

యభినవచ్ఛాయతో నతిదుస్సహచ్ఛాయ, జేర్చిన నేరని చేతఁబట్టు
రతితో ననిందితాకృతితో మనుపగుణంబులవాని గూర్చిన మోహసృష్టి

తే. సమవయోవంశలావణ్యసద్గుణాభి
నుతుల నీదంపతుల శుభాన్వితుల సంఘ
టించి వారించికొనియె విరించి యనుచుఁ
బొగడె రోక కొంద ఆనంద పూర్ణఘణితి.

మ. అవి యాలించుచు వేడ్క నచ్ఛతరముక్తాలంకృతంబై ద్విజ
ప్రవరాధిష్ఠితమై యనంతమణికోభానిత్యనీరాజనో
త్సవదంబై తెలిదివి బోలు నిజసద్మంబుం బ్రవేశించె న
య్యవనీభర్త తరంగిణీప్రియసుతాహస్తాంబుజాలంబియై.

వ. ఇట్లు శుభలగ్నంబునం గృశావలగ్నయుం దానును నమందవిభవ సందీపిత నిజమందిర ప్రవేశ మంగళం బంగీకరించి గురుబుధకవి సమాజంబునకు నతిభాస్వద్రుచికలాపసౌభాగ్యంబు సంఘటించుచు రాజమండలంబునకు నక్షీణలక్ష్మీవిలాసంబు నవరించుచు మిత్రవర్గంబునకు నసంఖ్యాతర తురంగతరంగితశతాంగ సంఘాతంబు నొసంగుచు మహానటులకు మహనీయచిత్రాంబర సంపదలసొంపు సంపాదించుచు విద్యాధరులకు విపులవిపులాధిపత్యంబు వెలయించుచు మఱియుం దక్కిన మార్గణగణంబులకు వేర్వేఱ యగణితఫలంబులొసవించును విశ్వవిశ్వంభరాజనవిస్మయనీయ వితరణాచారీధురీణుండై విలసిల్లు నవ్విబుధరాజబాంధవుండు వివిధకల్యాణగుణ విభాసితంబగు నొక్కసమయంబున.

సీ. అత్రాసవృత్తి జెన్నలరి నూతనరాగ, మహిమ గుల్కెడి కల్కి మానికములు
నవసమాగమమునఁ జవులు వక్కాణించి మించజాలవె లంది మిన్నగములం
మరుస తేజీలపై ఖరి బొల్చిరతులని, రూఢిఁ జూపు నితాంత రుచిరమణులు
ప్రౌఢపుంభావసం భావనల్ పచరించి, ప్రబలు వామలోక రత్నతతులు

తే. గలయఁగీలించి చిత్రించి కన్నియలకుఁ, గామ నిగమరహస్య ప్రకాశనం బొ
నర్ప బన్నినయాత్మీయ నర్మభర్మ: హర్మ్యరాజంబునకు వేడ్క నరిగి యచట

సీ. బందీకృతాన్యరాడ్భవనలక్ష్మీ పరంప, రలు నిట్టూరుపుల్ పరపుకరణి
బుంజీకృత స్నేహ భూరిమోహానశక్తు, లను రాగకళికలఁ బెనఁచు కరణి
నంగీకృతాంగజై త్రాధిదేవత లాత్మ, సుమచోరు మచ్చంబు చూపుకరణిఁ
బ్రకటీకృతానంత రతి మూరులులతాంత, శరశాస్త్రసంచికల్ సాచుకరణి

తే. యంత్రపాంచాలికలు గొన్ని యగురుధూప, వితతి వెదలింపఁ గొన్నిదీ వియలు దాల్చి
గొన్ని విరివీవనలు వీవఁ గొన్ని పసిడి, తళుకుఁ జెలనాకులొసఁగ సంతసము లెసగ.

చ. చికిలిపసిండి గ్రాతనునుఁ జెంద్రిక వన్నియ మేలుకట్టునం
జగచక పర్వఁ గ్రొవ్విరులు చంపకముల్ సవి దేంట్లు మూతము
ట్టక నవకంపు గెంపు మెఱుగ డర్ల గని రాఁ దెలిముత్తియంపు బ
ల్సకినలకూకలం గిలకి లక్ ఎగు మోహనశయ్య నున్నెడన్. 74

శా. ఆకోలాహలశైల సంభవ రస వ్యాకృష్ణ నాళీ ప్రయు
క్తైక ప్రస్థితయై ప్రతిక్షణసభం గారాళ సంచారయై
వ్యాకీర్ణాంబర ఫేనయై విహితవ క్త్రాబ్జస్ఫురద్వేణియై
శ్రీకల్యాణ గుణార్ణవుం డలర వచ్చెన్ నూత్నరాగంబునన్.

ఉ. వచ్చినృపాలకేళి గృహ వాటము సెచ్చెలిపిండుచాటునం
జొచ్చి మెఱుంగుదేఱుతొగ చుట్టపురా మొగరంబుమాటుగా
నచ్చపలాక్షి నిల్వ నది యవ్వల భర్తకుఁ జూపె రాచసా
మ్మెచ్చట నైన నిత్యశుచి వృత్తులు మాటికొనంగ సేర్తురే.

మ. నవరత్న ప్రతిబింబదంభమున న న్నాళీకపత్రాక్షిద
త్సవయోరూపసఖుల్ భజింపఁగని లజ్జాయుక్తిమైఁ బోలెనా
ళివితానం బొకసేర్పునన్ వెడల నిల్చెం దాన వ్రీడావయ
స్య వధూటి లలితాంతరంగ చిర సఖ్యాభ్యాసబంధంబునన్.

సీ. అంబు జాంబకుపూన్కి నతినిర్మలస్థాణు, వున మించు వామార్ధ తను వనంగ
మోహ కాగ్రణియత్న మునఁ నోచి మగుడ, గంబము జేరుజంత్రంపు బ్రతిమ యనగ
సహకారతరుషరి గ్రహమునఁ దగియుప, ఘ్నావాప్తి యొదలని తీవ యనఁగ
మావంతు ప్రార్థనా మహిమ నాలానంబు, దరలివచ్చు మనోజ దంతి యనఁగ

తే. నట్టిరమణుండు దివియ న హార్యతనయ
విధుమణి స్తంభమున నర వెడలి బయలు
పడి పెనంగుచు మరలికం బ మొక కేల
నూని యూఁతయుఁ దక్కి పా న్పొయ్యఁ జేరె.

మ. మృదుకర్ణోత్పల సంగతాళికవధూ రిప్రేరణన్పొలెఁద
త్సదనాధారము మాని మానినిసదా ధారంబు భూభృజ్జయా
స్పదదోస్తంభము డాసెఁదాదృశభుజా స్తంభోచ్ఛ్రియానూనమై
భ్యుదిత స్తంభములయ్యె నంబకములా భూమండలస్వామికిన్.

క. అమ్మదితరత్నకటకచ, యమ్మదితనినాద మయ్యె నయ్యెడ జల మే
లమ్మని పతితోఁ దగు మే, లమ్మని సహజానురక్తి లాలింపుక్రియన్

శా. అశాగోధక మావృతాంబర మనూ ఘాలోక ముచ్చైస్తనో
దేశ ప్రావరనంబునై యలఘువృత్తిన్ శ్యామమందాక్షము
ద్రాఘుంభత్తిమిరంబు పర్వ మదనా ధ్వన్యుండు ఖిన్నాత్ముడై
యాశించెం గమనీయ రాజ కరలీ లాలంబ సంచారమున్.

ఉ. మంచు మునుంగుపూని లవ మాత్రము పద్మిని మోముఁదమ్మిఁదీ
పించమిఁ జన్నుమొగ్గ లవి భేద్యతరచ్ఛదగుప్తి నేమియు
న్మించమి నేఁకటం గడు భ్రమించుచు గత్స్నమనోవికాసవే
శాంచితవైభవంబునకుఁ నాసపడున్ నృపనేత్రభృంగముల్.

క. నవలానవలావణ్యా, ర్ణవలాలిత కాంతిరమకు నయనద్యుతులన్
నవనీ రాజన మొసఁగుచు, నవనీరాజాగ్రగణ్యుఁ డనియెం బ్రేమన్. 83

సీ. వరపద్మమకరముల్ కరగతంబులు నీకు, సతి నీవిచే యింత సడలరాదె
బహుళతచ్ఛదరాశి భవదక్షియుగళంబు, నేత్రాంచలం బింత నెరపరాదె
యనగదివ్యాహార ఖని నీదు కెమ్మోవి, లేమ ముద్దింత పాలింపరాదె
తావిగంబూరంపు దీవి నీమొగ మొక్క, పలుకింత నాపైని జిలుకరాదె

తే. చక్రవిజయుం బొనర్చె నీ చన్నుదోయి, కంచుకం బేల యింకఁ జాలించరాదె
నిర్మలామూల్యగుణరత్ననిధికి నీకు, వనజముఖి గ్రాస మిదియేల వదలరాదె. 84

సీ. లాలింతు నేఁ బాద నాళీకయుగళి నా, కట కేశ్వరత్వంబు గణనమీఱఁ
బాలింతు నేఁ గటి స్పర్శవైభవము నా, నేత్రాహ్వయంబు వన్నియకు నెక్కఁ
గీలింతు నేఁగుచ శ్రీలాభగరిమ నా, నాయకత్వము సార్థతాయుతముగ
శీలింతు నేఁ గర్ణ సీమాంతికంబు నా, కువలయరాజత్వ మవనిఁ బొసఁగ

తే. నిగనిగనిసంజకెంజాయ పొగడు దెగడు, మోవి యానిక మాని సంపూర్ణరుచిస
మగ్రత వహింతు నేనింతి మామకాఖ్య, రామవసునామ ముచితగౌరవము దాల్ప. 85

తే. అనుచు నరపతి కెంగేల నచలకన్య, కాత్రపార్థురగూఢాంగకములు దడవె
నొయ్య నాభీరుచాది నిమ్నోన్నతప్ర, దేశములు తద్విగాహేచ్ఛఁ దెలియుకరణి. 86

మ. కరళాధార మతి ప్రవాళశయగుప్తం బంచు నభ్యంతర
స్మరుఁ డుత్తంభితకంపలోలపటసంఘం బిల్వ బాలాపయో

ధరదుర్గంబు గ్రహించె రాజకర మే తజ్జాతసంత్రాసవై
ఖరిఁ దెల్పెన్ జఘనస్థలీవరణ జాగ్రద్ఘంటికా ఘోషముల్. 87

ఉ. తొయ్యలి ముద్దరాలు కుచ దుర్గము లాత్మశరైకవంచనన్
నెయ్యపు జేని పాల్పఱచి నీవియుఁ గోల్పడఁగాఁ దలంచెఁగా
కయ్యెడ నేలకోయుసిచె నాత్మశయద్వితయంబు మున్నె లో
నయ్యె పరాగ మై నృపక రార్పణ కింకఁ బెనంగ నేర్చునే. 88

క. అతినీతసమయుఁడై పతి, సతినీవి హరింప లజ్జ సనియెన్ దృఢయో
గత నీవిఁ గన్నబోంట్లును, గత నీవిక లైనవారి కడ నుండుదురే. 89

ఉ. చేడియకోమలాంగయన సీమలఁ జెల్వగుసోయగంపుఁ జే
యాడఁ బ్రభూతనూతనర సాకృతిఁ గ్రొంజెమరొయ్యనొయ్యఁ బై
యాడ గరంగి జాఱె నెడ నంటినకస్తురిరేఖ లాకుల
వ్రీడతమంబు లాత్మపద విన్ నిలుపోపకపోవుకై వడిన్. 90

సీ. నెలఁతగుత్తపు గుబ్బ నెత్తమ్మి మొగడల, నెలకూనసోఁకులు నిగుడకుండ
ముదితచందురకావి మోవిలేఁదలిరున, కలఘుద్విజాహతి యంటకుండ
మగువపెన్నెఱిసంపు మొగులుజొంపముఁ బ్రబ, కంపవాయాసంబు గదురకుండఁ
జెలువ కప్రపుఁబూఁత చిన్ని వెన్నెలలకు, ఘనతిరోధానంబు గలుగకుండ

తే. సిరుల నలరించెనిద్దంపు జిగిఘటించె, నొయ్య నెఱయించెనొకయింత యొఱపునించె
ననితనవ్యోపభోగకేళీ లాలతాంత, నాయకుఁడు చేదిమేదినీ నాయకుండు. 91

ఉ. భూసుతకీర్తి వేఁడ నుడి వో వని తావులగుబ్బగుత్తులన్
దేనియ లాన నానఁగడ తేఱని వాచవిపండు నిచ్చె భూ
షానివహంబు రాల్చె మృదు శాటిక మున్న యొసంగెసింధుసం
తానము గావునం గడును దారత నాలతకూనయొప్పుచున్. 92

ఉ. ముప్పిరిగొన్న వాచవుల మోహ మొకింతయుఁ దప్ప నీదు కన్
జొప్పులువిప్ప నీదొకతె జిం జెను రాఱఁగ నీదు మేన నె
ల్లప్పుడుఁ దృష్ణచేఁ దనివి నందఁగ నీదు నృపాలమౌళి నే
చొప్పననఁ బుట్టెనో భువన సుందరి సింధువరామృతంబునన్. 93

మ. సతిసాహిత్యరహస్య మీశువలనన్ సాధించి తోడ్తోనత
త్ప్రతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతుల ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁద
ద్ద్యుతికిం జొన్పుచు లోచనాంజనరస ప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచుఁ బ్రత్యలంకరణమౌ ఖర్యంబు దీపింపగన్. 94

శా. భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబు దెల్పెననవద్యంబై యవేద్యాంతరం
బై నిర్లేపకలాప మై క్రమ విముక్తానేకబంధానుసం
ధానంబై యపునర్భవ ప్రభవఖేదంబై విజృంభించుచున్. 95

క. సుమనోనాళీకార్పిత, సుమనోనాళీకకలన జొక్కుచు వసుధా
రమణియు రమణియు నీక్రియ, రమణీయత గాంచిరనవరతరతులన్.

సీ. అభిరామనవపల్లవారామసంజవా, టికలఁ గీరముల నాడించుకొనుచుఁ
బద్మాలయోదర ప్రౌఢసారసవీథి, నంచలవేడెంబు లరసికొనుచు
గాంగేయధామశృంగవిటంకముల నీల, కంధరోజ్జ్వలగతుల్ గాంచికొనుచు
విమలసింధుద్వీపవేదికా సరుణాస్త్ర, ఖగవిహారప్రౌఢిఁ బొగడికొనుచు

తే. రతియు జేతోభవుండు భారతియు నజుఁడు
శచియు నమరాధినాథుండు జలధిసుతయు
నబ్జనాభుండు ననమించి యఖిలసమయ
సముచితక్రీడ సలిపిరి సతియుఁ బతియు. 97

తే. ఇట్లతఁడు శైలజమఁ జొక్కు లెఱిగియొక్క
యలఘుసద్గోత్రనందన యయ్యెఁగీర్తి
యగతనయ యయ్యె జయరమ యచలభూతి
మహితయై మించె నపుడు సామ్రాజ్యలక్ష్మి. 98

సీ. ఆరాజు విమల విఖ్యాతి చంద్రిక నిచ్చ, రహి కెక్కె జాజాగర ప్రసంగ
మాఘనదానధారాపూర్ణవర్షము, ర్వరఁ బర్వడిగియె నవగ్రహార్తి
యాలోకహితు ప్రతాపాతపం బవిరతో, దయ రూఢి దగ నింకె దస్యుపంక
మాసద్గుణాబ్ధిచర్యామృతం బెల్లచో, దయివాఱ దరలె నామయవిభూతి

తే. యమ్మహాశైలదమనురాజ్యమున నిట్లు ఫలము లీనెడు చెట్లతో బాలవెల్లి
కాన్పుపసితో నఖండభోగములతోడఁ, బ్రజలు గాంచిరి భూరివైభవసమృద్ధి.

క. అని యిట్లు రోమహర్షణి, తనయుఁడు వసురాట్కథాసుధాసర మఖిలం
బును దెలుప విని మహోత్సవ, మునఁ బొదలిరి శౌనకాది మునికులచంద్రుల్.

## ఆశ్వాసాంతము

మ. దృఢబాహాబలభీమ భీమసమర ప్రేంఖజ్జయశ్రీపరి
బ్రఢిమాఢౌకితభూమ భూమహిత తూర్యధ్వానదత్తేశఘా

కృధమత్కారవిరామ నామకధన క్లామ్యన్మహాఢిల్లికా
గఢరాడాద్యరిభామ భామగరిమ గ్రస్తగ్రహాధీశ్వరా

క. ధాటీ బహుధాటీకన, ఘోటీ ఘోట్టాణకోటి ఖురకోటిరజ
శ్చాటీవృత హరిదవధివ, ధూటీకుచశైల ప్రబల దోర్బలలీలా.

## సుగంధివృత్తము.

సారసాహితీ సదర్థ్య చారిభూరిధీరసా, ధీరసాహసోరుదోర తిస్ఫురన్మహోరసా
హారసానుమత్తటీసు రాపగా సుధారసా, ధారసాధుకీర్తిహంస ధారినూత్నిసారసా

## గద్యము

ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందన ప్రసాదసామాసాదిత
సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య పర్యంకష చతుర్విధ కవితా
నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ
ప్రణీతంబయిన వసుచరిత్రంబనుమహాప్రబంధమునందు
సర్వంబును షష్ఠాశ్వాసము సంపూర్ణము.



# పోతులూరి వీరబ్రహ్మముగారి జీవితము



‘ భారతాధ్యాత్మిక ప్రభాభాగ్య మెక్కడ భరతజాతికిగాక యెవ్వరికిగలదు ? ’

అయ్యలారా! విశ్వప్రపంచైకవిజ్ఞానఫలదాయిని, వేదకల్పతరువున ఆలవాలము, సంకల్పమాత్రమున జగన్నిర్మాణ మొనర్పదగు మునుల తపోధనుల కాస్పదము, సత్యరతాదిదిదృశాదిక్షితులైన హరిశ్చంద్రాదు లేలిన పవనభూమి, పరశురామ, ద్రోణ, పాండవేయాది వీరులంగన్న వీరమాత శంకరాది మహాచార్యులకు పుట్టినిల్లు, భువనైకపావని యని ఖ్యాతి నందిన భరతఖండంబున నెందరో మహాత్ములు పుట్టి గిట్టి యున్నారు. మీరు గాంధీమహాత్ముడు తిలక్ మొదలగువారి నెందరినో చూచుచున్నారు. రామకృష్ణపరమహంసాదులను విని యున్నారు. రామదాసాదుల జీవితములను జదివియున్నారు. వారందరిని తలదన్నిన భూతభవిష్యద్వర్తమానవేది, అద్వైతసమాధినిష్ఠ, సక్కవేదాంతి, గృహస్థాశ్రమంలో వుండి పరతత్త్వ మెఱింగిన బ్రహ్మవేత్త, అతని కాలజ్ఞాన వచనములను జూచి వేదాంగవేత్తలు విభ్రాంతులైనారు. తత్వజ్ఞాన నైపుణి, గృహస్థాశ్రమమందుండియే నిత్యశుద్ధిగా నెఱపిన వైష్ణవ సంపత్తి, యోగీంద్రులు తలక్రిందు లగుట జూపిన మహాత్త్వము, వేనోళ్ళ పొగడని వేదాంతులే లేరు. అమ్మహనీయుని నిప్పటి నెఱింగిన వారు వేళ్ళమీద లెక్కపెట్ట దగినట్లుగా నున్నారు. అతడే పోతులూరి వీరబ్రహ్మ పరమయోగి ఆత్మతత్త్వవేత్త జీవితచారిత్రము జనసామాన్యము నకు సుబోధకముగు సులభశైలిలో యిందుమించు 200 పుటలలో సమకూర్చి ప్రచురించినాము. దానిం జదివినవాడే ధన్యుడు. నేడే పంపుడు యత్నింపుడు. దానివలన నీవొందు ఫలితము ముమ్మొగడు తెలియజాగలదు.

వెల రు 1-0-0

# బాబా ఆయుర్వేద నిలయం వారి దివ్యౌషధములు

## వెనీరియల్ గన్

ఇవి కొరుకు, పుండు, కీళ్ళనవాయి, మొదలగు వగైరా సుఖవ్యాధులు లేంద్ర కసుర్వాతం, పక్షవాతములకు, 1, 2, మోతాదులకే సుగుణమేర్పడి 5 మోతాదులలో సూపుమాపు దివ్యౌషధం సీసా 1కి రు 1_0_0

## అనాస్

పసిబిడ్డలెక్కువగా మనదేశమందే మృతినొందుట జననీ, జనకుల అశ్రద్ధయే! ర్భవతి గానున్న తల్లి శిశుపోషణ కనుగుణమగు ఆహార విహారాదుల లోపమున, అనా రోగ్యముగబిడ్డ బుదయించి, పలువిధ చికిత్సలతో పరితపించుచున్నారు. బిడ్డల అనాస్ 13 రకాలు, నలుపు, తెలుపు, ఆకుపచ్చ, విరేచనాలు, ఆకలిలేకుండుట, పొట్టనరములు ఆకుపచ్చగానుండుట గర్భవాతం కడుపునొప్పి, నిద్రలేకుండుట పొయబ్బెట్టుట నోటిజల్లి కోతిపిర్ర పుండ్లు పొక్కులు వగైరాలకుమచ్చుటలో అమోఘమై రోగం పోల్చలేనప్పుడు పవ 3 పూటలు మాత్రమే వాడదగు బాలరక్షకి. వెల 0_10_0

విశేషము:—శిశువుపుట్టగనే కాల్కిలు, పగైరాభస్మములను వాడుటకు బదులుగా యీమందును మూడుపూటలు సేవింపజేసినచో అనాస్‌రోగ మెన్నటికిని సంభవించనేరదు. అనాస్‌పొక్కులు, పుండ్లు, కోతిపిర్ర, నోటిలోకలుగుజల్లి వగైరాలకు, పైమందు 3 పూటలు వేసి, మా అనాస్‌పౌడరు వెన్నతోకలిపి పైనపూయుచో అమోఘముగా పనిచేయును. వెల 0_4_0

## బాలవర్ధని

పిల్లలపుష్టికి, నిక్కాకలు మేహావుడుకు శ్లేష్మపైత్యవుడుకులు, జ్వరము, దగ్గు అరుచి, యితరమందులవలన కలిగేవాంతి ( చల్లి ) బోజనపదార్థములం దయిష్టత వగై రాల కమోఘముగా పనిచేయును. సీసా 1కి 0_10_ 0

## పంచరత్న

మలబద్దము, మలబద్ధంచే కలిగిన అజీర్ణం, కడుపునొప్పి, మెహనరములు, లాగుట, కాళ్ళతీపు, బలహీనత, ఉష్ణమును హరించుటేగాక, ఆకలిపుట్టి, ఇంద్రియపుష్టిని కలుగ జేయుటలో అమోఘమైనది.

వాడేవిధం:—రాత్రి భోజనం అయిన గంటతర్వాత వక ఔన్సు వేడినీళ్ళలో టి, చమ్చా (½ తులం) పొడివేసి, వేడిగానున్నపుడే పుచ్చుకున్నచో వుదయమునకొక విరేచనమై సుఖము కానవగుసుసు. ఇట్లు 40 రోజులుపుచ్చుకున్నవారు వజ్రదేహులగు టలో సందేహములేదు. పత్యంలేదు.

20 రోజులకు సరిపడుమందు వెల రు 1_8_0.      40 రోజులకు రు 2_8_0.

---

బాబా ఆయుర్వేద నిలయం, హెడ్డాఫీసు — ఏలూరు.

# పూర్వకవుల పద్యకావ్యములు

| | రు | అ |
|---|---|---|
| వసుచరిత్ర మూలము | 1 | 0 |
| డిటో తా. సహితము | 2 | 0 |
| డిటో టీకాతాత్పర్య సహితము క్యాలికో | 5 | 0 |
| విజయవిలాసము | 0 | 8 |
| మనుచరిత్రము | 0 | 12 |
| డిటో తా. సహితం | 2 | 8 |
| డిటో టీకాతాత్పర్యము | 4 | 0 |
| రాజశేఖర విలాసము | 0 | 12 |
| వైజయంతీ విలాసము | 0 | 12 |
| శశిరేఖాపరిణయము | 0 | 12 |
| శృంగార నైషధము | 1 | 0 |
| పాండురంగ మహాత్మ్యము | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| శతకరత్నములు 1 భా | 0 | 8 |
| డిటో 2 భా | 0 | 8 |
| బిల్హణీయము | 0 | 12 |
| శశాంక విజయము | 2 | 8 |
| పోతన రత్నములు | 1 | 0 |
| సారంగధర చరిత్ర | 0 | 12 |
| పారిజాతాపహరణము | 0 | 12 |
| మొల్లరామాయణము | 0 | 12 |
| భక్తచింతామణి వ\|\| సు | 0 | 8 |
| కళాపూర్ణోదయము | 1 | 0 |
| డిటో సాణ్యం క్యాలికో | 2 | 8 |
| శృంగార శాకుంతల | 0 | 12 |
| భాగవతము సప్తమస్కంధము (ప్రహ్లాద చరిత్ర) | 0 | 12 |
| డిటో క్యాలికో బైండు | 1 | 12 |
| రసికజనమనోభిరామము | 1 | 0 |
| భర్తృహరి సుభాషితము | 1 | 0 |
| డిటో సాణ్యం క్యాలికో | 3 | 8 |
| జైమినీ భారతము | 1 | 0 |

| | రు | అ |
|---|---|---|
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 | 8 |
| నలోపాఖ్యానము టీకా | 0 | 8 |
| పంచతంత్రము | 0 | 12 |
| వేమన పద్యములు | 0 | 12 |
| డిటో తాత్పర్య సహితం 300 పే\|\| | 1 | 0 |
| డిటో పెద్దది క్యాలికో | 3 | 0 |
| సుభద్రాపరిణయం | 1 | 0 |
| రాధామాధవ సంవాదం | 0 | 12 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 0 |
| నీతిచంద్రిక | 0 | 8 |
| రామకర్ణామృతము | 1 | 0 |
| డిటో మేలుప్రతి | 2 | 8 |
| కృష్ణకర్ణామృతము | 1 | 0 |
| డిటో మేలుప్రతి | 2 | 8 |
| బాలరామాయణం | 0 | 4 |
| సుమతి శతకం | 0 | 4 |
| కృష్ణ శతకం | 0 | 4 |
| కుమారీ శతకం | 0 | 4 |
| కుమార శతకం | 0 | 4 |
| వేమన శతకం | 0 | 4 |
| కుచేలోపాఖ్యానం | 0 | 6 |
| అంబరీషోపాఖ్యానం | 0 | 6 |
| దాశరథీ శతకం | 0 | 6 |
| భాస్కర శతకం | 0 | 8 |
| నరశింహ శతకం | 0 | 8 |
| గజేంద్రమోక్షం | 0 | 8 |
| రుక్మిణీకళ్యాణం | 0 | 8 |
| ఆంధ్ర నామసంగ్రహం | 0 | 10 |
| అమరం ప్రథమకాండ | 0 | 10 |
| ప్రహ్లాదచరిత్ర సప్తమస్కంధం | 0 | 12 |
| నీతిశాస్త్రం టీకా | 0 | 4 |

యస్. అప్పలస్వామి అండ్ సన్సు, రాజమండ్రి.